శ్రీరస్తు.

# జైమినీభారతము



ఇది,

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవిగారిచే

రచియింపఁబడినది.



పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీసత్యనారాయణ బుక్కుడిపో,

రాజమండ్రి.

1940

వెల రు. 1—0—0.

# పీఠిక.

పిల్లలమఱ్ఱి వంశజుఁడైన పినవీరభద్రకవి నియోగిబ్రాహ్మణుఁడు. తండ్రిపేరు గాదయామాత్యుఁడు. తల్లి నాగాంబ. అన్న పెదవీరన్న. భారతీతీర్థు లితని గురువు. ఈతని గోత్రవిషయమై యీ క్రిందిపద్యమువలన నన్నయభట్టుయొక్క భారద్వాజస గోత్రమని యూహింపవలసియున్నది.

మ. కవులన్ బంకజగర్భ సన్నిభుల వక్కాణింతు వల్మీక సం
భవునిన్ వ్యాసునిఁ గాళిదాసు బిలహుణ్ బాణున్ మయూరున్ శుకున్
భవభూతిన్ శివభద్రుమల్హణుని ఘంటామాఘునింజోరభా
రవి మానన్నయభట్టుఁ దిక్కకవి నెఱ్ఱాప్రగ్గడన్ సోమునిన్.

ఇతని కాలనిర్ణయమునుగూర్చి కవిజీవితములలో భారతీతీర్థుల శిష్యుఁడగుటచే ౧౩౦౦ లగాయితు ౧౩౫౦ వరకు నున్నవాఁడని చెప్పబడియున్నది. ఇతఁడు భారతీతీర్థుల ప్రియశిష్యుఁడగుటచే నాకాలమువాఁడేయని చెప్పవలసియున్నది.

ఇతని కవిత నిరుపమానమైఁ దిక్కన సోమయాజి కవనంబును బోలియుండెను. ఇతనిని భారతకవులతోఁ బోల్పవచ్చును. ఇతఁడు జైమినిభారతాశ్వమేధ పర్వమునుఁ దెలిగించి సాళువగుండ నృపాలున కంకితమిచ్చెను. ఇతఁడు జైమినిభారతమును దెలిగించు విషయమై యొక చిన్నకథగలదు. సాళువగుండ నృపాలుఁ డొకనాఁడు నిండుపేరోలగంబున నీ చినవీరన్నతో సల్లాపములాడుచు,

క. నామది నిరతము భారత
రామాయణకథలఁ బ్రేమరంజిలు నందున్
జైమినిభారతమనఁగా
భూమి నపూర్వము పురాణములగణియింపన్.

గీ. ఆపురాణంబుఁ గనఁదెనుఁగయ్యె నేనిఁ
జెప్ప నేర్చిన కవియుఁ బ్రసిద్ధుఁడేని
తెనుఁగునుడికారమునమించు గనియ నేని
కుందనముకమ్మవలచిన చందమగును.

అను జైమినిభారతమునుఁ దెలిగింపసమర్థతగలిగిన వారెవ్వరనగా శాస్త్రిపండి తులు కొందఱి పేరులు చెప్పుచు పినవీరన్నయే సమర్థుఁడని నిశ్చయించిరి. రాజు కొలది

కాలములో గ్రంథము పూర్తిచేసి యీయగల సమర్థులెవ్వరన పినవీరన్నయే సమర్థుడనిరి. ఎంతకాలములో సంపూర్ణమగునని రాజు ప్రశ్నింప కొందఱు సంవత్సరమనియు మరికొందఱారుమాసములనియుఁ జెప్పిరి. మూడునెలలకే పూర్తియగునాయని పినవీరన్నను రాజు ప్రశ్నింప 'తమసెలవగుచో యొకనెలకే పూర్తిజేతు' నని యనెను. అందులకారాజు తన్నెగతాళి చేయుచుండెనని యెంచి మిగుల గోపంబున 'యొక మాసంబునకు దేకున్నచో' యనుచుండ పినవీరన్న 'మీయిచ్ఛానుసారముగ జేయవచ్చు' ననియెను. సాళువగుండ నృపాలుఁడు వెంటనే కర్పూరతాంబూల మొసఁగి గ్రంథరచన కనుజ్ఞనిచ్చెను. అప్పటినుండియు పినవీరన్న వారాంగన వీటియందే కాలముగడుపుచు భోజనమునకు మాత్రము యింటికి వచ్చుచుండెను.

అన్న పెదవీరన్న తమ్ముఁడగు పినవీరన్న రాజునొద్దచేసిన సమయము నాలించి యతిభీతుఁడై యొకపరి పినవీరన్నను జేరి "తమ్ముఁడా! నీవు చిన్నప్పటినుండియు కడు దుడుకుతనముగనే ప్రవర్తించియుంటివి. మీదు మిక్కిలి వారాంగనాలోలుఁడవైయుంటివి. భూపాలురనొద్ద నావిధముగ బ్రతినపట్టవచ్చునా? ఏమి చేయదలంచితివి?" యన యతఁడు నవ్వి 'అన్నా! ఆవిషయమై నీవేమాత్రమును భయపడకుము. ఆవిషయమంతయు నేఁజక్కఁబెట్టువాఁడ' ననుచునే వెలవెలంది వీటినిగూర్చి వెడలిపోయెను.

గడువుదినములు సమీపించినను పినవీరన్న గంటమెత్తి యాకుపై వ్రాసిన జాడ యేమియు పెదవీరన్నకు గనబడలేదు. గడువుదినము రేపనగా మరల పెదవీరన్న తమ్ముని హెచ్చరించెను. ఆనాటిరాత్రి పినవీరన్న వదినెగారిచే యొకగది నలికించి యందముగ రంగవల్లిదీర్పించి యొక ఆముదపుదీపమును కొంత ఆముదమును నాగది యందు బెట్టించి తానాగదిలో, ప్రవేశించి గడియవేసుకొనియుండెను. అనంతరము కొంత సేపటికి పదిగంటములచే వ్రాయు చప్పుడును గురకలును వినబడుటచే అన్న పెదవీరన్న సందేహనివృత్తికై కొంతకాలమూరకుండి తలుపుసందులోనుండి జూచెను. సర్వాభరణభూషితయైన యొక సుందరాంగి గంటము చేతబట్టి చకచక యాకుపై వ్రాయుట యాతఁడు జూచెను. బావగారు జూచుచుండిరని యాసుందరి గ్రహించి పినవీరన్నను లేపి యంతర్హితయయ్యెను. పినవీరన్నయు మిగిలిన భాగము పూర్తిచేసి మరునాటి గొలువుసమయంబునకు అన్నగారితో పోయెను.

రాజును అంతస్వల్పకాలములో నాగ్రంథము పూర్తిచేసెనందున మిగుల సంతసించి యాగ్రంథము జదువననుజ్ఞయిచ్చెను. అన్నయగు పెదవీరన్నయామూలాగ్రముగ గ్రంథమును జదివి వినిపించెను. అనంతరము కవి యాశ్వాసాంతమందు జెప్పిన,

క. ప్రేమమున శ్రోతవక్తృల
"జామీకరణహయము ధవళచామరములు నా
నామణివిభూషణంబులు
గ్రామముఁగృపసేయవలయు గ్రంథసమాప్తిన్."
అనినరీతిగా బహూకరించెను.

అట్టి సమయంబున కొందఱు పండితులు 'ఇంతస్వల్పకాలమున నీ గ్రంథము పూర్తిచేయుట యత్యాశ్చర్యము. ఎట్లుముగించితి' వని పినవీరన్నను ప్రశ్నింప 'వాణి నారాణియైయుండగా నేమిలోపము? ఈ గ్రంథమంతయు నిన్నటిరాత్రియే ముగింప బడిన' దని చెప్పెను. జగన్మాతయగు వాణిని యీతఁడు తన రాణియనుచుండెగాన నీతఁడు పండితుఁడుగాఁడని ఏకగ్రీవముగా ననుచుండిరి.

వెంటనే యశరీరవాణి 'వాణి జగంబులకు మాత. పినవీరన్న పరమేష్ఠియవతారము. గావున వాణి యీతనికి రాణియైనది. ఇఁక మీసంశయము వదలుకొనుఁడు' అనెను. అప్పలుకులాలించి యందరును సత్యద్భుతముతో యాతనిని కడుంగడు నాదరించిరి.

ఇతనితాతయు, తండ్రియు, అన్నయుగూడ కవులైనట్లు యీక్రింది పద్యము వలన దెలియును.

క. తాతయుఁదండ్రియు నగ్ర
భ్రాతయునుం దానుభువనభాసురకృతి ని
ర్మాతలు పిల్లలమఱి వి
ఖ్యాతునిఁ బినవీరుఁబోలఁగలరేసుకవుల్.
ఇతఁడు తనకవిత్వమునుగూర్చి యీక్రిందిపద్యమును చెప్పియున్నాడు.

ఉ. అల్లననిచ్చుచెంగలువలందు రజం బనుకప్పురంబుపైఁ
జల్లఁగఁ జల్లనై వలచుసౌరభముల్ వెదచల్లుభావముల్
పల్లవహస్తచన్నుగవపయ్యెద జీబుగఁ దోచుభాతిగాఁ
బిల్లలమఱ్ఱివీరన యభిజ్ఞుఁడు చెప్పఁగ నేర్పుఁ గబ్బముల్.

ఈతఁడింకను శృంగారశాకుంతల, అవతారదర్పణము, నారదీయము, మఖమాహాత్మ్యము, మానసోల్లాససారము, అను పుస్తకములురచించెను. ఈ యైదుపుస్తకములలో నొక్క శృంగారశాకుంతలయే ప్రచారమందున్నది. ఇది చిల్లర వెన్నమంత్రియను నియోగి ప్రభువున కంకితమిచ్చెను. ఇతఁడీ గ్రంథములగాక 'పురుషార్థసుధానిధి' యను మరియొక గ్రంథము రచించినట్టు ఆంధ్రకవుల చరిత్రయందు చెప్పబడియున్నది.

ఇతఁడు యోగమహిమగలవాఁడని కవిజీవితములలోని ఈక్రిందికథవలన తెలియుచున్నది.

ఒకరోజున పెదవీరన్న శివపూజచేయుచుండఁగా పినవీరన్న భోజనమునకై వచ్చెను. భోజనమునకువచ్చిన యాతఁడు నిముషమాత్రంబైన నిలువఁడనియు, ఆతఁడు భుజించిన శివనైవేద్యము చేయుట కూడదనిపనియనితలంచి తనపిల్లలనందరను చెరువునకు గొంపోయి కడుపులోపల వెలుపల శుభ్రముగ కడుఁగుకొని స్నానముచేయించి రావలసినదనియెను. పినవీరన్నయు నీబాలుర తటాకమునకుం గొంపోయి పొట్టలుచీల్చి కడుపులోపల పైన శుభ్రముగా తోమి యాశవంబుల భుజముపై వైచుకొని యింటికరుదెంచెను. యాబాలశవంబులఁజూచి పెదవీరన్న కన్నకడుపుగావున నొక్కపెట్టున రోధన మొనరించుచుండెను. పెదవీరన్నభార్యమాత్రము మరది మహిమ లెఱింగినది గావున యాతని లీలగానెంచి యూరకుండెను. అనంతరము పినవీరన్ననుజూచి "మరదీ పిల్లలనుదీసికొని భోజనమునకురమ్ము" అనియెను. వెంటనే పినవీరన్న యాబాలుర పేర్లతో పిలచిన వారు వచ్చుచుంటిమనుచు పినవీరన్ననుజేరిరి. అదిజూచి పెదవీరన్న మిగుల సంతసముతో తమ్మునింగూడి భోజనమొనరించెను. తమ్ముని యోగమహిమకు కడుంగడు సంతసించెను. ఇట్టివిచిత్రచర్య లెన్నియో గావించెను. గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమించితిని.

ఇట్లు సుజనవిధేయుఁడు,

దేవరకొండ అప్పన్న శాస్త్రి.

# విషయసూచిక.

## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము



## చతుర్థాశ్వాసము



## పంచమాశ్వాసము

## షష్ఠాశ్వాసము

## స ప్త మా శ్వా స ము

## అష్టమాశ్వాసము

# ఆకెళ్ళ వెంకటశాస్త్రులుగారి జ్యోతిషగ్రంథములు.

## జా త క మా ర్తాం డ ము.

1 వ భాగము 1—8—0

ఇందు రాసి అంశ ఆరూఢ చక్రములు వేయుట మొదలగు సంజ్ఞలు, ద్వాదశ భావములు, మహాదశాంతర్దశల, విదశలపట్టిక, గోచారమును తెలుసుకొనువిధము, వ్రాయబడినది.

## జా త క మా ర్తాం డ ము.

2 వ భాగము 1—8—0

ఇందు గ్రహస్ఫుట, లగ్నస్ఫుటాదిగణితములు, ద్వాదశభాగములు, మహాదశాంతర్దశ ఫలములు వ్రాయుట, తెలుసుకొను పద్ధతి, సులభముగ గ్రహింప గల్గుదురు. విశేషాంశములతో 1000 శ్లోకములు గలవు.

## జా త క మా ర్తాం డ ము.

3 వ భా గము 2—0—0

దీనియందు యేలగ్నమునకు యేగ్రహము యెక్కడనుండిన యేయేఫలముల నిచ్చునో ఆవివరమంతయు మేషలగ్నము లగాయితు మీనలగ్నము అఖరువరకు 12 లగ్నములకు యావత్తు ఫలములు సంపూర్ణముగా శ్లోకార్థములతో వ్రాయబడినవి. కొలది ప్రతులు మాత్రమే గలవు. త్వరపడుడు.

## జ్యో తి ష వి ద్యా ప్ర కా శి క.

1 వ భాగము 1—0—0

1 సంజ్ఞాధ్యాయము 100 పేజీలు నక్షత్రములు, గ్రహములు, రాసులు, వీటి స్వభావములు, వీని ఉపయోగములు మొదలగునవి.

### 2 వ భాగము 1—0—0

2 గణితాధ్యాయము. 112 పేజీలు.

జననకాల ఘడియలనుబట్టి జన్మలగ్నమును స్థిరపరచుట, ఆరూఢచక్రము, గ్రహస్ఫుటము, మొదలగు యావద్గణిత విషయములు యిందు విమర్శింపబడినవి.

### 3 వ భాగము 3—0—0

3 భావఫలాధ్యాయము 400 పేజీలు.

ద్వాదశభాగఫలములు అనగా వాటియొక్క సంజ్ఞలును జాతకునియొక్క రూపలక్షణముల ఆయుర్భాగ్యముల వివరముగా దారాపుత్రాది విషయములు జాతకుని యొక్క ఉద్యోగము జీవనము ధనలాభము ధనవ్యయము మొదలగు ద్వాదశ భావఫలములు విమర్శింపబడెను.

### 4 వ భాగము 2—0—0

4 దశాఫలాధ్యాయము 300 పేజీలు.



శ్రీ

# జైమినిభారతము

## అశ్వమేధపర్వము, పీఠిక.

---

### ఇష్టదేవతాస్తుతి.



లావణ్యపయోనిధిత్రివళివీచీమధ్యరోమావళి
వ్యాళానల్పసుఖైకతల్పుఁడు జగద్వ్యాపారలీలావతా
రాలంకారవిహారి శౌరి సదయుండై సాళ్వగుండక్షమా
పాలాగ్రేసరనారసింహుని నదభ్రశ్రీయుతుం జేయుతన్. 1

చ. జడముడి జాహ్నవీతటనిశాకరపోతముఁ జూచి యెవ్వ రీ
కొడిమెలు గట్టి పెండ్లికొడుకుం గడియారము మోవఁజేసి రం
చడుగ వివాహవేదిపయి సంబిక సెచ్చెలిఁ జూచి నవ్వువా
మృడుఁడు నృసింహశౌరికి సమిజ్జయముల్ దయసేయుఁ గావుతన్. 2

మ. పలుకుందొయ్యలితోడికూటములు పెంపం దమ్మికూటంబులో
నలుమోముల్ సమకాలసౌఖ్యములఁ జెందన్ రామి నొయ్యారపుం
బొలయల్కన్ ముఖమండలిన్ మలఁచునంభోజాసనుం డిచ్చు భూ
తలనాథాగ్రణి నారసింహునకు నిత్యం బైనదీర్ఘాయువున్. 3

మ. తొలుమ్రొక్కుల్ గొనువేల్పుఁ గొల్తు శశభృత్కోటీరుఁ గోటీరట
త్కులభూషాంకితగాత్రు గాత్రమరసంఘ స్తోత్ర వేళా నిర
ర్గళ ధారాళ కటు ప్రదానతటినీ రంగ ద్విరేఫాలికా
కలికాలోలవిచారుఁ జారుహరిభుక్ప్రాలంబు లంబోదరున్. 4

సీ. ప్రణవపీఠమున మంత్రపరంపరలు గొల్వ నుండు నేదేవి పేరోలగంబు
భావజ్ఞులకుఁ బరాపశ్యంతిమధ్యమా వైఖరు లేదేవి వర్ణసరణి

జపహార కీర పుస్తక విపంచిసముంచితంబు లేదేవిహస్తాంబుజములు
కుందేందుమందారకందళీబృందంబు చంద మేదేవియానందమూర్తి
తే. కాంచె నేదేవి కాంచనగర్భచతుర, పూర్వదంతకవాటవిస్ఫుటమనోజ్ఞ
చంద్రకాంతశిరోగృహస్థలవిహార, మమ్మహాదేవి వాగ్దేవి నభినుతింతు. 5

మ. కవులం బంకజగర్భసన్నిభుల వక్కాణింతు వల్మీకసం
భవునిన్ వ్యాసునిఁ గాళిదాసు బిలహున్ బాణున్ మయూరున్ శుకున్
భవభూతిన్ శివభద్రు మల్హణుని ఘంటామాఘునిం జోరు భా
రవి నూనన్నపభట్టుఁ దిక్కకవి నెఱ్ఱాప్రెగ్గడన్ సోమునిన్. 6

క. అని యిష్టదేవతాప్రా, ర్థనమ్మొ నాదిసుకవివినుతమునుం గావిం
చి నిలిచి పెల్లగునుల్లం, బునందు నే నొకపురాణముం జెప్పంగన్. 7

క. ఉద్యోగించి సుకవిజన, హృద్యంబును నాద్యము మఱి యితిహాసానే
కద్యోతితపద్యాఢ్యై, శద్యం బైనదియుఁగా విచారించి తగన్. 8

క. స్తుత్యముఁ గలికల్మషరా, హిత్యము నాఖ్యాయికావిహితబీజచతు
ష్పీత్యము శ్రీహరికథలను, నిత్యంబును నైనజైమినిజభారతమున్. 9

శా. జంబూద్వీపములోన నెంతయుఁ బ్రశస్తం బైనదీని న్నట
ద్దృంభాకుండలజూటకోటరకుటీధృత్స్వర్ధునీవీచికా
లంబిస్విన్ననవేందుకందళసుధాలంకారవాగ్వైఖరిన్
జంబూకావ్యము చేసెదన్ బుధజనశ్లాఘానిరాఘాటతన్. 10

క. సాళువ నరసింగమహీ, పాలుని నత్యంతఘనకృపాలుని నసుహృ
త్పాలితనగరీపళ్య, త్పాలుని నాచేయుకృతికిఁ బతిఁ గావింతున్. 11

వ. అని ప్రబంధంబుఁ జెప్ప నుద్యోగించుసమయంబున. 12

ఉ. భారతవంశమండనుఁడు పాండవ గాండివముక్త బాణసం
భార తత ప్రభావ నుతిపారగుఁ డంచిత గో మహీ తులా
భార తదంగ దాన పరిపాక సమగ్ర యశోవిలాస శో
భా రతశాలి గుండనరపాలనృసింహుఁడు గహ్వరీస్థలిన్. 13

సీ. తనభుజాపరిఘుచేత ధరావరారోహ భరియించి బర్బరబాహుఁ డయ్యెఁ
దనప్రతాపంబుచేత దిగంతరంబుల దీపించి యంబరాదిత్యుఁ డయ్యెఁ
దనదానగరిమచేత సురాగములపెంపు దండించి యైవరగండఁ డయ్యెఁ
దనమహత్త్వంబుచేతఁ బురాణపురుషుని మఱపించి చౌహత్తమల్లు డయ్యె
తే. రాజమాత్రుండె ధరణీవరాహబిరుద, వర్ణఫలకాయమానదుర్వారగర్వి
తాహితోర్వీశవిపులదోరంతరుండు, సాళ్వగుండయనరసింగ జనవిభుండు. 14

వ. ఆరాజపరమేశ్వరుం డొక్కనాఁడు కురు కుకుర కరూశ శక మగధ మరాట లాట భోట గాంధారాది సింధుపరివేష్టిత వసుంధరారమణ కిరీట మణిగణ కిరణ జాల బాలాతపస్మేర రంజిత తరుణచరణారవిందుండును, లీలావతీ కరకిసల యాలోల చమరవాల చామర సమీరచలితాంత కుంతలుండును, నాయికాముఖర గానతానమానబిరుదప్రపంచసంచితానందకందళిత మందస్మితవికస్వరగండమండ లుండును, సభాభవనాభినవ రత్నస్తంభదర్పణప్రతిబింబితమనోహరాకారుండును నై యర్హాసన సమాసన్న రాజన్యశిరఃప్రసవవాసనాముద్రితం బైనభద్రాసనంబునం బేరోలగం బుండి పురాణేతిహాసకథాప్రసంగంబుల వినోదించుచు. 15

ఉ. ఆదట సప్తసంతతులయందును నొక్కొక కాలమందు వి
చ్ఛేదము గల్గు నాటిటికిఁ జెప్ప విపర్యయ మేయుగంబునన్
లేదు కవిత్వసంతతికి నిక్కము తత్కవితావిలాసమున్
జాదులు నిష్టదైవము ప్రసాదము నా హరికీర్తనంబునన్. 16

క. నామది నిరతము భారత, రామాయణకథలఁ బ్రేమ రంజిలు నందున్
జైమినిభారత మనఁగా, భూమి నపూర్వము పురాణముల గణియింపన్. 17

తే. ఆపురాణంబు గనఁ దెనుఁ గయ్యె నేనిఁ, జెప్ప నేర్చినకవియుఁ బ్రసిద్ధుఁ డేనిఁ
దెనుఁగు నుడికారమున మించు గనియె నేనిఁ, గుందనము కమ్మవలచినచంద మగును.

వ. అని సభాసదులమొగంబులు చూడ నవధరించిన నారాజసత్తము చిత్తం బెఱింగి వా రిట్లని విన్నవించిరి. 19

## కవివంశప్రశంస.

క. ఏరీతి నెఱిఁగెనో పిన, వీరన దేవరతలంపు విఖ్యాతముగాఁ
బేరును బెట్టిడియును దన, పేరుగ రచియింపఁ బూనె పేశలఫణితిన్. 20

క. తాతయుఁ దండ్రియు నగ్ర, భ్రాతయునుం దాను భువనభాసురకృతిని
ర్మాతలు పిల్లలమఱివి, ఖ్యాతునిఁ బినవీరుఁ బోల గలరే సుకవుల్. 21

సీ. అమృతాంశుమండలం బాలవాలముగాఁగ మొలిచె నొక్కటి జగన్మోహనముగఁ
జిగిరించె విలయసింధుగతకైతవడింభశయనీయవరపలాశములతోడఁ
బితృదేవతలకు సంచితసత్రశాల యై చెట్టు గట్టెను గయాక్షేత్రసీమ
నిలువ నీ డయ్యె నిందీవరప్రియకళాకోటీరునకు భోగికుండలునకు
తే. మఱ్ఱిమాత్రంబె పిల్లలమఱ్ఱి పేరు, పేరువలెఁ గాదు శారదాపీఠకంబు
వారిలోపలఁ బినవీరువాక్యసరణి, సరసులకు నెన్నఁ గర్ణరసాయనంబు. 22

క. అని విన్నపంబు చేసిన, ననుఁ గనుఁగొని యలరి సాధనంబు ఋణముగాఁ
దినక యుపార్జించె యశో, ధన మిటు గా వలదె యాశ్రితత్వం బనుచున్. 23

క. దరహాసరసముఁ దాంబూలరసముఁ గప్పురపుఁబలుకులుఁ గుంకుమపూ
బెరసినగతిఁ దోఁపఁగ స్వాదరమున నిట్లనియె భారతజ్ఞులతోడన్. 24

ఉ. అల్లన విచ్చుచెంగలువలందు రజం బనుకప్పురంబు పైఁ
జల్లఁగఁ జల్లనై వలచు సౌరభముల్ వెదచల్లు భావముల్
పల్లవహస్త చన్నుఁగవపయ్యెద జీబుగఁ దోఁచుభాతిగాఁ
బిల్లలమఱ్ఱివీరన యభిజ్ఞుఁడు చెప్పఁగ నేర్చుఁ గబ్బముల్. 25

వ. అని సమీపంబునం గొలిచియున్న నన్నుఁ గృపాతరంగితాపాంగంబున విలో
కించి మామకమనోరథం బెఱింగినట్లు చెప్ప నుద్యోగించితివి హృద్యానవద్యగద్య
పద్యానుబంధంబుగాఁ బ్రబంధం బంధ్రభాషను జైమినిభారతమునం దశ్వమేధ
పర్వంబు నిర్విఘ్నంబుగా రచియింపు మని యానతిచ్చినఁ బ్రసాదంబని యంగీ
కరించి యిమ్మహాప్రబంధంబునకు మంగళాచారంబుగాఁ దదీయవంశావళివర్ణనం
బభివర్ణించెద. 26

## కృతిపతివంశవర్ణనము.

సీ. శార్ఙ్గబాణాసనజ్యావల్లరీజాతబంధురకిణగణోద్భాసితంబు
లీలోపధానవేళాలాలితశ్రీకబరిపుష్పవాసనాభాసురంబు
నభసంగమాన్వయనాథవాహనరాజకందరాస్ఫాలనకర్కశంబు
పాంచజన్యోద్భూతపాండుచ్ఛవిచ్ఛటాచంద్రికారసముహుఃక్షాళితంబు
తే. దానవారాతిదక్షిణేతరకరములు, రాజితం బందు వెలయించె రాజకులము
కైరవాప్తుండు దనకుఁ బతంబుగాఁగఁ, గువలయానందకరలక్ష్మిఁ గొమరు మిగిలి. 27

చ. ఉడుపతి వంశకర్త మహిమోన్నతి కెయ్యది మేర నాఁడు పా
ల్కడలి జనించినప్పుడు దళంబుగ నంటిన మేనిజడ్డు వోఁ
గడుగుకొనంగ సబ్బె సని కాశివు నొదలయేటఁ బాదముల్
దడఁబడ నోలలాడుచు హళాహళిగా పడి నీఁదులాడెడిన్. 28

శా. ఆవంశంబున నుద్భవించె నమిత క్ష్మాధీశ హాటీరకో
టీ విన్యస్త వినూత్నరత్న రుచివాటీ విస్ఫురత్పాదరా
జీవద్వంద్వుఁడు గుండశౌరి బయలక్ష్మీకంధరా బంధుర
గ్రైవేయాంతర పద్మరాగసఖ దోఃఖడ్గప్రతాపార్కుఁడై. 29

మ. జననం బందిరి గుండభూవిభునకున్ సంధాకబంధారి గౌ
తనయున్ శ్రీనిధి వీరయాబలుఁడు నుద్యత్కీర్తి మాదయ్యయున్
ఘనతేజోనిధి గుండబమ్మఁడును సంగ్రామస్థలీ పార్థ స
జ్జనమందారులు సాళ్వమంగనృపుఁడున్ సావిత్రిమంగాంకుఁడున్. 30

క. వీరలలో నతి కెక్కెను, వీరాగ్రేసరుఁడు లోకవిశ్రుతవిభవ
స్ఫారుఁడు సాళ్వమఁగ, క్ష్మారమణుఁడు సుగుణరత్నకలశాంబుధి యై. 31

సీ. దురములో దక్షిణసురతాను నెదిరించికొనివచ్చి సంపరాయనికి నిచ్చె
సాంబ్రాజ్యముఁ నిచ్చి సంపరాయస్థాపనాచార్యబిరుదవిఖ్యాతిఁ గాంచె
శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి యర్వదివేలుమాడ లద్దేవునమ్మడికి నొసఁగె
మధురాసురత్రాణు మడియించి పరపక్షిసాళువబిరుదంబు జగతి నెరపె

తే. గర్భితనమునఁ దేజిమొగంబు గట్టి, తటిమి నగరంపుగవఁకులు విఱుగఁద్రోలి
తాను జేసినగౌరు నుద్దవిడిఁ దెచ్చె, సాహసంబున నుప్పాంగు సాళ్వమంగు.

ఆ. అట్టిసాళ్వమంగయకు సింగవిభు గుండ,శౌరి గౌతరాజ సావడిక్షి
తీశ హన్మ మానవేశ్వరు ల్నా మల్లి,నాథుఁ డనఁగ సుతులు నమదహితులు. 33

తే. చక్రవర్తులతోడఁత సవతు వచ్చు, వీర లార్వురలోపల వినుతకీర్తి
మదవతీజనపర్యాయమదనమూర్తి, గౌతరాజవసుందరాకాంతునకును. 34

సీ. సర్వసర్వంసహాచక్రరక్షణమునఁ జక్రాంకునాల్గుహస్తములు వోలె
స్థిరతరప్రజ్ఞావిశేషంబున హిరణ్యగర్భునినాల్గువక్త్రములు వోలె
దుర్దాంతనిష్ఠురదోఃప్రతాపంబునఁ గాలాగ్నినాల్గుశృంగములు వోలె
మహితధర్మమున మన్మథవైరి వాహగోరమణుని నాల్గుపాదములు వోలె

తే. సంభవించిరి సుతులు సౌజన్యయుతులు, హరిపదధ్యానరతులు లోకైకనుతులు
గుండపరివృఢ సాళువకువలయేశ, బొప్పజననాథ సాళువతిప్పవిభులు. 35

ఉ. వీరలలోన నగ్రజుఁడు విక్రమకేసరి గుండధారణీ
ధారుఁ డుదారుఁ డాతనిప్రతాపము దిక్కులఁ బిక్కటిల్లు దు
ర్వార విరోధివీర నగరంబులకున్ హరుకంటిమంట లై
వైరినృపాలసైన్యవనవాటికి దావకృశానుపంట లై. 36

క. గుండనృప లునితమ్ముఁడు, దండితరిపురాజి సాళ్వధరణిపుఁడు మహీ
మండలి కాధారం బగు,కుండలి కాధారమయ్యె గురుభుజశక్తిన్. 37

క. ఆపార్థివునసుజన్ముఁడు, బొప్పాధీశ్వరుఁడు సమరభూభాగములన్
బప్పన్న మేదినీశుల, బొప్పానాముము లడంచె భూవిదితముగాన్. 38

శా. ఆబొప్పాధిపుసోదరుండు నుతజన్యశ్రీసుధాసౌధహే
లాబాహాపరిరక్షణాంబునిధివేలామేఖలాచక్రుఁ డై
ప్రాబల్యంబున సాళ్వతిప్పధరణీపాలుండు పాలించెఁ దా
శాబప్రీతి వహించి నిత్యవినుతక్ష్మానాథయూథంబులన్. 39

సీ. అమితవైభవముచే నసమానవైభవకులిశాయుధుల నద్రిగుహల కనిచె
దోఃప్రతాపంబుచేఁ దులితప్రతాపదావానిలాప్తుల నరణ్యములఁ ద్రోచె
వినుతధైర్యంబుచే విఖ్యాతధైర్యమంథానాద్రులను సముద్రముల ముంచె
ఘనకీర్తిచే సముత్కటకీర్తిచంద్రులఁ గడకొండ నవలిచీఁకట్లఁ గలిపె
తే. నార మీసరగండకటారిసాళ్వ, పంచఘంటానినాదాదిభయదబిరుద
కాహళారావసంపాకకంపితారి, దీప్తబలసీరి సాళువతిప్పశౌరి. 40

వ. ఇట్లు చతుస్సముద్రంబులున్ హరిచతుర్భుజంబులుం జతుర్విధపురుషార్థంబులుం
జతురుపాయంబులుం జతుర్దిగీశులుం బోలెవర్తించువీరలయందు. 41

ఉ. గుండమహీవిభుండు తనకుం గులభామిని మల్లమాంబ గాఁ
గుండలికుండలుండు వలిగుబ్బలిపట్టియు వైనతేయవా
హుండును నాదిలక్ష్మియుఁ బయోరుహగర్భుఁడు వాణియున్ సము
ద్రుండును జహ్నుకన్యయును దుల్యముగా నుతి కెక్క నిమ్మహిన్. 42
ఉ. ఆమహితానుభావునకు నాసుచరిత్రకు నుద్భవించి రు
ద్దామయశోధనుల్ విజయధాములు విక్రమభీము లాహవ
స్థేములు సార్వభౌములు ప్రసిద్ధులు తిమ్మనరేంద్రచంద్రుఁడున్
శ్రీమదహోబలేశ్వరనృసింహునియంశమునన్ నృసింహుఁడున్. 43
సీ. హతరిపుక్షత్త్రియుండయ్యుసామ్రాజ్యంబు గరిమఁ జేయనినాఁటికడమ యొకటి
యోగీంద్రవంద్యుఁ డయ్యును నుగ్రసేనుని నోలగించిననాఁటియొచ్చె మొకటి
భువనైకవీరుఁ డయ్యు విభాకరతనూజుతోఁపుఁ గోరిననాఁటితక్కు వొకటి
యాదిలక్ష్మినాథుఁ డయ్యును బలిదైత్యునడుగఁ బోయిననాఁటిహైన్య మొకటి
తే. తలఁచి మూర్ధాభిషిక్తుఁడై ధరణిపతులు, గొల్వ నసహాయశూరత వెలసి దాన
శక్తినవతార మెత్తినశౌరి గాక, క్షితిపమాత్రుండె సాళ్వనృసింహవిభుఁడు. 44
సీ. తిగుళభూములు తెంకులుగఁ జరించినదొడ్డచెవులపోతుల నెల్లఁ జెండివైచి
ఘన మైనకండక్రొవ్వునఁ బాఱుతెంచినయొడ్డీని పెనులావు లూడఁదన్ని
పఱతెంచి చక్కఁగఁ బాలదుర్గము మెట్టి సుడివడ్డచాములఁ జుట్టుముట్టి
పెనుఁగొండకడ ప్రాలి పిక్కళ్ళు మొదలైనప్రతిపక్షులను హతాహతము చేసి
తే. సత్కవులత్రుప్పు డుల్పు వసంతవేళ, రాయమీసరగండధరావరాహ
విజయవిఖ్యాతగుండభూవిభునృసింహ, సార్వభౌమునిబిరు దైనసాళువంబు. 45

మ. ప్రతివారంబును నారసింహధరణీపాలుండు భూమీసుర
ప్రతతిం గామితవస్తుసంపదల సంభావించుచోఁ దత్కరో

ద్గతదానాంబుసరిత్తటీతృణసుఖోదంచన్మృగీలోచన
ద్యుతులిందీవర దామసంపదలఁ జేయున్ దిక్పతిస్త్రీలకున్. 46

## షష్ఠ్యంతములు.

క. ఈదృగ్విధగుణమణికల్యోదధికిని మథితగర్వితోర్వీధవసే
నోదధికి భువనవినుతా, సాదదయావధికి సాధుజనసేవధికిన్. 47

క. ధరణీవరాహునకు బర్బరబాహునకహితరాజరాహునకు దిగం
తరముఖరితజయభేరీ, సరభసభాంకారనాదసన్నాహునకున్. 48

క. ఆకాశకేశకంధర, కాకోలసదృక్షనిశితకాక్షేయజయా
నీకనిరాతంకునకరి, భీకరచౌహత్తమల్లబిరుదాంకునకున్. 49

క. మీసరగండనికిఁ గటా, రీసాళువమునకుఁ గిన్నరీజనవిద్యా
వాసపరిషరితదిగ్జయ, శాసనగీతప్రబంధసంబంధునకున్. 50

క. పాండురతరకీర్తిరమా, గండూషితనిర్ఝరాపగా పాథునకున్
గుండయవరసింగమహీ,మండలనాథునకు విక్రమసనాథునకున్. 51

## కథాప్రారంభము.

వ. అభ్యుదయంబాకల్పంబుగా నాకల్పింపం బూనినజైమినిభారతంబునకుం గథావతారిక యెట్టిదనిన నట్లు జనయేజయమహీశ్వరుండు చక్రియాగంబునిర్వక్రతం గావించిన యనంతరంబ సుఖాసీనుండై జైమినిం గనుంగొని మహాత్మా సకలకలికలుషలతికాలవిత్రం బైనకురుక్షేత్రంబునం దజాతశత్రుం డగుధర్మపుత్త్రుండు ధార్తరాష్ట్రబలంబు నష్టాదశవాసరంబుల ధూళిధూసరంబు గావించి శౌర్యైశ్వర్యధుర్యుం డై విశ్వజగన్నుతంబుగా నశ్వమేధం బెవిధంబున నాచరించె నెఱింగింపు మనుటయు నమ్మునివల్లభుండు జనవల్లభున కిట్లనియె. 52

తే. ధారుణీనాథ వినుము మీతాతయైన, ధర్మసూనునియశ్వమేధక్రమంబు
తనపితామహుఁ డైనశంతనుతనూజుఁ, డమరపురి కేఁగ శోకాకులార్తుఁ డగుచు. 53

## ధర్మజునికడకు వ్యాసులు వచ్చుట.

క. ఉన్నంత నానృపాలుని, సన్నిధి కేతెంచె వ్యాససంయమి తతవి
ద్వన్నుతబహుపుణ్యకథా, సన్నపురాణేతిహాసశాలి * యదృచ్ఛన్. 54

క. వచ్చినవాని నెదుర్కొని, తెచ్చి యుచితపీఠి నునిచి దీర్ఘతరంబై
హెచ్చినశోకము మదిలో, నచ్చున లాడంగ ననియె నమ్మునితోడన్. 55

ఉ. సత్యవతీతనూభవ నృశంసత భీష్మునిఁ గుంభజన్ము నా
దిత్యకుమారు నూరక వధించితి రాజ్యరమావిభూతి కా

* యథేచ్ఛన్.

ద్ధత్యముతోడుతన్ సమరధర్మము వీసరపుచ్చి వంచనా
కృత్యజ మైనయీనిబిడకిల్బిష మేమిటఁ జక్కనయ్యెడున్. 56

చ. తఱుచుగ భానునందనునిధానమునందు నభీష్టవస్తువుల్
గుఱుతులుమీఱఁ గొంచరుగుకోవిదకోటులసమ్మదాశ్రువుల్
వఱదలు వాఱఁ బ్రస్తుతరవంబులు మిన్నులు రాయుచుండు న
క్కఱఁగట శోకజాశ్రువులుఁ గో యనునేడ్పులు నుప్పతిల్లెడున్. 57

ఆ. గురుఁడు కుంభజుండు సురనదీసూనుండుఁ, జూడలేని రాజ్యసుఖము నాకుఁ
గన్నుదోయిఁ లేనికాయంబు తోయంబు, గాని మిగులసౌఖ్యకరము గాదు. 58

ఉ. పిన్నటనాఁటనుండి ననుఁ బెద్దఁగఁ జూచినవంశవృద్ధులన్
మిన్నక చంపి చేకొనినమేదిని నా కిది యేల సత్త్వసం
పన్నిధి వాయునందనునిఁ బట్టము గట్టెద నేఁటితోన నే
నన్నియు మాని కాననకు నేఁగెద నిష్ఠఁ దపంబుఁ † జేసెదన్. 59

క. ఏతపముల నేజపముల, నేతీర్థవిలోకనముల నేక్రతువుల నీ
జ్ఞాతివధం బొనరించిన, పాతకము హరించు ననఁ దపస్వి యతనితోన్. 60

## వ్యాసుఁడు ధర్మజున కశ్వమేధము సేయ ననుజ్ఞ యిచ్చుట.

సీ. తలఁకకు ధర్మనందన నీకు గోత్రవధం బొనర్చినదురితంబు వాయ
నశ్వమేధంబుఁ జేయ నుపక్రమింపుము తొల్లి రాముఁడు జగం బెల్ల నెఱుఁగఁ
బౌలస్త్యుఁ జంపినపాతకంబు హరించె హయమేధయాగత్రయం బొనర్చి
శౌరిశాసనమున సంగ్రామజయలబ్ధ మైనరాజ్యంబు నీ కగునె విడువ
తే. సకలయాదవులును గైవసంబు నీకుఁ, గాన నీకానితలఁపులు గట్టిపెట్టి
తురగమేధంబుఁ జేసి కౌతుకముతోడఁ, గురుకులంబున సత్కీర్తి గుదురుకొల్పు. 61

క. అనవిని వేదవ్యాసునిఁ, గనుఁగొని దైన్యంబు దోఁపఁగాఁ ధర్మజుఁ డి
ట్లనియెఁ జనువయ్య కడుని, ర్ధనునకు నాకిమ్మహాధ్వరం బొనరింపన్. 62

క. మొలకలు రాజకుమారులు, తలిదండ్రులు లేనివారు దయ కర్హులు భూ
తలమునఁ గలప్రజ లందఱు, నొలిచిననొలి వాఁడెదరు సుయోధనుబాధన్. 63

ఉ. కాఁక నెదిర్చి సంగరముఖంబున నొచ్చినరాజవంశమున్
గూఁకటివేళ్ళతోఁ బెఱికి గోత్రవధంబున జేపిసట్టియా
ప్రేఁకపుఁగీడు గాక ప్రజ వేఁచఁ దలంచిన గోరుచుట్టుపై
రోఁకటిపోటు చందముగ రోసి జనుల్ ననుఁ జూచి తిట్టరే. 64

---

† సేయఁగన్.

క. కావునఁ దురంగమేధము, గావింప ధనంబు గూర్పఁగతి గానఁగ లే
నీవేళ నన్న నవ్వుచు, నీ వేల తలంకె దని మునీశ్వరుఁ డనియెన్. 65

ఉ. వాలినవేడుకన్ బహుసువర్ణమఖంబున ము న్మరుత్తభూ
పాలునిచే మహీసురు లపారసుదక్షిణ లంది తెప్పలం
దేలి యథేచ్ఛఁ గొం చరుగ నిల్చినవిత్తము వెక్కసంబుగా
మూలుగుచున్న దిప్పుడు సముద్రితమై తుహినాద్రిచేరువన్. 66

క. ఆధనము నీవు నచ్చిన, సాధనముగ నధ్వరంబు సాఁగించి బుధా
రాధనము చేయు నిరతా, యోధనచణు లైనతమ్ము లూఱటగాఁగన్. 67

సీ. అన విని ధర్మనందనుఁడు పారాశర్యుతోడ నిట్లను మరుత్తుండు బహుసు
వర్ణయాగము చేసి వసుధామరశ్రేణికెల్ల దక్షిణలుగా నిచ్చె మొదల
విప్రార్జితం బైనవిత్తంబు గొనివచ్చి క్రతువు చేయుటకంటెఁ గలదె గీడు
తమసొమ్ము తమ కిచ్చె ధర్మరా జని మహీసురులు దానము సేయఁ జూచినగరె.

తే. యాగడంబున బ్రహ్మస్వ మపహరించి, తెచ్చి పుణ్యంబు సేయంగఁ దివురు టెల్ల
గుడిచి కూర్చుండ శిలఁ దెప్ప గొయ్యం జేసి, జలధిలో నీఁదులాడంగఁ దలఁచినట్లు.

క. మొదలఁ గుల మెల్లఁ ద్రుంచుట, యదయత గురులమెడఁ గల్లలాడుట యధిగా
కిదియును జేయఁ దలంచినఁ, గొద లే దవేళ దొంతికోల సిద్ధించున్. 69

వ. నావుడు. 70

క. ఆమాటలు విని మౌని, గ్రామణి ధర్మజున కనియెఁ గశ్యపునిది గా
దా మేదిని యొ ట్లేలరి, భూమిపతులు కానిత్రోవఁ బోయిరే వారల్. 71

చ. వినుము నృపాల భూసురులు వెక్కస మైనఁ బరిత్యజించి పో
యినకనకంబుఁ జేకొన మహీపతికిం జనుఁ గాని వారికిం
జన దొకనాఁడు లే దొకనిజం బెఱిఁగించెద నెవ్వఁ డేలు మే
దిని ధన మెల్ల నాతనియధీనమ మాటలు వేయు నేటికిన్. 72

తే. అదియుఁ గాక మరుత్తుండు యజ్ఞవేళ, నుచితదక్షిణ లర్పించి యున్నధనముఁ
గొల్ల విడిచిన బ్రాహ్మణు లెల్ల దనిసి, విడిచి రర్థంబు దనికై వెఱవ వలదు. 73

## అశ్వమేధవిధానము వ్యాసుఁడు ధర్మజునకుం దెల్పుట.

వ. కావున నీమనంబున ఘనం బైనవంత యావంతయుం బెట్టుకొనక నెట్టుకొని యమ్మ
హాధ్వరంబు సాఁగింప నుద్యోగింపుము. తద్విధానంబు సావధానంబుగా నెఱిం
గించెద నాకర్ణింపు మఖిలవేదశాస్త్రపురాణేతిహాసకథాసుధానుభవులును సంచితా
న్వయసంభవులును నచ్యుతపదారవింద సందర్శనానందకందళిత హృదయారవిందు
లును నతిమనోహరప్రభావిడంబితరవీందులును నగునగ్రజన్ములిరువదివేలుఋత్విజులు

గావలయు నం దొక్కొక్కనికి హాటకసమేతం బొక్కొక్క ఘోటకంబును
నొక్కొక్కమదద్విరదంబును నొక్కొక్కయరదంబును రత్నప్రస్థసహితంబు
గోసహస్రంబును భారపరిమితంబు హేమంబును క్షేమంబున నేమంబునం
దురంగంబు నర్చించి విసర్జించుమొదలిదివసంబున సమర్పింపవలయు నిది దక్షిణా
ప్రకారంబు. 74

క. పాటీరహీరవర్ణము, హాటకపుచ్ఛమును వల్ల నగుచెవులు నిరా
ఘాటజవంబును నధ్వర, ఘోటకలక్షణము లివి యగోచర మైనన్. 75

ఉ. కాయము చిత్రవర్ణములు గల్గి మనోజన మైనయశ్వమే
ధీయహయంబు నాగమవిధిన్ విడువం దగుఁ జైత్రపూర్ణిమన్
రాయుచు సైన్యముల్ గొలిచి రా సుతు లైనను దమ్ము లైన న
త్యాయతశక్తిఁ గావ నొకహాయన మూర్విఁ బరిభ్రమింపఁగన్. 76

క. శూరులు గల్గినఁ బట్టుఁడు, ధీరత నని హయము నిటలదేశంబున బం
గారపుఁబట్టముపైఁ బతి, వీరాంకము వ్రాసి కట్టి విడువఁగవలయున్. 77

సీ. విణ్మూత్రములు సప్తి విడిచినతావుల నెల్ల హోమంబు సేయించి యచట
గోసహస్రంబు ధాత్రీసుపర్వుల కాఁగ నొక్కదక్షిణలతో నొసఁగవలయు
దీక్షితుండు హయంబు తిరిగివచ్చెడుదాఁక నియతభోగంబు లన్నియును మాని
భార్యతోడుత నసిపత్త్రివ్రతముఁ బూని బ్రహ్మచర్యంబు సల్పంగవలయు

తే. సమరపతి నూఱుతురగమేధములుచేసెఁ, గాని యీనిష్ఠఁ జరియింపఁ గానఁడయ్యె
వ్రతయుతంబుగఁ జేయు మీక్రతువు నీవు, పాండునందన సకలపాపములు నడఁగు.

క. అంగజుని గెలిచె నొక్కఁడు, గాంగేయుఁడు తమకు నలవి గా దని మహిభృ
త్పుంగవు లీవ్రత మోపక, చెంగిరి నీ కలవి యైనఁ జేయుము నియతిన్. 79

చ. అన విని ధర్మసూనుఁ డనఘా బవరంబుల డస్సినారు నా
యనుజులు కర్ణసూనుఁడు మహాబలుఁ డీవృషకేతుఁ డర్భకుం
డనుపఁగఁ జాల నాజికి మదర్థహతుండు ఘటోత్కచుండు త
త్తనయుని మేఘవర్ణుని నధర్మము పంపుట చాలఁ బోరికిన్. 80

## భీముఁ డశ్వముం దెచ్చెద నని ప్రతిజ్ఞ సేయుట.

క. ఎవ్వనిప్రాపున గెలిచెన్, గవ్వడి నెవ్వఁడి విరోధిగణముల ననిలో
నవ్వనజాక్షుఁడు గృష్ణుఁడు, దవ్వుల నున్నాఁడు క్రతువు తరమే చేయన్. 81

క. అని భీమునిదెసఁ జూచిన, వినయంబున నతఁడు వల్కె విష్ణుఁడు నికటం
బున లేఁ డననేటికి మనమునఁ దలఁచిన దురిత మడఁగి పుణ్యము దొరకున్. 82

వ. అదియునుంగాక నీకొక్క రహస్యం బవశ్యం బెఱింగించెద వాసుదేవునిశాసనంబు నంజేసి మనకు బంధునాశనంబున నైనదోసంబు వీసంబును లేదు జన్నంబు సేయు కున్నను నవ్వెన్నుండు నిన్ను ధన్యునిం జేయు నయిన లోకంబునం గలరాజలోకంబులోన నుత్తమశ్లోకుండ వగుటకుం దగ నియ్యాగంబు సుప్రయోగంబుగా సాఁగింప నుద్యోగింపుము యోగ్యం బగునశ్వంబు విశ్వంబునం గల్గినం జాలు దుర్వారభుజాగర్వం బఖర్వంబుగా నుర్వీపతు లెవ్వ రెదిర్చినం బేర్చి నేన నిగ్రహించి తెచ్చెద నెచ్చటం గల దడుగ నవధరింపు మనుటయు సాత్యవతేయుండు కౌంతేయునిం గనుంగొని. 83

సీ. పావనివాక్యంబు పావనంబును శుభప్రదమును శ్రేయస్కరమును వరము
నశ్వ మున్నది యౌవనాశ్వవిశ్వంభరాధిపుఁ డేలుభద్రావతీపురమునఁ
బసిడి యర్థముఁ గూడఁబెట్టిన ట్లావంకఁ బోతుటీఁగను నైనఁ బొలయరాదు
సందడించుచు దశాక్షౌహిణీసైన్యంబు లనిశంబుఁ గొలకొల మనుచునుండు
తే. మనకు నది దక్కెనేని నమ్మఖము సాఁగు, ననిన విని భీముఁ డిట్లను నన్నతోడ
నతనిబల మేల దేవత లడ్డమైనఁ, బట్టి తెచ్చెద హయము నీపాద మాన. 84

తే. వాసుదేవునికృప గలవారి కెందు, నరయ దుర్ఘటమైన కార్యమును గలదె
కాన భద్రావతికి నేఁగి క్రతుహయంబు, నొంటిఁ గొనివత్తు నట్లు తేకుంటి నేని. 85

సీ. వేదఘోషణలేని వీట నున్నయతండుఁ దలిదండ్రులకు రెండు దలఁచునతఁడు
నూరు వాడని నూత నీరు గ్రోలునతండు భూసురావళితోడ బొంకునతఁడు
నిటలాక్షుగుడిలేనికోటిక నున్నయతండు నిల్లరిధన మాక యేఁచునతఁడుఁ
దగిలి విశ్వాసపాతకముఁ జేసినతండు శివచింతఁ జెవిచెంతఁ జేర్పనతఁడుఁ
తే. పోవుగతికి నవశ్యంబు పోదు ననుచు, శపథములు పల్కి కదల నిశ్చయము చేసి
యన్నసన్నిధి మఱుమాట లాడకున్న, ధర్మసుతుఁ డాదరమున సోదరునిఁ జూచి.

మ. బలియుం డుగ్రుఁడు యౌవనాశ్వధరణీపాలుండు దత్సైన్యు లా
జుల ముక్కాఁకల నారితేఱినమహాశూరుల్ చలం బెత్తి మొ
క్కలముల్ పల్కితి ఘోటకంబు గొనిరాఁగా నైన నీవెంట రా
వలదా యొక్కరుఁ డన్నఁ గర్ణసుతుఁ డావాక్యంబు లాలించుచున్. 87

క. అనిలతనూజునివెంటన్, నను బంపుము వేడ్క ధర్మనందన యనినన్
విని భీముఁడు వృషకేతునిఁ, గనుఁగొని దయ సెంగలింపఁగా నిట్లనియెన్. 88

ఉ. ఏచినయాగ్రహంబు వహియించి భవజ్జనకున్ గఠోరనా
రాచపరంపరల్ గొని దురంబునఁ గూల్చిననాఁటనుండియుం
ద్రోచినశోకవేదనలతోడఁ గుమారక నీముఖాబ్జమున్
జూచినయప్పు డెల్ల మది చుఱ్ఱనుఁ దీఱనిలజ్జ పెంపునన్. 89

తే. అనిన వృషకేతుఁ డిట్లను ననిలజునకు, సమరమున నైన మీచేతిశస్త్రనిహతిఁ
జాల నుపకార మయ్యె మజ్జనకునకును, గలుషములఁ బాసి సద్గతిఁ గనియెఁ గాన.

క. అంతరము దప్పి లక్ష్మీ, కాంతునిఁ గృష్ణుని భజింపక దయారహిత
స్వాంతు సుయోధనుఁ గొలిచెన్, జింతామణి విడిచి గవ్వఁ జేకొనుభంగిన్. 91

ఆ. ద్రుపదువీటిలోన దొమ్మికయ్యము రేఁచెఁ, బసులఁ బట్టె విరటుపట్టణమున
మఱియు నెన్ని లేవు మార్తాండతనయుండు, దొడరి మనకుఁ జేయుదుండగములు.

చ. ఖలుఁ గురురాజుఁ గొల్చుటయు కాక సభాస్థలి నుత్తమాంగనన్
వల దన శక్తి గల్గియును వస్త్రము లొల్వఁగఁ జూచె నమ్మహా
కలుషము లోర్చి సంగరముఖంబునఁ బార్థుఁడు తండ్రిబిడ్డలన్
గలపిన మేల కాక కొఱగామియుఁ గీడును నెద్ది పేర్కొనన్. 93

క. అధిప విను ధనంజయుచే, నిధనంబై ముక్తిఁ జేకొనియెఁ గావున న
వ్విధుకులజుఁ డుత్తమర్ణుం, డధమర్ణుఁడ కర్ణుఁ డిది యథార్థం బైనన్. 94

చ. శమనతనూజమాద్రిజులు సాతులుగాఁ జని యౌవనాశ్వదు
ర్గము వడిఁ జొచ్చి యధ్వరతురంగముఁ బాపని కిచ్చి తండ్రిపా
పముల నడంచి సద్గతికిఁ బంపెఁ గిరీటిఋణంబు నేన త
త్సమరతలంబునన్ వినుతిశౌర్యము నుత్తిగఁ బెట్టి తీర్చెదన్. 95

తే. అనిన వృషకేతుఁ జూచి ధర్మావరజుఁడు, నెమ్మి రెట్టింప నాలింగన మ్మొనర్చి
తనదుపయనం బెఱిఁగిఘటోత్కచసుతుండు, మేఘవర్ణుండు గడుసంభ్రమింపఁ జూచి

క. తండ్రీ ఘటోత్కచుఁడు మీ, తండ్రి గలుఁగఁగాదె తల్లి ద్రౌపదితోడం
దండ్రుల హరిపేశ్వరు లెన, మండ్రుఁ బొగడఁ దెచ్చె గంధమాదనమునకున్. 97

శా. వాత్సల్యంబున నీవు నట్టి భుజగర్వస్ఫూర్తిఁ బెంపారు బీ
భత్సుం బాయక ధర్మజుం గొలువు తాత్పర్యంబునన్ శౌర్యసం
పత్సారున్ వృషకేతుఁ గూడుకొని యాభద్రావతీసైనిక
ప్రోత్సాహం బెడలించి యధ్వరహయంబున్ దెచ్చుపర్యంతమున్. 98

చ. అన విని మేఘవర్ణుఁ డనిలాత్మజుతో నను నీకుఁ బుట్టి మ
జ్జనకుఁడు ముజ్జగంబునఁ బ్రశస్తి వహించె నహల్య రామచం
ద్రుని చరణాబ్జరేణువునఁ దొంటిశిలాకృతి వీడుకొన్నలా
గున సురసింధుతోయములఁ గూడినయోడిక వాఁగుకైవడిన్. 99

ఉ. కావున నీకు సేవకుఁడఁ గాఁ దగుదున్ నినుఁ గొల్చి వచ్చి భ
ద్రావతిలోన నుండెడుతురంగముఁ దెచ్చెదఁ గూయి వచ్చినన్

నీ వటు దండఁగో లగుచు నిల్చినఁ జాలు నగస్త్యమూర్తియై
యీ వృషకేతనుం డరిమహీశబలాంబుధి నోరఁబట్టెడున్. 100

తే. అహితసేనలు రాఁ గతఁ దడ్డగించి, యాహవము చేయుచుండ హయంబు నేవ
గొరిఁ జనెఁ బెట్టుకొని వత్తు నటకటమునకుఁ, గడవు సేయక ధర్మనందనునికడకు.

వ. అనిన విని పరమానందకందళితహృదయారవిందుం డై సమీరనందనుండు ఘటో
త్కచనందనుఁ బరిణమించి కరుణ మించినచూపులం జూచి పౌత్త్ర! క్షాత్త్రధర్మ
భూషణంబును నమిత్రనిభీషణంబును నగునీభాషణంబు మదీయశౌర్యభూషణంబు
నకు హేతుభూతం బయ్యె భూతనాథుండు వచ్చినను మనమువ్వురతోడం జివ్వ
కుం దొడర వశంబు గాదని యుద్ధసన్నద్ధులైన సోదరపుత్త్రపౌత్త్రులం గనుంగొని
ధర్మపుత్త్రుండు హర్షాశ్రుమిళితనేత్రుండును బులకకలికాభిరామగాత్రుండును నై
యగ్నిత్రయంబు గలుఁగ నాకు లోకత్రయంబున నెయ్యది యసాధ్యంబని యుత్స
హించి యుండె నంత భానుమంతుం డపరదిక్కాంతాకబరికాంతరంబునకుఁ
జెంగలువబంతిచెలువు సంతరించె నప్పుడు. 102

తే. ధర్మనందనుచిత్తఖేదంబు మాన్పి, తురగమేధంబు గావించువెరవు దెలిపి
పోవఁదలఁచిన నమ్మునిపుంగవునకు, ననుజులును దాను విహితపూజనము లొసఁగి.

శా. చేదోయిల్ మకుళించి వీడుకొనె నక్షీణప్రమోదంబునన్
వేదవ్యాసుఁ బ్రసాదభాసురవచోవిన్యాసు సంహాస్యము
త్వాన్నాదాధ్యాసు సుధీవిలాసు నుతవిద్యావాసుఁ బ్రజ్ఞాకళా
సాదజ్ఞానసముల్లసచ్చిదమృతాస్వాదోదితోల్లాసునిన్. 104

సీ. మునినాథుచే ధర్మతనయుండు వీడ్కొని యపరసంధ్యాక్రియ లాచరించి
యనుజులు గొల్వ సింహాసనంబుననుండి క్రమ్మఱఁ జింతాభరంబు దాల్చి
యంతరాయము లేక హయము వచ్చుట యెట్లు సత్త్రియయాగంబు సాఁగు టెట్లు
దానదక్షిణలకు ధనము గల్గుట యెట్లు మునిమాట కే నియ్యకొనుట యెట్లు

తే. చాలదుష్కర మైనయీజన్నమునకుఁ దోడువాన యైనచుట్టంబు దొరకు టెట్లు
దేవకీసూతి త్రిభువనాధిపుఁడు తాఁ, నెఱిఁగి సాధింపకున్న నీ డేలు టెట్లు. 105

తే. హా సరోజాక్ష గోత్రదుఃఖార్ణవమున, మునిఁగియున్నాఁడఁ జేయూఁత కొసఁగ లేక
నీకృపాదృష్టి పేరోడ గాకయున్న, వెడలఁబడు టెట్లు మఖము గావించు టెట్లు.

క. కౌరవసభలో లజ్జావారిధి నిగ నుద్ధరింపవా ద్రౌపది న
న్నారీతి నుద్ధరింపుము, నీరజదళనేత్ర కలుషనీరధివలనన్. 107

## ధర్మరాజుకడకుఁ గృష్ణుండు వచ్చుట.

వ. అని పెక్కుదెఱంగుల నక్కమలోదరుం బేర్కొని దీనాతిదీనంబు లగువాక్యంబులం బ్రస్తుతింప సమస్తభువనవ్యాపియు విశ్వరూపియు నగుగోపికారమణుండు దత్క్షణంబ వచ్చి వాకిట నిలిచి ప్రతిహారిం గనుంగొని మదీయాగమనంబు ధర్మపుత్త్రున కెఱింగింపు మెంతవారి కేని మహీకాంతుని యవసరంబు దెలియక చనవు మెఱసి యంతఃపురంబునకుం జనుట యనుచితం బనిన వాఁడును గృతవందనుండయి గోవిందున కిట్లనియె. 108

సీ. దేవర యేవేళ నీవు వేంచేసిన సమయంబ యని ధర్మసంభవుండు
నాతోడ మొదల నానతి యిచ్చె నవసరానవసరంబులు మీకు నడుగ వలదు
పరధనాపహులును బరదోషనిరతులుఁ బరవధూరతులును బడయ లేరు
నీదగుకరుణ గణింపఁగా నిట్టిదుర్గుణములు ధర్మపుత్త్రునకు లేవు
తే. తగ విలోకించి తద్వాంఛితంబు దీర్పఁ, దాను దమ్ములు నీపదధ్యానపరత
నున్నవా రని పఱతెంచి సన్నుతోక్తిఁ, గృష్ణుఁ డేతెంచె నగరివాకిటికి ననిన. 109

ఉ. దిగ్గన లేచి యవ్వసుమతీపతి భీముఁడు సవ్యసాచియున్
డగ్గఱి కొల్వ నాసనమునన్ దరహాసమనోజ్ఞచంద్రికల్
నిగ్గులు వాఱ మత్తగజలీల రయంబున నేఁగుదెంచెఁ దా
నగ్గరుడాంకుఁ జేరఁ బులకాంకురముల్ దను వెల్ల నిండఁగన్. 110

ఉ. వచ్చినధర్మజుం గదిసి వారిజనాభుఁడు మ్రొక్క మ్రొక్కినన్
గ్రుచ్చి కవుంగిలించుకొనెఁ గూర్మియు భక్తియుఁ బొత్తు సేయఁగా
ముచ్చట వాయఁ గొంతవడి మూర్ధము మూర్కొని లోచనంబులం
బిచ్చిలి రాలుబాష్పజలబిందులు మౌళి నలంకరింపఁగన్. 111

క. గోవిందునిపాదములకుఁ, బావనియును నర్జునుండుఁ బ్రణమిల్లిరి రా
జీవయుగళంబుపైఁ గ్రొ, త్తావులు గొన వ్రాలుతుమ్మెదలచందమునన్. 112

వ. ఇత్తెఱంగునం బాండునందనులు వసుదేవనందను సంభావించి యంతఃపురంబునకుం దోడ్కొనిపోయి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యర్హాసనంబుల నాసీనులయియున్నయెడల బాంచాలరాజనందన వినయంబున నమ్ముకుందునకు వందనం బొనర్చి మందస్మితవదనారవింద యగుచు నరవిందనాభురాకకు విస్మయం బందుచున్నయన్నరవరాగ్రణిం గనుంగొని యిట్లనియె. 113

తే. అర్ధరాత్రంబు వచ్చె నీహరి యటంచు, మనమునం దేల వెఱఁగంద మనమ కాదు
దాసజనుఁ డెందు నేయుపద్రవముఁ జెందు, నందులకు వచ్చిరక్షించు నచ్యుతుండు.

ఉ. ఈవు మనంబునన్ మఱచితే సభలోఁ దనచీర యొల్చుకోఁ
గా విడిపింప నందఱును గల్గియు నిర్దయులై కనుంగొనన్
హా వసుదేవపుత్త్రి యన నక్షయవస్త్రము లిచ్చి నన్ను ల
జ్జావనరాశిలో మునిఁగి చావక యుండఁగ నుద్ధరించుటల్. 115

తే. వనము గాండీవి నంపుద మని తలంపఁ, దలఁపులోనన వచ్చెను దత్క్షణంబ
భక్తజనులకు ముంగొంగుపసిఁడి గాఁడె, దేసతారత్న మీవాసుదేవుఁడనఘ. 116

వ. అని సన్నుతింప ద్రుపదజాతయెడ జాతాదరుండై సరసిజోదరుండు మన్నించి యజాతశత్రుదిక్కు మొగం బైన నతండు వినయవిస్రంభగంభీరంబుగా నిట్లనియె.

చ. తలఁచితి దుఃఖనిర్గతికిఁ దామరసోదర నిన్ను నీవునుం
దలఁపునకంటె మున్నె ప్రమదంబున వచ్చితి నామనోరథం
బులు ఫలియించె వ్యాసముని పుంగవునానతి నశ్వమేధముల్
దలఁచితిఁ జేయ నిర్భయతఁ దత్ఫలకర్తవు నీవ కావునన్. 118

తే. అనిన ధర్మతనూజుతో నధిప నీవు, పూనుపను లెల్ల ఫలసిద్ధిఁ బొందు ధైర్య
ధనుల కరయంగ లే వసాధ్యంబు లనుచు,నచ్యుతుఁడుభీముదెస జూచియల్లనగుచు.

క. మందమతియు బహ్వాశియుఁ, దుందిలుఁడును రాక్షసీరతుఁడు నిష్ఠురవా
క్సందర్భుఁడు నగుమారుత, నందనుసచివతఁ బ్రయోజనములు ఫలించునే. 120

## కృష్ణుఁడు భీమునిగుణంబులు ధర్మజునకుం దెల్పుట.

ఉ. అంగవిహీను నిల్లటపుటల్లునిఁ బ్రల్లదు నీచభామినీ
సంగతు వామనున్ బధిరు సాధ్వసమానసు మామఁ గాముకున్
వెంగలి నంగనాజితుని నిర్దయుఁ గ్రోధిఁ బ్రమత్తు మంత్రిఁ జే
యం గొఱగామి కెల్లఁ గుదురంచు గణింతురు నీతికోవిదుల్. 121

ఉ. గంధవహాత్మజుండు పెనుగబ్బి తలంపఁడు కార్యముల్ జరా
సంధు హిడింబునిన్ బకనిశాచరు జంపినయట్లు గాదు గ
ర్వాంధులు సత్యసంధులు మహాబలసాంద్రులు నిర్జితేంద్రియుల్
బంధురదానశీలురు నృపాలురు వారి నెఱుంగఁ డెన్నఁడున్. 122

తే. నాఁడు గాండీవి పూనె సైంధవు వధింపఁ, బ్రతిన యుద్ధతి నవిచారమును లేక
నేఁడు భీముఁడు కడిమిఁ బూనినప్రతిజ్ఞ, యంతకన్నను మిగులసాహసతరంబు. 123

వ. ఇమ్మహాప్రతిజ్ఞ యీడేఱు టెట్లు నిరాఘాటంబున యజ్ఞఘోటంబు దిగంతరంబుల నిరంతరంబును జరింప నితాంతశౌర్యవంతు లగుమహీకాంతులు దేవగంధర్వాదుల నంతఘాయంబు నొందింప నెదురు వేచియుండుదురు మున్ను మాఘవేళయం దశ్వ

రక్షకు వృషచరవీరు మాపతిం బనుప నతండు శక్తిపతి యనుపట్టణంబున సురథుం డనుమహారథునిచేతఁ దురంగంబు పట్టువడి తానునుం గట్టువడియె నట్టియెడ రామభద్రుం డాయుపద్రవంబు తాన చని చక్కఁ బెట్టుకొనవలసెఁ గావునఁ బావనికి సహాయుండై యర్జునుం బనుచుట కర్జం బని తర్జనిం జూపిన కంసమర్దనునకు బకమర్దనుం డిట్లనియె. 124

## కృష్ణభీమసేనుల సరసాలాపము.

తే. అనఘ నీవానతిచ్చినయట్లు మిగులఁ, దుందిలుండను బహ్వాశి దుష్టరాత్మ
నీరతుండను నగుదుఁ జర్చించి చూడ, దేవరకు నట్టిగుణములు లేవు గాన. 125

సీ. మొదల నత్యంతకాముకుఁడవౌటకు గొల్లయిల్లాండ్రగుబ్బచాలిండ్లు సాక్షి
యతినీచరతిశీలి వగుటకుఁ బాతీన కమఠసూకరవిగ్రహములు సాక్షి
బహ్వాశి వగుటకు బ్రహ్మాండకోట్లును బూరింప లేనినీబొజ్జ సాక్షి
స్త్రీలోలుఁ డగుటకుఁ ద్రైలోక్యము నెఱుంగ ధరకుఁ దెచ్చినవేల్పుతరువు సాక్షి

తే. జడసముత్సాహి వగుటకు జలధి సాక్షి, వామనుఁడ వగుటకు బలీశ్వరుఁడు సాక్షి
మందమతి వౌట నదిమఱిపొందెఁ గాక, సరివెఁ బేర్కొనఁ దరమె నీసటలు కృష్ణ.

తే. చదురు లేటికి మును జరాసంధముఖ్య, భూవరుల సంహరించుట నీ వెఱుఁగవె
నీకరుణతోడుగా వైరినృపుల గెల్తు, హయము గొనివత్తు సాఁగింతు నధ్వరంబు.

చ. ఇది యొకదొడ్డగాఁ దలఁప నేటికి నాహృదయంబులోన నీ
పదయుగళంబు నిల్పి కులపర్వతముల్ పెకలించి వైతునో
గదగొని ధారుణిం దుమురుగా వడి దంతునొ దిగ్గజంబులన్
రదనము లూడఁ దన్నుదునొ రాలుతునో గ్రహతారకంబులన్. 128

తే. బహువిచారపిపాసార్త పాండుపుత్ర, చాతకముల కకాలవర్షంబ వైతి
విమతజనులకు నంగారవృష్టి వైతి, నీవు వెంచేసి నీరదనీలవర్ణ. 129

తే. పంకనిర్మగ్న మగుగోవుఁ బరికరించి, సుకరముగ నుద్ధరించుగోపకునిమాడ్కి
ముదము దైవార నుద్ధరింపుదువుగాక, పంకనిర్మగ్ను నన్ను గోపాలతిలక. 130

వ. అని యనిలనందనుండు పలుకుపలుకులకుం బ్రమోదియై తదీయతేజోవర్ధనుండగుచు గోవర్ధనుండు భీమసేను నాలింగనం బొనర్చి భవద్వాక్యంబుల నాచిత్తంబు కౌతుకాయత్తం బయ్యె ధన్యుండవు మాన్యుండవు రాజన్యునకు మన్యుభరంబు వలవదు జన్యంబున జాహ్నవీసుత ద్రోణ కర్ణులను దత్సంబంధబాంధవులను నిధనం బొన

ర్చిన దుష్కృతంబు మత్కరంబునం బెట్టి విశ్వనుతంబుగా నశ్వమేధంబు సాఁగిం
తుగా కనిన బలానుజునకు ధర్మానుజుండు దండంబు వెట్టి యిట్లనియె. 131

చ. అరసి భవత్కరాంబురుహమం దొక టిడ్డను గోటికొండలై
పెరుఁగుటఁ జేసి దుష్కృతముఁ బెట్టఁగఁ గూడదు నీకరంబునన్
నరపతి యశ్వమేధసవనం బొనరించిన నాఫలంబు నీ
కరకమలంబునందు నిడఁ గానికగా నది గాంచు నున్నతిన్. 132

తే. హయముఁ గొనివచ్చునంతకు యమతనూజుఁ, గాచికొనియుండ నీసవ్యసాచి ననుపు
పోయి వచ్చెద నీపదాంబురుహచింత, నాకుఁ దగుసంబళంబుగా నలిననాభ. 133

క. అని మాటలాడుసమయం, బున భోజనవేళ యయ్యెఁ బ్రొద్దంతేనిం
జనియె నని ద్రుపదనందన, చనుదెంచినఁ బాండుపుత్త్రు సారసనేత్రుల్. 134

వ. ప్రసంగం బుజ్జగించి మజ్జనంబు లాడి యిష్టాన్నపానంబులం బరితుష్టి నొంది
యర్హప్రకారంబుల నారాత్రి సుఖసుప్తిం బొంది రంతం గొంతప్రొద్దునకు నిశా
విరామం బగుటయు. 135

క. కలువలమురు వెడలఁగఁ జు, క్కలు దివి నంతంత నొక్కొకటి దోఁపఁగ వె
న్నెల పడమటిదిక్కునకున్, బలపల నై యొడ్డగిలఁగఁ బలపల వేగెన్. 136

ఉ. తూరుపు తెల్లవాఱుటయుఁ దోడనె మంగళపాఠకస్తుతుల్
మీఱఁ దదీయరావముల మేల్కని కాల్యసమంచితక్రియల్
దీఱిచి పాండుపుత్త్రు వసుదేవసుతుల్ ప్రమదంబు మోములన్
దేఱఁగ వేడ్కతో నరుగుదెంచి సభాస్థలి నిల్చి రంతటన్. 137

## భీమాదులు భద్రావతీపురంబున కరుగుట.

సీ. ఆహవసన్నద్ధు లై భీమ కర్ణనందనమేఘవర్ణులు ధర్మతనయు
పాదంబులకు మ్రొక్కి పంకజాక్షునకు దండము వెట్టి యంతఃపురమున కరిగి
కుంతికి నెఱఁగి వీడ్కొని వచ్చి వివ్వచ్చు గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి కుస్తరించి
యనఘ నేఁ దురగంబుఁ గొనివచ్చునందాఁక సంగరక్షకుఁడ వై యధిపుఁగాచి

తే. యుండు మని మాద్రిపుత్త్రుల నుపచరించి, ద్రౌపదికిఁ జెప్పి మఱియును దానవారి
యడుగులకు ప్రాలి యద్దేవు ననుమతమున, నరిగె ననుమోదమున యౌవనాశ్వపురికి.

క. అనుటయు విని జనమేజయ, జనపతి సంతసము నొంది జైమినితో న
య్యనిలసుత యౌవనాశ్వుల, కును దారస మైనరణముకొలఁ దడుగుటయున్. 139

శా. మల్లాంబావరపుత్త్రి గర్వితరిపుక్ష్మాపాలసంపత్తివి
ద్యుల్లావణ్యకళాశరత్సముదయలీలోల్లాసి బాహాసీమ
త్తల్లీసర్త్సరంగదంగదసుహృద్ధాత్రీశకోటీరమా
ద్యల్లీలాకకుబంతవారణ సువర్ణాహార్యధైర్యోదయా. 140

క. ధరణీవరాహవార్జిత, ధరణీవర ణాపరావతార మురారీ
ధరణీవరాహ రక్షిత, ధరణీవరబృంద మహితదాన ముకుందా. 141

మానిని. జనతమహితసంధా చారుసాహిత్యగంధా
వినయనయవిలాసా విద్వదంతర్నివాసా
ఘనతరమదగర్వగ్రంధిభారానమద్దు
ర్జనపహృదయభల్లా రాయచౌహత్తమల్లా. 142

గద్యము.

ఇది భారతీతీర్థ శ్రీచరణకరుణాపాత్ర గాదయామాత్యపుత్త్రి వినయవిద్యాసముద్ర
పినవీరభద్రప్రణీతం బైన జైమినిభారతంబునం దశ్వమేధపర్వంబునం
ప్రథమాశ్వాసము.



శ్రీ

# జైమినిభారతము

## అశ్వమేధపర్వము—ద్వితీయాశ్వాసము.

---



(శ్రీ)రమణచరణకలితవి
చారణ పరభయదఖడ్గశార్దూలమహా
ధారానఖముఖదారిత
వీరారికురంగ గుండవిభునరసింగా. 1

వ. అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రున కిట్లనియె నట్లు ధర్మజ వాసుదేవులచేత ననుజ్ఞాతుం డై హస్తిపురంబు నిర్గమించి నిరర్గళప్రయాణంబులం గతిపయవాసరంబులకు. 2

### భీమాదులు భద్రావతీనగరంబుఁ జేరుట.

ఉ. పావని కాంచెఁ గట్టెదుర భర్మశిరోగృహతుంగశృంగసం
భావితపద్మరాగజగభస్తిసమాజవిరాజమానలీ
లావిపరీతసాంధ్యనిశలం దిశలందు నలంకరించు భ
ద్రావతి యౌవనాశ్వసురరాజవిరాజదిరామరావతిన్. 3

సీ. స్ఫాటికమణిశిలాప్రత్యగ్రరచనాతిబంధురప్రాకారభాసురంబు
పాతాళజలఝురీపర్యాప్తకల్లోలసుకుమారపరిఖోపశోభితంబు
కనకసౌధాంచలకలితముక్తాఫలరాజిలీలాగ్ర తారాగణంబు
శక్రనీలశిలావిశాలగోపురరోచిరసమయజనితమిధ్యాతపంబు.

తే. భవనకాసారకహ్లారపద్మకుముద, పుండరీకనీలోత్పలషండసురభి
విపులమధురకరకలనాదవిజితపుష్ప, చాపనినదంబు భద్రావతీపురంబు. 4

ఉ. పంబినవేదఘోషణలభాషణముల్ వినరాక హోమధూ
మంబులు గ్రమ్మి కార్కొన ఖమార్గము గానఁగనీక యూపసం
ఘంబులసందడిన్ నడువఁ గాదెదు వైనను లేక సాధుర
మ్యంబును శత్రుభీషణము నై పుర మొప్పుచు నుండు నెప్పుడున్. 5
శా. నానాపక్వఫలాతినమ్రుతతరుసంతానంబులన్ విస్ఫుర
న్నానాపుష్పలతాప్రతానముల నానాపక్షిరావంబులన్
నానావర్ణమృగప్రచారముల నానాకేళికుంజంబులన్
నానాభంగి నుతింప నొప్పఁ బురి నానాభోగసంపన్నతన్. 6
ఉ. ఆనగరంబువైభవము లర్కజసూతికిఁ జూపుచున్ మరు
త్సూనుఁడు గాంచె నొక్కయెడఁ దోయజహల్లకకైరవోత్పలా
నూనమరందగంధినటదూర్మిఘటాపరిఘట్టనార్ద్రమా
లానఘకూలదేశసముదంచితపూగము వాస్తడాగమున్. 7
తే. కాంచి యీబావి యగుఁ దురంగములు నీరు, ద్రావునది గాకయున్న నుద్యత్ఖురప్ర
కాండముద్రలచేత సంకలిత మగుచు, మృదురజోరాజి మెదుగ నేరదు పథంబు. 8
క. తురగములు నీరు గొనునవ, సరమును నేతెంచె మనము చాటువడుద మి
గ్గిరిరాజంబున నని యరి, గిరి మువ్వురు నరిగి కుంజగృహసంస్థితు లై. 9
తే. ఉండి కర్ణసుతుండు వాయుజునితోడ, నృపతి కీతని కక్షౌహిణీదశకము
కలిగిననునందునొకకొంతగాని పెకలి, యంతయును రాదు చనుదెంచుహయముబడిని.
సీ. త్రిపథగావాహినీతీరంబుఁ జేరినజనులపాతకసముచ్చయముఁ బోలె
సంవర్తశిఖిశిఖాజ్వాలకీలంబును డాసినకాలకూటంబుఁ బోలె
వసుదేవసుతపదద్వయచింతనంబున మలినమానసునిజన్మంబుఁ బోలె
సాధితగయుఁ డైనసత్పుత్రుఁ గాంచినపితృవర్గవిషమదుర్గతియుఁ బోలె
తే. నడఁగిపోవును నీచేత యౌవనాశ్వ, భూమిపాలాశ్వరక్షితభూరిసైన్య
సముదయం బెల్ల నుగ్గునూచంబు లగుచు, నీగదాఘాతమున నొక్కనిమిషమునను.
మ. అని సల్లాపము లాడు చున్నయెడ నుద్యద్వాద్యఘోషంబులున్
ఘనఘీంకారరవంబులున్ బృథుగళగ్రైవేయఘంటాకళో
రనినాదంబులు గండదానజలధారాలోలరోలంబమో
హనఝుంకారములు న్జెలంగ నివహంబై వచ్చె శుండాలముల్- 12
వ. ఇత్తెఱంగున మత్తగజంబులు వచ్చి సరోవరంబుఁ జొచ్చి మచ్చికలు హెచ్చుమీఱం
గరంబుల జలంబులు పూరించి కరులు కరేణువులమీఁదను గరేణువులు కరుల
మీఁదనుం జల్లుచు నుల్లసిల్లుచు దంతకోరకంబులం గోరిక లీరికలెత్త మెత్తమెత్తన

గండూయనంబులు వేయుచు శుండాదండంబులం బుండరీకంబులు పెఱికి నిండిన
కుతూహలంబున గండు మిగిలి వ్రేల్లాడుచు నన్యోన్యవదనసౌరభంబు లాస్వాదించి
మోదంబున బృంహితంబులు సేయుచుఁ జిక్కటిల్లినమక్కువ నక్కతోడ
నక్కను, జెక్కతోడఁ జెక్కను, జెవితోడం జెవియును, బరితోడం బరియును
పరిబెరయ నొరయుచుఁ బుష్కరాగ్రంబుల జలంబులు పూరించి చిమ్మనఁగ్రోవులం
బోలె నొండొంటిపయిం జిమ్ముచు ననేకప్రకారంబులఁ గ్రీడించి మావంతుల బల
వంతంబునం జలవిహారం బుజ్జగించి పురంబునకు మగుడు నంత, 13

సీ. నేమినిర్గతధారుణీరేణుకల్పితతిమిరబృందస్యందనములతోడఁ
గల్పాంతరుద్రఢక్కారావధిక్కారిసముదగ్రవాదఘోషములతోడ
వ్యాలోలమృత్యుజిహ్వాపల్లవాభీలసందీప్తబిరుదధ్వజములతోడ
గ్రీష్మఘర్మత్విషద్భీష్మదీప్తిచ్ఛటాకలితాస్త్రసుభటసంఘములతోడ
తే. వచ్చుసైన్యంబుచటులగర్వంబుఁ జూచి, యౌవనాశ్వుండు గాఁబోలు ననుచుఁ గర్ణ
సుతుఁడు దిగ్గన లేచి చూచుచును నీరు, ద్రావ నేతెంచుహరులసందడిగఁ దెలిసి.

చ. పరువడి భూసురాస్యములభంగిఁ బద్రకమముల్ దలిర్పఁ ది
త్తిరినకులోష్ట్రికేకులగతిం గతు లొప్పఁగఁ జేరి వాహకుల్
పరిపరిలాగులం గుదియఁబట్టుచు రా వలవత్రయంబులున్
దురగము లేఁగుదెంచె నవె త్రొక్కినచోటులు త్రొక్క నుద్ధతిన్. 15

చ. వివిధము లైనయశ్వములు వేలతరంబులు నీరు ద్రావుచు
న్నవియును బోవుచున్నవియు నైనవి యారయ నిందులోపలన్
యవసహయంబు వచ్చుట కనంబడ దింటన కట్టి గడ్డియున్
గవణము నీరు చూపఁ బతి కట్టడచేయఁగఁబోలుఁ బావనీ. 16

తే. అనిన వృషకేతుఁ గనుఁగొని యనిలసుతుఁడు, పలికినారము తురగసంబంధ మైన
ప్రతిన లెన్నని ధర్మసంభవునియెదుర, మనము దోయిడిచేతుల మగుడు టెట్లు. 17

సీ. పుత్త్రహీనుం డైనపురుషునకుఁ బరలోకసుఖముపొందు గల్గనివిధమున
సంగరాజితుఁ డైనయట్టిపాలసునకు బంధుసంఘంబు చొప్పడనికరణి
మంత్రినిస్పృహుఁ డైనమనుజనాథునకును స్థిరరాజ్యగరిమ సిద్ధింపనట్లు
శ్రీవిష్ణుపదభక్తి చిత్తంబులో లేనివానికి శుభములు లేనిపగిది
తే. శంకరునిఁ బూజ సేయనిపంకమతికి, గురుతరైశ్వర్య మొదవనిసరణి మనము
హయముఁ గొనిపోక విఫలప్రయత్నమునను, గరిపురికి నేగు టపకీర్తికారణంబ. 18

క. అని మాటలాడుసమయం, బున రథకరితురగభటసమూహము బహువా
ద్యనినాదభీషణంబై, చనుదెంచెఁ దదీయవిపులసైన్యమువడుమన్. 19

## భీమాదులు యజ్ఞాశ్వంబును జూచుట.

క. తురగంబు వచ్చెఁ బరిపరి, మురువున్నఁ జరణములు నేల మోపకయుండన్
ధర బహువల్లభ యగుటను, ఖురపుటములు సోఁకకుండఁ గొసరెడుభంగిన్. 20

మ. వినుతానేకవిభూషణాభినవమై శ్వేతాతపత్రద్యుతుల్
తనపై వెన్నెల చల్లఁ జామరశిరోదంచన్మరున్మంజరీ
జనితానందమున న్మనం బలర నుత్సాహంబునన్ సార్వభౌ
మునిచందంబున నేఁగుదెంచె విహితాంభోజాకరక్రీడకున్. 21

క. ఈకరణి వచ్చుతురగముఁ, జైకొని పట్టంగఁ దమకపడుపుత్త్రుని నా
లోకించి వలదు వేగము, నీకని వారించి మనుమనిం గనుఁగొన్నన్. 22

## మేఘవర్ణుఁడు సైన్యంబుల మార్కొనుట.

సీ. భీమసేనునకుఁ బ్రణామంబు గావించి మేఘవర్ణుఁడు విక్రమించి పలికె
సేనలనడిమితేజీఁ దెత్తు మందలోఁ జెవిపట్టి క్రేపు నీడ్చినవిధమున
దళము లేలెక్క నీసెలవు గల్గినఁ జాలు యౌవనాశ్వునిఁ దనూజాన్వితముగ
బలిమిమై మూటకట్టులు గట్టి తెచ్చెద బ్రముచ్చులఁ బోలె నీముందటికిని
తే. నేల మన కింత తురగంబ చాలు ననినఁ, దడవు సేయక నిమిషమాత్రంబులోనఁ
దార్చికట్టెద నీయున్నతరువుతోడఁ, గీచకాంతక నను విలోకింపు మనుచు. 23

వ. సంగరోత్సాహంబున నంగంబు వొదల నక్కుధరశృంగంబుననుండి లంఘనజంఘాలం బగుసింగంపుఁగొదమకరణి ధరణికిం జనుదెంచి మించినమాయాప్రభావంబునం గాలకంధరకంధరామూలకాకోలవిషమషీసగంధం బగునంధకారంబు గల్పించు కల్పాంతకాలమేఘంబుల నుత్పాదించి తన్ముఖంబున దిఙ్ముఖంబులం దళతళలు గడలుకొన విద్యుల్లతామతల్లికల నల్లుకొనం జేసియు నెల్లెడలఁ బెల్లుకొని యుల్లంబులు జల్లనం బిడుగులు పడం జేసియు నుత్పాతంబులు గావించుచు దేవదానవాదులకు భయంకరంబుగా గగనవీథీవిటంకంబున నిలిచి మేఘనాదుండునుం బోలె మేఘనాదంబున సింహనాదంబు చేసి యద్దనుజసింహుండు విక్రమింప నవ్విక్రమంబు శక్రుం డొక్కచారునివలన విని సక్రోధుండై యాక్రవ్యాదుం డెవ్వం డరసి రమ్మని యొక్కదూత బుత్తెంచిన నతండు సత్వరంబుగ వచ్చి యంబరంబున శాంబరీడంబరంబు నెరపుహిడింబాపౌత్రుపాలికిం జనుదెంచి. 24

## ఇంద్రుండు మేఘవర్ణునికడకు దూతను బంపుట.

క. నీ వెవ్వ రేల చేసెద, వీవిపరీతములు నిర్జరేశ్వరుఁడు త్రిలో
కవిభుఁడు తెలిసి రమ్మనఁ, గా వచ్చితి నిజముఁ జెప్పఁగాఁ దగు ననినన్. 25

చ. అమరవిభుండు నన్నుడుగ నంపెఁ గృతార్థుఁడ నైతి భీమసే
నుమనుమఁడన్ ఘటోత్కచతనూజుఁడఁ బేరున మేఘవర్ణుఁడన్
శమనజుఁ డశ్వమేధసవనం బొనరించు యావనాశ్వదు
ర్గమున మఖాశ్వ మున్న దనఁగా విని తెమ్మని పంపువెట్టినన్. 26

తే. వీతికై చేయుమాయా విభూతిగాని, యొండు గా దన విని దూత యుత్సహించి
యరిగి యవ్విధ మెఱిఁగింప నమరవిభుఁడు, సంతసము నొందె నిచట రాక్షసవరుండు.

సీ. ఒకచోట జీమూతనికురంబుఁ బొడమించు నొకచోటఁ గురియించు నుపలవృష్టి
వెదచల్లు నొకచోట విస్ఫులింగంబులఁ బడఁజేయు నొకచోటఁ బిడుగుగముల
నతులవాతూలసంహతి ముంచు నొకచోటఁ దొరఁగించు నొకచోట ధూమపటలి
నవరించు నొకచోటఁ జటులాంధకారంబు నొకచోటఁ బెళపెళ నుఱుముఁ జేయుఁ

తే. బెక్కు లీరీతి మఱియుఁ గల్పించి మించి, యహితసేనల నెల్లఁ జీకాకుపఱచి
పట్టి యశ్వంబు మూఁపునఁ బెట్టికొనుచుఁ గగనగమనంబు గైకొని కదలె వడిని. 28

చ. అతఁడు సమీరవేగమున నశ్వముఁ గొంచు నడువీథి నేఁగ న
ద్భుతపడి పోయెఁ బోయె హయముం గొని దానవుఁ డంచు సైనికుల్
వితథఫలప్రయత్ను లయి విస్మృతిఁ గన్గొన వేలుపుల్ కృపా
హితమతి మేఘవర్ణునిపయిం గురియించిరి పుష్పవర్షమున్. 29

తే. ప్రసవవర్షంబు గురియించి ప్రస్తుతించి, త్రిదశు లేఁగంగ హయముతోఁ జదలనున్న
యతనిఁ గన్గొని భీమకర్ణాత్మభవులు, సింహనాదంబు చేసిరి చెంగలించి. 30

వ. ఇవ్విధంబున భీమసేనపౌత్రుండు మాయాబలంబున హయంబు నపహరించుకొని పోవుట భటులవలన విని యావనాశ్వమహీకళత్రుండు పుత్త్రబంధుజనమిత్రసహితుండై నిర్నిరోధం బగుక్రోధంబున నిష్ప్రతీపం బగుప్రతాపంబున వెడలి వియత్పథంబునం జనురథికవీరుల నావేళ నాలుగువేల ననుప ననుపమానసంరంభంబున విజృంభించి వార లంబరంబున యుద్ధమించి మించినపరాక్రమంబునం జక్రశరశూలముద్గరముసలాదిసాధనంబు లంకించుచు నవ్వీరునిం జుట్టుముట్టిన నాజెట్టివిరుదునుం డట్టువారక యట్టహాసంబు చేసి బెట్టిదం బైనరాచట్టుఁ బెఱికి చుట్టుకొనిన మూఁకలఁ గిట్టి వడం జాఁపకట్టు వడంగొట్టె యమరపతిపట్టణంబున కనిచి పట్టితెచ్చిన హయంబును ననిలుపట్టికి బైదురఁ జెట్టునం గట్టి దండంబు వెట్టి నిలిచిన నట్టియెడ.

## మేఘవర్ణుఁడు రాజసైన్యముతోఁ బోరుట.

చ. వెనుకొని యావనాశ్వపృథివీపతిసేనల చుట్టుముట్టినన్
గనుఁగొని మేఘవర్ణుఁ డధికం బగురోషమునం దదీయసై

న్యనివహముల్ వడిన్ దతిమినన్ సుర లచ్చెరు వంది రప్పు డ
ద్దనుజుఁడు మందరాచలవిధంబున నబ్బలవార్ధిఁ జొచ్చినన్. 32

సీ. కలగుండు వడి హల్లకల్లోల మై చాలఁ గలఁగ వాహినులు భంగములతోడఁ
గటకశోభితవిశంకటకూటములతోడఁ బెకలె సపక్షభూభృచ్చయంబు
చండభాస్కరసముజ్జ్వలితహేతులతోడ బాడబోద్భూతవిభ్రమము లడఁగ
నాలోలకీలాలహతులతోడఁ బెనంగి కడలేనివివిధశంఖములు దేలెఁ

తే. బవనసుతపౌత్రదుర్దాంతబాహుదండ, మందరాచలమంథానమథ్యమాన
యౌవనాశ్వమహీపాలకాగ్రగణ్య, వర్ణితాఖిలవిపులసైన్యార్ణవమున. 33

క. ఈకరణి దానవుం డతి, భీకరముగ రణము సేయఁ బిఱుతివియక వై
భాకరసేనలు శస్త్రా, నీకంబుల ముంచి రాతనిశరీరంబున్. 34

తే. అపుడు వృషకేతుఁ డమ్మహాహవముఁ జూచి, మేఘవర్ణుండు హరి విక్రమించి తెచ్చు
నవసరంబున నయ్యాజి నలసినాఁడు, దలము గా దొక్క రునకు నీదళము గెలువ.

క. అని పలికి కార్ముకము గొని, యనిలతనూజునకు మ్రొక్కి యనుమతి గొని తాఁ
జనియె రణం బొనరింపఁగఁ, గనుఁగవ నునుసోఁగ కెంపు గడలుకొనంగన్. 36

శా. జ్యాటంకారకఠోరరావము దిశాజంఘాల మై మ్రోయఁ దీ
వ్రాటోపంబున యౌవనాశ్వనృపసైన్యంబు ల్విలోకించి త
ద్ధాటీనిష్ఠురఖేలనంబునకు సంత్రాసంబు నొంద న్నిరా
ఘాటోత్సాహత మేఘవర్ణుఁడు మదిం గౌతూహలం బందఁగన్. 37

తే. ఇవ్విధంబున వృషకేతుఁ డేఁగుదెంచి, యలసినాఁడవు వత్స నీ వరుగు మనుచు
భీమపౌత్రుని ననిపి యుద్దామసింహ, వృత్తిఁ బరసైన్యమత్తేభవితత కుఱికి. 38

## వృషకేతుఁడు సేనలం దునుముట.

ఉ. బాణనఖప్రకాండముల భద్రగజంబుల సంహరించి కం
ఖాణములన్ వధించి రథకాండములన్ నుఱుమాడి సద్భట
శ్రేణుల మర్మవర్మములఁ జెండి విశృంఖలవృత్తి నాహవ
క్షోణిఁ జరించి జన్యజయశోభితనిష్ఠురసింహనాదుఁ డై. 39

ఉ. హాటకశైలధన్వి త్రిపురాసురవీరుల సంహరించు న
ప్పాటునఁ గార్ముకాంబుధరబంధురమార్గణవృష్టి ముంచినన్
ఘోటరథేభవీరభటకోటులు రూపఱి పోవ వీటికిన్
జే టెఱిఁగింపఁ గంఠగతజీవుఁ డొకం డరిగెన్ రయంబునన్. 40

సీ. అరిగి భద్రావతీశ్వరుఁ జేరి ప్రణమిల్లి సేన లన్నియు సమసిన తెఱంగు
వీతిఁ గొల్పోయినవిధమును విన్నవించిన రోషవిహ్వలచిత్తుఁ డగుచు

నెక్కట్టురా దళం బెంత వచ్చె హయంబు పరుల కేగతి బట్టుబడియె ననిన
దేవర మువ్వు రేతెంచిరి వారిలో నడుకొత్తి కొంతసైన్యము వధించి
తే. సవనహరిఁ గొంచునేగె నద్దివికి నొక్కఁ డతికిబలమెల్ల సమయించె నొక్కఁ డతని
దండ నున్నాఁడు పెనునిట్టతాటివంటి, గుదియ మూఁపున నవరించుకొని యొకండు.
క. అని విన్నపంబు చేసిన, మనమున రోసాద్భుతములు మల్లడిగొన న
య్యనఘులు కారణజన్ములు, జనులకు లే వరయ నిట్టిసామర్థ్యంబుల్. 42
చ. ముగురును నాకుఁ జూడఁగఁ ద్రిమూర్తులు తప్పదు లేక వాహమున్
బొగరున నొక్కఁ డెత్తుక నభోగతి నేఁగుట యెట్లు లెక్కఁగన్.
మిగిలిన సేన నొక్కఁ డపహమించి వధించుట యెట్లు వారిలో
మొగఁ దగువాసి కుంత మన మోవక ద్రుంగుట యెట్లు సైన్యముల్. 43
తే. అశ్వమేధంబునకు విఘ్న మాచరించి, తిగిచి రశ్వంబుఁ దిగిచినఁ దగువ నిమ్ము
వానితోడన సంగరాధ్వర మొనర్చి, దేవతల నెల్ల దృప్తిఁ బొందింతు ననుచు. 44
వ. ఆహవోత్సాహదోహలమ్మన నమ్మహీవిభుండు రథాంగమాతంగతురంగసుభట పుంగవసంగతుం డై పురంబు నిర్గమించి సమరభూమిసమీపంబునకు వచ్చి యా సమీపంబున యుగాంతకాలకాలుండునుం బోలెఁ బ్రచండగదాదండమండితభుజా దండుం డై ఖండనంబున నెదురుచూచుచున్న వృకోదరు విలోకించి యలోక సామాన్యంబు లగునతని తేజోవిశేషంబులకు నద్భుతంబు నొందుచు జన్యంబున సైన్యంబు నెల్ల సమయించి సన్న్యస్తభయుం డై నిజధనుఃకోటివిన్యస్తహస్తుం డై యున్న వృషకేతుం గనుంగొని శిరఃకంపంబు చేసి తనమనంబున 45
ఉ. కంపితదిగ్విభాగమున గాసిలి వచ్చిన నన్నొకింత వీ
క్షింపఁడు సైన్యమున్ సరకు సేయఁడు సింహకిశోరవృత్తిఁ గ
ద్దింపుచు నున్నవాఁడు మది మృత్యుభయం బిసుమంత లేక యీ
తెంపరి కర్మపాశములు ద్రెంపఁగ నిల్చినయోగికైవడిన్. 46
తే. అని బలంబులఁ గర్ణనందనునిమీఁదఁ బంపువెట్టిన వానిసంభ్రమము చూచి
కోపతామ్రాక్షుఁ డగుచు మారుతసుతుండు, ఘనగదాదండ మంకించి కదలుటయును.

## యౌవనాశ్వుండు వృషకేతునితోఁ బోరుట.

సీ. భీమసేనునిసముద్దామత గన్గొని యెదురుగా వృషకేతుఁ డేఁగుదెంచి
యీ రేడుభువనంబు లెత్తి వచ్చినఁ గాక యల్పసైన్యంబు లక్ష్యంబె నీకు
నీపుత్త్రులు నన్ను మన్నించి చూచుచునుండు నే నిక్షణంబున నీవు మెచ్చఁ
బరబలారణ్యంబు భస్మంబు చేసెద నస్మత్కఠోరబాణాగ్నిశిఖల

తే. సఖిలజనులకు దేహంబు లస్థిరములు, ప్రాయములు చంచలంబులు పౌరుషమునఁ
గాని త్రైలోక్యవర్తిని యైనకీర్తి, గలుగ నేరదు తండ్రి యెక్కాలమునను. 48

మ. కరియానం బటుపాశహస్తుఁ బృథుశంఖగ్రీవుఁ జక్రస్తనిన్
బరసేనారమణి న్వరించితి నురోభాగంబునన్ నిల్చె ని
ర్భరకేళిన్ విషమాస్త్రచిహ్నములు సేరన్ వావి గా దింక మా
ను రణోత్సాహము నివు జన్యరతిఁ గాంతు న్నే యశస్సంతతిన్. 49

తే. నన్ను వరియించినది కారణంబుగాఁగ, దేవరకుఁ గోడ లైనసేనావధూటి
సిగ్గు పెంపున మొగము వాంచినది చిత్ర, వైజయంతీనవాంశుకవ్యాజమునను. 50

ఉ. నావుడు వాయునందనుఁడు నందన పొమ్ము చమూవధూటి నీ
కైవస మైన లెస్స యటుగాక నినుం దల మీఱెనేని దా
డౌవుల నిల్చి మద్భుజగదాపటువిభ్రమతాడనంబులన్
జీవ మడంతు నెందు గురుశిక్షఁ గదామతి గాంతు రంగనల్. 51

తే. వత్స నీవు పదాతివి వారు రథికు, లెట్టు పంపుదు నిను మది గట్టి చేసి
యనిన నీకృప నాకు వజ్రాంగిజోడు, చింత వలవదు పనుపు మాజికిని ననుచు. 52

ఉ. భీముఁ బ్రదక్షిణించి మెయిఁ బెంపుచుఁ గెంపగు కన్నుదోయితోఁ
గాముకవృత్తి నేఁగి నవకం బగుచందనకుంకుమాబ్జభూ
శీమృగనాభకర్దమవిలిప్తఁ జమూసతి సాయకాంబకన్
సామజకుంభకర్కశకుచ న్వరియింపఁగ నుత్సహించుచున్. 53

క. వీతభయుం డై యావృష, కేతుఁడు గుతుకమునఁ బెండ్లికిం జనుగతిఁ బ్ర
స్ఫీతగతి వచ్చు మును తన, చేత హతం బైనసమంసీమాభూమిన్. 54

సీ. ప్రథపయోరాశిపగిది నొక్కొకచోట క్షారకీలాలసంకలిత మగుచుఁ
గైలాసశైలంబుకరణి నొక్కొకచోటఁ గరిరాజవదనవిస్ఫురిత మగుచుఁ
బార్థప్రతిజ్ఞాజిభంగి నొక్కొక్కచోట దళితసైంధవముఖోద్దామ మగుచు
శౌరిదక్షిణబాహుసరణి నొక్కొకచోటఁ బృథులరథాంగాతిభీమ మగుచు

తే. విష్ణురాత్మీయకింకరునికరనిర్భ, దళిమారాతిసైన్యప్రతీకశకల
వితతవిషమితసంగరోర్వీతలంబుఁ, జూచి యల్లన నగుచు నచ్చోట నిలిచి. 55

మ. తనపై వచ్చు విరోధిసైన్యముల నుద్యద్బాణజాలంబులన్
దనువుల్ సించియు నశ్వసంతతుల గాత్రంబుల్ విభేదించియున్
ఘనదంతావళికుంభకూటములముక్తాశ్రేణులన్ రాల్చియున్
దినవాథాత్మజసూతి రౌద్రరస మున్నిద్రస్థితిన్ జూపుచున్. 56

శా. సామోదవినోదివై చనియె భాస్వంతుండు కాకుంత మా
రామాక్షోణిరుహాగ్రనీడముల నాక్రందించి నాకాశవీ
థీమధ్యంబునఁ దారకాగణము సందిగ్ధచ్ఛవిం జొచ్చె ది
క్సీమాగోళము నంతకంతకును గొంచెం బయ్యె లేఁజీఁకటిన్. 155

క. సరసిజబాంధవుఁ డీగతి, చరమాంబుధివీచికావశంవదుఁ డైనన్
దురగంబుఁ గొనుచుఁ బురమున, కరుదెంచె సుబుద్ధి వేడ్క నాసమయమునన్.

సీ. కురువిందమణికుడ్యకుట్టిమంబులచేతఁ బగడంపుఁ జేవకంబములచేతఁ
దళతళ మెఱయుదంతకవాటములచేతఁ గనకసోపానమార్గములచేతఁ
దోరంపుముత్యాలచూరుజొంగ్గలచేత జిగిమించుసాలభంజికలచేత
మృదులాంబరంబులమేలుకట్టులచేత సరకలేనిధూపవాసనలచేత

తే. మహిమఁ జెంపొందు నాస్థానమంటపంబు,నందు మూర్ధాభిషిక్తులు సందడింప
బభ్రువాహనుఁ డధికసౌభాగ్యగరిమ, గడలుకొన రాత్రి పేరోలగమున నుండె.

చ. క్రమమున సప్తిరక్షకులు క్రిందుకొనం గరదీపికాసహ
స్రములు వెలుంగఁ జిత్రపటచామరహేమఖలీనకింకిణీ
కము లగునుత్తమాశ్వములఁ గన్గొను చుండెడుచో సుబుద్ధి భూ
రమణునిఁ గాంచి యుత్తురగరత్నముఁ గానుక పెట్టి మ్రొక్కెనన్. 158

తే. అవ్విభుఁడు దానిరేఖ కాహ్లాద మంది, కదియఁ దెప్పించి చూచి మొగంబు నిమిరి
ఫాలసంస్థితకలధౌతపత్త్రలిఖిత, చారుతరశబ్దబంధంబు చదువుకొనియె. 159

ఉ. దుర్జయరాజమండలవిధుంతుదమూర్తి యుధిష్ఠిరక్రతూ
త్సర్జిత మైనయీహయవతంసము త్రిమ్మర నంగరక్షగా
నర్జునుఁ డేగుదెంచె నిటలాక్షుని గెల్చినజోదు విక్రమో
పార్జితలీలఁ బట్టుఁడు రయంబున శూరులు ధాత్రిఁ గల్గినన్. 160

వ. అని పఠించి.

ఉ. భూపకుమారుఁ డిట్లను సుబుద్ధిఁ గనుంగొని సాదరంబుగన్
మాపెదతండ్రి ధర్మజుఁ డమానుషవిక్రముఁ డశ్వమేధదీ
క్షాపరతంత్రుఁ డై విడువఁగా నిటు వచ్చిన దీహయంబు నా
నాపురవాటికావిహరణంబుల మజ్జనకుండు తోడుగన్. 162

మ. శివుతో నెక్కటికయ్యముం దొడరి మెప్పించెన్ బ్రతాపించి వా
సవువర్ధాసన మెక్కె వేలుపులు మెచ్చం గాలకేయాదిదా
నవులం గీటడఁగించె నట్టిత్రిజగన్మాన్యుండు చిత్రాంగదా
ధవుఁ డిచ్చోటికి నేగుదెంచె నట మద్భాగ్యంబు సామాన్యమే. 163

క. కావున మన మెదురుకొనం,గా వలయును సమస్తసైనికవ్రాతముతో
నీ విందుకుఁ దగుయత్నము, గావింపుము వేసఁ బ్రభాతకాలంబునకున్. 164

తే. అనుచు సేనాని వీడ్కొల్పి యర్ధభంగి, జనపతుల నెల్ల నిజనివాసముల కనిపి
పవనహయము సాహిణులవశంబుఁ జేసి, యంతిపురమునకరిగె భూకాంతుఁ డపుడు.

వ. అంతం బ్రభాతసమయం బగుటయు నక్కుమారవరుండు సముచితప్రకారంబున మేలుకని కాల్యకరణీయంబులు సర్వంబు నిర్వర్తించి వివిధమణిభూషణాంబరమాల్యానులేపనంబుల నలంకృతుం డై నిఖిలసామంతమంత్రిపురోహితానేకహితజనంబులు పరివేష్టింప నాస్థానమండపంబునకు వచ్చి హయాధిరోహణంబు సేయు నెడం గంచుకిజనంబు లంతంత ముందఱం గ్రందుకొనుసందడిం దొలంగ జడియుచు హుంకారంబులు సేయఁ బుణ్యాంగనానివహంబులు చల్లులాజాక్షతదూర్వాంకురప్రసూనంబు లంగీకరించుచు వందివైతాళికమాగధస్తుతిరవంబులును బ్రచండభేరీమృదంగశంఖబిరుదకాహళరవంబులు ననపరిమితచతురంగవాహినీనివహకోలాహలంబులును నొక్కింత నిగిడి దశదిగంతరంబులం గదలుకొన బహువిధోపాయనపురస్సరంబుగా బురంబు నిర్గమించి. 166

సీ. తర్కించి హేమభూధరముఁ దేఁడని కాని సౌవర్ణవితతికి సంఖ్య లేదు
లక్షించి మలయశైలమ్ముఁ దేఁడనికాని గంధసారమునకు గణన లేదు
దట్టించి గంధమాదనముఁ దేఁడనికాని ఘనసారపాళికిఁ గడమ లేదు
చర్చించి రోహిణాచలముఁ దేఁడనికాని వివిధరత్నములకు వెలితి లేదు

తే. నాఁగఁ దనవీటఁ గల్గునానావిశేష, వస్తువులతోడ నర్ఘ్యరాశ్వంబుఁ గొనుచు
వచ్చి వాహంబు డిగ్గి వివ్వచ్చుఁ గాంచి, బభ్రువాహనుఁ డందంద ప్రణతిఁ జేసి.

## అర్జునుఁడు బభ్రువాహనుని దిరస్కరించుట.

ఉ. అప్పుడ మౌక్తికాంజలిఁ బ్రియంబునఁ జేయుచు దేవ నిన్ను నై
తప్పునఁ జేర నీహయము తండ్రికి నోర్వక పోదు బిడ్డఁ డే
యొప్పమిఁ జేసె నేనియు ననూనకృపామతి నన్నుఁ జూచి యీ
తప్పు సహింప మంచు వసుధాస్థలిఁ జాఁగిలి మ్రొక్కెఁ గ్రమ్మఱన్. 168

ఉ. మ్రొక్కిన నాదరింపక నరుండువియన్నదిశాపవాక్యముల్
ద్రొక్కిన నాగ్రహం బుడుపలేక కుమారునిఁ దన్నెఁ దన్నినన్
గక్కున మొంది కాతఁ డవికారత నిల్చిన రాజు లందఱున్
గ్రక్కున నాప్తవాక్యములుగా నపు డిట్లని రింద్రసూతికిన్. 169

సీ. తనయునిఁ గృపఁ జూడు మనిరి సాత్యకి యింత కలుషింపఁ జనద నెఁ గర్ణసుతుఁడు
హంసకేతుఁ డిది యనకార్య మని చెప్పె నీలధ్వజుండు మన్నింపు మనియెఁ

బనిలేనిపని యని పల్కెఁ బ్రద్యుమ్నుండు కృతవర్మ తగ దపకీర్తి యనియె
ననుసాల్వుఁ డనియె భావ్యంబు గా దని యావనాశ్వుఁడీచంద మపాయమనియె.
తే. మఱియుఁ దక్కిననరాజు లందఱును వేన, వేలభంగుల నీరీతి విన్నవింప
నాదరింపక మదిఁ గోప మంతకంత, కడరఁ బార్థుఁడు బభ్రువాహనునిఁ జూచి.
ఉ. ముంగలఁ బాఱితెంచుహయముం గని పట్టి పిఱుంద వచ్చు సే
నం గని ప్రాణభీతిఁ గదనంబునకుం జొరవైతి వోరి మా
వంగడ మాట బొంకు మను వైశ్యునకుం గనెఁ బోలు నిన్నుఁ జి
త్రాంగద యన్నఁ బొక్కిపడి యానృపసూనుఁడు పల్కెఁ దండ్రితోన్. 171
మ. నను నేమన్నఁ గొఱంత లేదు సభలోనం బుణ్యచారిత్ర మ
జ్జననిం దప్పుగ నాడి తీనికృతికిన్ సైరింపఁగా నేర నా
వినయం బింతయుఁ దెచ్చెఁ జాలుఁ బలుకుల్ వేయేల నే క్షత్రియుం
డనో వైశ్యుండనో చూడు మంచు మగిడెన్ సంగ్రామసంరంభి యై. 172
చ. అపుడు సుబుద్ధి సైన్యముల నన్నిటి నొక్కమొగంబుగా నమ
ర్చి పురికిఁ గానికల్ మగుడఁ ద్రిప్పి జయావహతూర్యరావముల్
గపటుహారావముల్ దిగిభకర్ణపుటీపుటికాంతరంబులం
దుపహతిఁ జేయఁ దత్క్రతుహయోత్తమ మొక్కెడఁ గట్టఁ బంపుచున్. 173

## బభ్రువాహనుఁ డర్జునుసైన్యంబు దైన్యంబు నొందించుట.

సీ. కల్పితధ్వజఘంటికామాల్యసముదీర్ణ హేమకళాంగంబు లేడుకోటు
లొకయర్బుదము మదపూర్ణఘనిరాఘాట సన్నాహములు భద్రసామజములు
చటులధాటీసముద్భటమనోజవనిర్జితోధవాహంబు లర్బుదయుగంబు
మూఁడర్బుదములు సముద్యద్భుజాటోప విజయధౌరేయులు వీరభటులు
తే. క్రందుకొన సైన్యనాయకాగ్రణి ఘటించెఁ, గాకచక్రసమాకృతిగాఁ గపీంద్ర
కేతుబలసాళకరధూమకేతు వనఁగ, నాహవభయంకరం బైన మోహరంబు. 174
చ. అనుపమరత్నబంధురము హాటకనిర్మితముల్ మయూరవా
హనపరిశోభితంబు వివిధాయుధగర్జితముల్ విచిత్రకే
తనరుచిరంబు నైనయరదంబు ముదంబున నెక్కి బభ్రువా
హనుఁడు తదగ్రభాగమున నాయితమై నిలిచెం జలంబునన్. 175
శా. ఆరీతిన్ నరనాథసూతి కృతజన్యారంభుఁ డై నిల్వ నా
సీరస్ఫారబలంబు లొండొరు లధిక్షేపంబు లేపారఁగా
వీరావేశభరంబునం బెనఁగె విద్వేషించి ప్రాక్పశ్చిమాం
భోరాసుల్ దలపడ్డచందమున నార్పుల్ మింటితో నంటఁగన్. 176

మ. చతురంగంబు లిట్లు మెండుకొని వాచాటోగ్రరేఖాసము
ద్ధతి సంధావిధులన్ బరస్పరజయోత్సాహంబు లుప్పొంగ న
ద్భుతవృత్తిం దెగి పోర నుచ్ఛలితమేదోమాంసమస్తిష్కశో
ణితకీర్ణం బగుచుండె భండన మఖండీభూతశస్త్రాహతిన్. 177

క. ఈలీల దుర మొనర్పఁగ, వాలినదర్పమున బభ్రువాహనధరణీ
పాలుండు తేరు గదియం, దోలించి సుకేంద్రతనయుతో ని ట్లనియెన్. 178

చ. తనయుఁడఁ గాన నీచరణతామరసంబులు భక్తిఁ గొల్చువే
డ్క నరుగుదెంచినం గడపఁగా నటు లాడితి వాడు మెల్ల మ
త్సునిశితబాహువిక్రమము చూచుతలంపునఁ గాదె తీర్తు నీ
మనికిత మిప్పు డందుకొనుమా నిజకార్ముక మంచుఁ బల్కినన్. 179

మ. అనుసాల్వుం డపు డక్కుమారు నెదిరిం చాకర్ణరుక్మపుంఖముం
డనుఁడై ఘోరనవాంబకంబులు నిగుడ్చన్ వాని లెక్కింప కా
తనిమీఁదం జడి గొల్పె నూఱుశుకపత్త్రోద్యోతశాతాస్త్రముల్
కినుకన్ వాఁ డవి త్రుంచి తోడన పయిన్ గీల్కొల్పె బాణౌఘముల్. 180

క. ఈచందంబునఁ బటునా, రాచపరంపరలఁ దొరఁగురక్తంబులచేఁ
బూచినమోదుగులకు నెన, యై చేసిరి దురము త్రిజగదాభీలముగన్. 181

ఆ. అపుడు బభ్రువాహుఁ డనుసాల్వు తేరియు,గ్యముల సూతు సిడముఁ గార్ముకంబుఁ
దునిమి వైచె నాలుగును నైదు నేడు నె, న్మిదియుఁ దోమరముల నదటు మిగిలి.

మ. అనుసాల్వుండును నప్డు నూతనశతాంగారూఢుఁడై విల్చి తో
డన సజ్జీకృతచాపుఁడై చటులకాండశ్రేణులన్ బభ్రువా
హనుఁ దూలించిన నాతఁ డెంతయును రోషావేశతం జేర్చి క్రే
కఁ దశస్త్రాహతి నాతనిన్ విరథునింగాఁ జేసి పెల్లార్చినన్. 183

క. గద కేలం గొని ధర గ్ర, క్కదలఁగ ననుసాల్వుఁ డెదురుగా నడచి పవ
ప్రదరములు బభ్రువాహనుఁ, డెదవించిన వ్రాలె నాతఁ డెత్తినమూర్ఛన్. 184

వ. అప్పుడు. 185

శా. ప్రద్యుమ్నుం డనుసాల్వపాటవము నుగ్రంపథ్యుఁడై హేమపుం
ఖద్యోతాశుకపంక్తి లేచు నపు డల్కన్ బభ్రువాహుం డవి
చ్ఛేద్యప్రౌఢిమఁ జేర్చి తత్తనువు ముంచెన్ బాణవర్షంబునన్
సద్యోమగ్నముగా ననంగుఁ డేగుటన్ స్వాభావికార్థంబుగన్. 186

మ. గురుదర్పోద్ధతి నిట్లు మర్మములు గీలొక్క నేయఁగా శౌర్యవి
స్ఫురణాహంకరణంబు తుంటువడి యచ్చో నేడుచందంబునన్

శరసంవేధితదేహుఁడై నిలిచె విష్వక్సేనసూనుండు సం
గరకర్మోచితకృత్యముల్ మఱచి కింకర్తవ్యతామూఢతన్. 187

క. హరిసూను నివ్విధంబునఁ, దిరుగుడువడ నేసి మఱియుఁ దీవ్రశరములన్
నరుని చతురంగసేనల, ను రణంబున బభ్రువాహనుఁడు సమయింపన్. 188

క. కనుఁగొని ప్రద్యుమ్నుఁడు నె, మ్మనమునఁ దెలివొంది విక్రమంబునఁ దను నొం
చినయట్లు బభ్రువాహను, తనువును నస్త్రముల నొందెఁ దద్దయు నలుకన్. 189

వ. మఱియును. 190

శా. తత్సేనానివహంబు నుద్ధతబలోత్సాహంబునం బూతనా
జిత్సూనుండు కఠోరసాయకములం జెండాడ నాపుంఖవి
ద్ధోత్సేధోగ్రశబంధకంఠబిలనిష్ఠ్యూతాస్రధారామిళ
న్మృత్సాకర్దమదుర్దినం బగుచుఁ గాన్పించెన్ రణం బయ్యెడన్. 191

సీ. వడి జెఱఁ దిరిగి మ్రొగ్గడుమదావళములుఁ దోన రూపఱినయాధోరణులును
బల్యాణములఁ గ్రిందఁ బడినరాహుత్తులుఁ గూలి విజ్జునఁ దన్నుకొనెడుహయలుఁ
బొరపు దప్పినరథంబులసమీపంబునఁ జక్కైనరథిరథ్యసారథులును
బొలిసినవీరయోధులుఁ గొంత దుమురైన చక్రాసిధనురాదిసాధనములుఁ

తే. జింపు లైనమైమఱువులుఁ జిద్రుప లైన, సీసకంబులు నలి యైనచిందములును
ద్రుంపు లైనచామరములుఁ దునుక లైన, తొడవులును గల్గి సమరమత్యుగ్ర మయ్యె.

క. అప్పుడు చతురంగంబుల, కుప్పలు కులగోత్రగరిమఁ గొంచె పఱుపఁగా
నుప్పొంగి మానసంబులఁ, గప్పరపడి భూతములు జిఘాంసాపేక్షన్. 193

చ. అలమి గజాశ్వమర్త్యకుణపావలి నంకములం దమర్చి తి
త్తొలిచి పృథూరుజానుజఘనోదరపార్శ్వభుజాంతరంబులన్
గలపలలాదులం దనిసి కర్పరముల్ బలితంపుఁగోఱలం
బెళపెళ నొక్కి లోమెదడు పీల్చి మదంబునఁ జొక్కి యాడుచున్. 194

వ. మఱియును. 195

సీ. నృకళేబరంబు మింటికి వైచి కందుకక్రీడ వర్తించు డాకిని యొకర్తు
దంతిదంత మ్మలాతముగఁ ద్రిప్పుచు నాడుఁ జౌపదంబులకుఁ బిశాచ మొకటి
యజినంబు చెఱఁగుగా నభినయించుచు దేశపాత్రయై యొకప్రేత పాత్రలాడు
భుజమునఁ గూబరంబు ధరించుకొని సోలి దరిచేసి యగుచు భేతాళుఁ డొకఁడు

తే. భూతగణములు గరతాళములు ఘటింపఁ, జిత్రగతి నొర్తు చఃచకఝుంకృతులకుఁ
గొనుదువాళుల నఖిలదిక్కులు చలింపఁ, దాండవం బాడు నటభైరవుండుఁ బోలి.

చ. అదిఁ గని బభ్రువాహుఁ డభియాతికి నడ్డముగా వడిన్ రథం
బు దఱిమి నిష్ఠురాంబకసముత్కరముల్ నిగిడింప గూఁటిలో

నోదఁగినగూబచందంబున నుండియు నమ్ములు వో విదిర్చి మి
న్నదరఁగ నార్చి చండవిశిఖావళి నాతని నొంచెఁ గ్రమ్మఱన్. 197

ఉ. నొంచుట బొంకుగా నతఁడు నూల్గాని కృష్ణతనూజుఁ డెక్కఁగాఁ
ద్రుంచె రథంబు లిర్వది యదుప్రవరుండును బభ్రువాహుదో
రంచితవిక్రమంబు గొనియాడుచుఁ దా నరదంబు లేయుచో
నెంచ నశక్య మయ్యె నతఁ డెక్కఁగఁ ద్రుంచిన తేరు లేరికిన్. 198

ఉ. ఈసరవిం బరస్పరజయేచ్ఛలఁ బెండియు దివ్యబాణవి
న్యాసపటుప్రహారకరణంబులఁ జక్రగదాపరశ్వధ
ప్రాసకృపాణఖేటములఁ బట్టి పెనంగిరి బాహుశౌర్యముల్
త్రాసునఁ దూఁపవచ్చు ననఁ దక్కువ యెక్కువ లేక యిద్దఱున్. 199

క. క్రోధాగ్నిజ్వలితశిఖా, యూధంబులు వెలికి నెగయుచున్న కరణి న
య్యోధవరులతనువుల నని, రోధక్షతజోగ్రనిర్ఝరులు గనుపట్టెన్. 200

క. నిండినమూర్ఛల ధృతకో, దండనమత్కోటిభూషితశిరోధులతో
నుండు నెడ బభ్రువాహుఁడు, గాండివగుణరావబోధకరనుతిఁ దెలిసెన్. 201

తే. అట్లు తెలివొంది బభ్రువాహనుఁడు పాండు
తనయుఁ గదియంగ నరదంబుఁ దఱుముకొనుచు
వచ్చునప్పుడు రాఘవేశ్వరుఁడుఁ గుశుఁడుఁ
గయ్య మొనరింపఁ గదిసిన ట్లయ్యె ననిన. 202

క. విని వినయంబున నిట్లని, జనమేజయనృపతి పల్కె జైమినిఁ గని నం
దనుఁ డైనకుశునితో నె, ట్లని చేసెను రామచంద్రుఁ డని యడుగుటయున్. 203

మ. కరుణాపూరితనేత్ర దారుణరణక్ష్మానిర్భరక్షాత్ర బం
ధురసాలద్రుమచైత్రనిర్దళితశత్రుక్షేత్ర రామాదిభూ
వరచారిత్ర నిరంతరోత్సవరణద్వాదిత్ర రామాసము
త్కరసమ్మోహనగాత్ర విశ్వజగదేకచ్ఛత్ర భాగ్యోన్నతా. 204

క. క్షితినుతమీసరగండా, ప్రతివీరపురోపకంఠబహువిధఖురళీ
గతచతురతురగరింఖో, ద్ధతధూళీపాళిఘుకితబ్రహ్మాండా. 205

స్రగ్విణి. రాజవంశాగ్రణీ రాజచూడామణీ, యాజిలక్ష్మీకరోదద్విలాసక్రియా
బీజసాకారపృథ్వీవరాహాంకభృ, ద్వైజయంత్యంశుకోద్వర్తితార్కాంశుకా. 206

గద్యము.

ఇది భారతీతీర్థ శ్రీచరణకరుణాపాత్ర గాదయామాత్యపుత్త్ర వినయ విద్యాసముద్ర
పినవీరభద్రప్రణీతం బైన జైమినిభారతంబునం దశ్వమేధపర్వంబునం
బంచమాశ్వాసము.



శ్రీ

# జైమినిభారతము.

## అశ్వమేధపర్వము, షష్ఠాశ్వాసము



రామాయణభారత
చారుతరకథాసుధాప్రసన్నమనఃపం
కేరుహా యసమానజయ
శ్రీరుచిరనివేశ నారసింహమహీశా. 1

వ. అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రున కిట్లనియె. 2

### శ్రీ రా మ చ రి త్ర ము

క. భూనాథ కుశలవోపా, ఖ్యానం బహుపవనేతిహాసము శ్రేయో
ధానం బాశ్రితభక్తిని, ధానం బది వినుము సావధానత మెఱయన్. 3

సీ. తండ్రిపంపునఁ జతుర్దశవత్సరంబులు రాముఁ డరణ్యమార్గములఁ దపము
గావించి కదనరంగమున రావణకుంభకర్ణాదికుటిలరాక్షసులఁ దునిమి
చటులాగ్నిముఖమున జానకిఁ జేపట్టి యనుజన్ముఁడు విభీషణార్కతనయ
జాంబవత్ప్రముఖవృక్షచరవీరులుఁ గొల్వ రా నయోధ్యానగరంబుఁ జొచ్చి

తే. పౌరు లెదురుకొనంగఁ బుష్పకము డిగ్గి, యావసిష్ఠున కర్థి సాష్టాంగ మెఱఁగి
తల్లులకు మ్రొక్కి తనకు వందన మొనర్చు, భరతశత్రుఘ్నులను భుజాంతరముఁ జేర్చి

క. అంతట రఘునాయకుఁడు సు, మంతుఁడు మొదలైనముఖ్యమంత్రివరులవా
త్సంతాప ముడుగ నాయా, యంతరముల గారవించు నాసమయమునన్. 5

క. పెనిమిటివియోగమునకుఁ, దనయుఁ డడవి కేఁగుటకు వనరుకౌసల్యా
జనయిత్రి రామభద్రునిఁ, దనయురమునఁ జేర్చి గద్గదస్వర యగుచున్. 6

శా. అన్నా రాఘవ నన్నుఁ గన్గొని వసిష్ఠాదుల్ భవత్సూనుఁ డ
చ్ఛిన్నుం డతఁడు డప్రమేయబలుఁ డచ్ఛేద్యుం డనన్ విశ్వసిం
పన్ నాలో నిపు డద్దశాస్యుఁ గలనన్ మర్దించి నీవచ్యుతుం
గన్నారం గనుఁగొంటిఁ గాన నిజముల్గాఁ గంటిఁ దద్వాక్యముల్. 7

తే. అనిన సంబరమతియు సాష్టాంగ మెఱఁగి, రామచంద్రుండు బంధువర్గంబు ననుజ
వర్గమును గొల్వ నమరేంద్రవైభవమునఁ, బాలనము చేసె సాకేతపట్టణంబు. 8

సీ. పాదపంబులు పుష్పఫలసమృద్ధి వహించె నఖిలధేనువులుఁ జన్నవిసి పిదికె
జగతీవధూటి రాజన్వతియై మించె గత మయ్యె నెచటఁ దస్కరభయంబు
కన రైరి పుత్త్రశోకము తల్లిదండ్రులు పొలఁతులవైధవ్యములఁ దొలంగెఁ
బ్రాణిజాతంబు నిరామయస్థితిఁ బొల్చె నెల మూఁడువానలు నిలిచి కురిసెఁ

తే. చేసేతలవడఁ బండె ధాత్రీతలంబు, పాదరి ధారణ పోఁకముఁ బుట్టెఁ డయ్యె
నన్నివంకల దుర్భిక్ష మడఁగిపోయెఁ, బ్రస్తుతింపంగఁ దగు రామరాజ్యమునను. 9

క. తమ్ములు మువ్వురుఁ దను నిత్యమ్మును భజియింప గుణయుత మ్మగుపరత
త్త్వమ్మగతి రాఘవుండు న్నయమ్మున జగ మేలె జలధు లవధులు గాఁగన్. 10

మ. ప్రతిభం దొమ్మిదివేల్ శరత్తులు నుతింపన్ ధాత్రిఁ బాలించి ము
ప్పాతుదం జక్కఁదనంబు చాలమికి 'నాపుత్త్రస్యలోకో స్తి' యన్
స్మృతి నూహించి పితౄణముక్తిఁ గనలేమిన్ రామభద్రుండు సం
తతమున్ సంతతిఁ గోరి డెందమున సంతాపంబునం బొందఁగన్. 11

క. జనకతనూభవ కాంతన్, గనుపట్టెన్ బ్రథమగర్భగౌరవ మెలమిన్
జననీప్రవాసలగ్నంబున శ్రవణచతుర్థపాదమునఁ జరవేళన్. 12

## శ్రీరాములు దుస్స్వప్నముఁ గనుట.

క. నాలుగుమాసము లరుగఁగఁ, దా లక్ష్మణుచేత సీతఁ దడయక గంగా
కూలమున విడువఁ గల గని, యాలో పొల్కాంచి గుండియ తటా లనఁగన్. 13

క. అరుణోదయమున రాముఁడు, తిరముగ సంధ్యాదివిధులు దీర్చినపిదపన్
గురుఁ డైనవసిష్ఠునితోఁ, జరమనిశావేళఁ గన్న స్వప్నము జెప్పెన్. 14

క. విని యమ్మౌని రామునితోఁ, దను సీతాగర్భరక్షణార్థము గావిం
ప నగుం బుంసవనక్రియలను జనకునిఁ బిలువఁబంపు లక్ష్మణుచేతన్. 15

సీ. అనుచు నమ్మునివర్యుఁ డానతిచ్చినయట్లు మిథిలేశుఁ బిలువ సౌమిత్త్రిఁ బంప
వాస్తుకర్మకుశలచే వాసుదేవమహర్షి వినతత్రిగవ్యూతివిస్తృతంబుఁ

గనకసోపానశృంగాటకోజ్జ్వలము గాఁ బర్జన్యమణిమండపము ఘటింప
సుముహూర్తమున వసిష్ఠుండు రాఘవు సీత, నం దుంచి పుణ్యాహ మైనపిదప
తే. నాజ్యతిలలును జరుహోమ మాచరించి, వెలఁది ధమ్మిల్లమున సూత్రవేష్టనం బ
మర్చి గోధూమయజ్ఞాంగమాలి కాయు, గళము గళమున నాగమోక్తముగ నునిచె.
శా. భేరీకాహళఝల్లరీమురజగంభీరధ్వనుల్ దిక్కులన్
దోరంబై చెలఁగన్ రఘూద్వహుఁడు సాధుశ్రేణికిం బాయసా
హారంబుల్ కలధౌతపాత్రములఁ బర్యాప్తంబు గావించి నా
నారత్నాశ్వగజాగ్రహారములు దానం బిచ్చె మోదంబునన్. 17
తే. జనకుఁ డవ్వేళ సుతమహోత్సవముఁ జూచి, యలరి తనచేతఁబరిపాల్యమగుసమస్త
రాజ్యమును దాశరథికి నర్పణము చేసి, చనియెఁ గౌశికసహితుఁడై వనమునకును.
క. కాకుత్స్థుఁ డుర్వి సర్వము, నేకాతపవారణముగ నేలఁగ నొకనాఁ
డా కాంతుఁ బాడమి జానకి, యేకాంతం బైనవిభుని కిట్లని పలికెన్. 19
ఉ. వల్లభ నామదిం బొడమె వాంఛిత మొక్కటి జాహ్నవీతటిన్
దొల్లిటియట్ల తాపసవధూటులతోడుతఁ గొంత కాల ము
త్ఫుల్లవనీవిహారములఁ బ్రొద్దులు పుచ్చెద నన్న రాఘవుం
డుల్లము జల్లనం గలఁగ నొప్పనికోరిక సీత కోరినన్. 20
తే. వరుసఁ గానల బదునాల్గువత్సరములు, తిరిగియును భూమిసుతకోర్కి దీఱకునికిఁ
దొలుతఁ దనకన్నదుస్స్వప్నదోషలతకు, నెలఁతకోరిక ఫలముగా నిశ్చయించి. 21
క. కానిమ్ము నిన్నవశ్యము, గా నంపెదఁ గాని రేపు కదలు మనుచు న
బ్భానుకులేశుఁడు లోనికి జానకి వీడ్కొలిపి తన్నిశామధ్యమునన్. 22

## శ్రీరాములు చారులచేఁ బౌరులవృత్తాంతంబు దెలియుట.

క. పౌరులవృత్తాంతంబులు, చారులచేఁ జిత్తగింప సమయం బని దౌ
వారికుఁడు చెప్ప విని రఘు, వీరుఁడు పిలిపింప వచ్చి వినమితు లైనన్. 23
క. ఇనకులుఁడు గూఢచారులఁ, గనుఁగొని యీప్రొద్దు మత్సకాశంబునకుం
జనుదెంచినార లేమే, వినఁబడియెనె పురములోన వింతలు మీకున్. 24
క. దూతలు సత్యముఁ జెప్పెడు, నాతోఁబుట్టువుల నైన నన్నైన ధరి
త్రీతనయ నైన నే యొక, రీతిగ నాడరుగదా పురీజను లనినన్. 25
క. శ్రీరామ నీవు సాక్షా, త్తారకమంత్రాధిదేవతవు నిను నర్థిం
భేదుఁగాను వారు ధూర్తవి, మూఢు లనిన నిన్ను నాడుదురె పురజనముల్. 26

క. కలుషములు నిన్నుఁ దలఁచిన, నిలువున భస్మమయి పోవు నేఁ డెవ్వలనన్
దొలఁగనిపాపము వినఁబడె, నలికెద మది విన్నవింప నశుభం బగుటన్. 27

చ. రజకి దా కర్త నాథుఁడు తిరస్కృతిఁ జేసినఁ బుట్టినింటి కే
గ జనకుఁ డాత్మజం గని జగజ్జనగాత్రమలీమసాంశుక
వ్రజములు శుద్ధి సేయునిజకంశము మైల వడంగఁ జేసి తిం
టిజగడ మింటిలోనె హావణింపక నీ విటు లొంటి వచ్చుటన్. 28

చ. అని తనకూఁతుఁ దోడ్కొనుచు నల్లునియింటికి నేగ మామఁ జూ
చనములోన నె య్యొలికినట్టుల మంచుచు నిల్లు వెళ్లి నాల్
దినములు లేదు నాకడకుఁ దెచ్చితి వే నలరాఘవుండ నే
దనుజగృహీతసీతఁ దనదా రని క్రమ్మఱఁ దెచ్చి యేలఁగన్. 29

సీ. అనుచు నన్నీచాత్ముఁ డాడుదుర్భాషలు విని కర్ణములు మూసికొనుచు నచట
నిమిషమాత్రంబైన నిలువ కమ్మడివేలు తలవంచుకొని పోయెఁ దనయఁ గొంచు
మలినాంబరాంబు కశ్మలయవాగూచ్ఛిష్ట కుక్షింభరులయందు గుణము లరయఁ
గలవె యైనను విన్నకార్యంబు గాన దేవర కిప్పు డెఱింగింప వచ్చు టనిన

తే. గుండె నీఱుగ నవిసి కాకుత్స్థవర్యుఁ, డెట్టకేలకు ధైర్యంబు మట్టుపఱిచి
చారపురుషుల నంపి తచ్చరమరాత్రి, గడపె నొకబ్రహ్మకల్పంబుఁ గడపి నట్లు. 30

శా. అలోనన్ భరతాదిసోదరులు సేవాపేక్ష రామక్షమా
పాలుం గొల్వఁగ వచ్చి కర్ణపరితాపవ్యగ్రలోకాపవా
దాలాతగ్రథితాత్మరుక్ష్విశునలోలాపాటలాపాంగధా
రాశాశ్రుప్రవిలిప్తగండఫలకోరస్కున్ విలోకించుచున్. 31

ఉ. ఎన్నఁడు లేమి నేఁ డినకులేశ్వరుఁ డేమికతంబొ బాష్పసం
ఛన్నముఖాబ్జుఁడై ఘనవిషాదముఁ బొందుచు నున్నవాఁడు వి
ద్వన్నుతశీలుఁ డెంతదురవస్థకుఁ దావల మయ్యె నంచుఁ దా
రన్న పదాబ్జముల్ గదిసి యందఱు సాఁగిలి మ్రొక్కి లోఁగుచున్. 32

క. నీయంఘ్రిసేవ సకల, శ్రేయోమూలముగ నెఱిఁగి సేవింపంగా
మాయెడ నిపుడేమియు దయ, చేయవు నే మేమితప్పు చేసితి మనినన్. 33

## శ్రీరాములు సోదరులతో జానకి నెడఁబాసెద ననుట

క. వారలతో రఘువరుఁ డనుఁ, జారులవాక్యములు చెప్పి సడిఁ బొందెను సీ
తారమణి లోకమున దు, ష్కారుషచ్ఛే నిందఁ బొందుశ్రుతియుం బోలెన్, 34

తే. అశనిసంకాశ మైనలోకాపవాద, భయము డెందంబు వ్రక్కలింపఁగఁ దొడఁగె
సాధ్వి యగుసీత విడిచెద జననభీతి, యోగపురుషుండు మమకార ముడిగి నట్లు.
తే. అనిన భయకంపితస్వాంతుఁడగుచు భరతుఁ, డనియె నిట్లావతీఁజాతురయ్యబుధులు
కపిలఘటియించి యస్పృష్టిగలసె ననుచు, నారుణాటవివిడుచునె దయఁదొఱంగి.
సీ. అదిగాక లంక దశాస్యునిఁ బోరిగొన్న వెనుక బ్రహ్మాదులు వినుతి సేయఁ
జిచ్చులోఁ జొచ్చి నిల్చినమహీసుతఁ జూచి యీనాతి తనకోడ లైనకతనఁ
గనఁ గల్గెఁ బుణ్యలోకము లట్లు గాకున్న సుతశోకమృతులను సుగతిగలవె
యనుచు వానరసేన వినుచుండ నాతఁడే మనతండ్రి దశరథక్ష్మాతలేశుఁ
తే. డలఘుచారిత్ర యిక్ష్వాకుకులపవిత్ర, జనకపుత్త్రిక నికటు వైజనన నకట
చటులపక్షిమృగాహిరాక్షసవిహార, విషమ కాంతారమున నెట్లు విడిచె దనిన. 37
క. ఇనకులునితోడ లక్ష్మణుఁ, డను నపు డాలోకమాత నాడఁదురాత్మున్
దునుమక జానకి విడువం, జను నే యన నట్ల పలికె శత్రుఘ్నుండున్. 38
చ. అనుటయు రాఘవుండు భరతాదుల కిట్లను సీత లోకపా
వని యగు నిక్క మైన నపవాదము పుట్టినచోట రాజ్య మై
నను ననుజన్మపుత్త్రు లయినన్ హితుఁ డైన మదీయదేహ మై
నను గణుతింపఁగాఁ దృణకణం బన జానకిఁ జెప్ప నేటికిన్. 39
క. మనువంశజాతు లై మును, చనినహరిశ్చంద్రముఖ్యజగతీశులవ
ర్తనములు కీర్తులచేతన, కొనియాడఁగ వలసెఁ గాదె గుణితుగ నిపుడున్. 40
క. కావున యశోవిహీనులు, జీవన్మృతు లగుట కేమి చెప్పఁగ నిందల్
రావచ్చినచోఁ దనువులె, పోవిడుతురు తొంటిభూమిభుజు లట్లగుటన్. 41
క. మంగళచరిత్ర యగుసీ, తాంగన నపవాదభీతుఁ డగునాకుఁ ద్యజిం
పంగ నగు నేఁడు దుష్ప్రభు,జంగము తనప్రాతపుప్పసం బూడ్చుగతిన్. 42
తే. అనిన రాముని తెగువఁ గన్గొని భయమున, భరతశత్రుఘ్ను లేగి రప్పటికిఁ దలఁగి
యన్నదుఃఖాంబునిధిమగ్నుఁడగుటఁ దెలిసి, యుండె నావేళ సౌమిత్రియొక్కరుండు.
క. ఆరాముఁ డపుడు లక్ష్మణుఁ, జేరఁ బిలిచి విడిచిరమ్ము సీతను గంగా
తీరమున విడువవే నప్పి,ధారన్ నాశిరముఁ దునుము తమ్ముఁడ వేగన్. 44
క. జానకిఁ గానల కనుపం, గా నగుపాతకము నీకుఁ గా దది నా కౌఁ
గాని చను మన్నఁ దోరము, గా నిట్టూర్పులు నిగిడ్చి గమనోన్ముఖుఁ డై. 45

## లక్ష్మణుఁడు సీతాదేవి నరణ్యమునకుఁ గొనిపోవుట.

సీ. అన్నకు మ్రొక్కి రథారూఢుఁ డై త్రోవఁ దఱచుగా దుర్నిమిత్తములు గనుచు
వైదేహిమందిరద్వారదేహళి శతాంగము డిగ్గి సీతపాదముల కెరఁగి

తలవంచుకొని భవద్భర్త నీకోరికఁ జెల్లించెఁ గదలి విచ్చేయు వేగ
ననిన నీరాత్రిఁ దన్నలవోక వేఁడినఁ జన విచ్చి నిన్నుఁ దోడని పె ననుచు

తే. నలరి రాముని మణిపాదుకలు మునీంద్ర,కన్యలకు నర్హమగురత్నఖచితభూష
ణాంబరసుగంధములును మేలైనవివిధ, భక్ష్యములు నేర్చి యరదంబుపై నమర్చి.

శా. ఆసీతాంగన యుత్తలం గదిసి సాష్టాంగంబుగా మ్రొక్కి య
క్కౌసల్యాంగని నాదుకోర్కి సెఱపం గాకుత్స్థుఁ డంపెన్ సుమి
త్రాసూనుం బయనంబు చేసి దివిషద్గంగావసన్మౌనికాం
తాసందోహముఁ జూడఁ బోయెదఁ బ్రమోదం బార మీరంపినన్. 47

చ. అన విని కోసలాధిపవరాత్మజ జానకిఁ జూచి యెట్టుగాఁ
జనియెద వమ్మ కంటకవిశంకటసంకటఘోరకాననం
బునకు భవన్ముఖాంబురుహముక్ రదనచ్ఛదమున్ మలీమసం
బును గడునీరసంబు నయి పొల్పెఱఁ బోవుట గాదు నావుడున్. 48

క. వనవాసియుఁ గంటకమర్దనుఁడును నగు దాశరథి నిరంతరమును నె
మ్మనమున నుండఁగ రా నేర్చునె యశుభము లెందు మీకరుణ గలనాకున్. 49

తే. అనుపుఁ డీఁక మీమనము సందియంబుదక్కి, యనిమహీజాతయత్తలకర్థి మ్రొక్కి
పెనఁచి పయ్యెద నీవితో బిగియఁ జెక్కి, హరితఘోటకయుతమైనయరద మెక్కె.

క. చనుసమయమున సుమిత్రా, తనయుఁడు సంజాతగద్గదస్వనుఁడై సూ
తునిఁ జూచి పలికె వేగం,బున దోలుము హరుల రథము పోవలె ననినన్. 51

శా. ఆతం డిట్లను నాకు నశ్వహృదయం బామూలచూడంబు వి
జ్ఞాతం బాశుగతిన్ సమగ్రబలజన్యక్షోణులం బోనను
జ్ఞాతుల్ మా కగుఁ గాని భావిదురవస్థల్ గాన కేతెంచు నీ
సీతాతన్వి భరింపఁ జాల మని వంచెన్ జంచలప్రోథముల్. 52

తే. ఐన నా నేర్పుఁ జూడు మీ వనుచు సూతుఁ,డలమి వలకేలఁ గందంబు లప్పళించి
సమరసముఁ జూపి సెఱియఁ బగ్గములు వదలి,సైంధవంబుల ధేయిని చబుకు సేయ. 53

ఉ. స్యందన మప్పు డప్పురనిషద్యలు లీల నతిక్రమించుచో
ముందట నడ్డగించి మృగముల్ గలఁగం బడె జంబుకంబు లా
క్రందన మార్తిఁ జేసె నని గన్గొనుచుం దనదక్షిణాంబక
స్పందన మాటకున్ బెగడి జానకి లక్ష్మణుఁ జూచి యిట్లనున్. 54

జానకి మార్గమున దుశ్శకునములు గనుట.

ఉ. బెట్టుగ దుర్నిమిత్తము లుపేతము లయ్యెడు నామనంబు చే
వెట్టి కలంచినట్లు దురపిల్లెడు దైత్యుల నూఁచముట్టుగాఁ

గొట్టినశౌర్యధుర్యునకుఁ గోసలరాజతనూజనెయ్యపుం
బట్టికి రామభద్రునకుఁ జేకుఱుఁగాక భద్రముల్. 55

సీ. దండకానవజనస్థానమం దెవ్వాఁడు ఖరదూషణాదిరాక్షసులఁ దునిమె
నెలయించుకొని పోవ నెవ్వాఁడు పోనీక తఱిమి మారీచుమస్తకముఁ ద్రుంచె
నగములు పఱపించి నడవఁగా జలరాశిఁ గట్టించె నెవ్వాఁడు కపులచేతఁ
గలన రావణకుంభకర్ణాదుల వధించి కాచె నెవ్వాఁడు లోకత్రయంబు
తే. నవ్విభీషణవైరనిర్యాతనుండు, రామచంద్రుండు శరణార్థిరక్షకుండు
ప్రజలు వొగడ నాచంద్రతారకముగా న, యోధ్య సుఖలీలఁ బాలించుచుండుఁగాత.

మ. అనుచుం జానకి కొంతద వ్వరిగి యాహ్లాదంబు రెట్టింపఁగాఁ
గనియెన్ సప్తశతప్రవాహముఖజాగ్రత్తీరభూజాత పు
ష్పనవామోదసుగంధిశంబరధరప్రాజ్ఞీరధిక్ లోక పా
వనభాగీరథిఁ జక్రపత్త్రిజమరుద్వాచాలవీచీరథిన్. 57

క. కని మ్రొక్కి వకులతిలకా, మ్రమనమేరుప్రియకమేదురం బైనదరిన్
జనకతనూజ సుమిత్త్రా, తనయుఁడు మునుగా రథావతరణము సేసెన్. 58

క. కువలయమనోజ్ఞయును స, త్కవిసేవితయును సుధాప్రకాశియు నై రా
ఘవుకీర్తిఁ బోలుజాహ్నవి, నవసిజ గని ధన్య నైతి నని కొనియాడెన్. 59

క. ఇరువురు నపుడు సనావిక, తరి నవలికి దాఁటి యూరుదఘ్నజలాభ్యం
తరమునఁ గ్రుంకిడి రుచిరాం, బరములు ధరియించి విపినమార్గోన్ముఖులై. 60

క. కంఠీరవముఖవివరా, కుంఠకఠోరారవాతిఘూర్ణితనిహాతో
త్కంఠేభగహనమహాదుప, కంఠము వైదేహి తఱిసి కళవళపడుచున్. 61

ఉ. సంకటవంశదంశకటుఝుంకృతులున్ నిబిరీసఝిల్లికా
ఝంకృతులుం బ్రచండమదసింధురఘీంకృతులున్ మృగద్విష
ద్ధాంకృతులున్ జనశ్రుతిపదంబులు వ్రక్కలు సేయ వెల్లితా
తంకనివేశదీనలపితంబుల లక్ష్మణుతోడ నిట్లనున్. 62

సీ. ప్రాచీననీరసారణ్యంబు గాని యోగ్యతపోవనశ్రేణి గానరాదు
వికటోగ్రఖరకంటకకుడుంగములు గాని కర్మందిమఠవాటి గానరాదు
సెగయుదావాగ్ని క్రొంబొగ వెల్లు గాని యుద్ధతహోమధూమంబు గానరాదు
శరభగండకసింహశార్దూలములు గాని మౌనిరాట్సంతతి గానరాదు
తే. కఠినపాషాణదుర్ధర్ష కాపథంబు, గాని నడయాడుమార్గంబు గానరాదు
దాశరథిఁ బాసిలట్టిదుస్తరపుఁబాప, కర్మురాలికి నవి యేల గానవచ్చు. 63

## లక్ష్మణుఁడు సీతకు రామాజ్ఞ నెఱింగించుట.

మ. అని సంతాపము నొందుసీతఁ గని ధైర్యం బేది సౌమిత్రి వా
ల్చినసెమ్మోమున బాష్పముల్ దొరఁగఁ దల్లీ నేఁడు లోకాపవా
దనిమిత్తంబున రాఘవుండు నినుఁ గాంతారంబులోఁ డించి ర
మ్మని యత్యంతకృపావిహీనుఁ డగుచు న్నంపెన్ యథార్థం బనన్. 64

క. ఆతీవ్రభాషణము విని, సీతాతన్వంగి సొమ్మసిలి వ్రాలె ధరి
త్రీతలముమీఁద ఝంఝా, వాతాహతిఁ బడినపుష్పవల్లికఁ బోలెన్. 65

క. అపుడు సుమిత్రాతనయుఁడు, విపులాసుతఁ జూచి మిగుల వెఱచి నిజభుజా
గ్రపటాంచలమున విసరుచు, నుపచారము సేయఁ దెలివి నొందకయున్నన్. 66

క. ఏనెపుడు రాఘవుని సే, వానిరతుండ నైతి నేని వసుధాసుత స
త్ప్రాణ యయి బ్రతుకఁ గాకఁ, గా నలమినమూర్ఛ దేఱి కనుఁగొని భీతిన్. 67

తే. ఎలుఁగు రాలుపడఁగ నిట్లనుఁ బదునాలు, గేండ్లు రాఘవుండు నీవు నన్న
రణ్యభూములందు రక్షించి నేఁడు కా, ఱడవి నెట్లు లొంటి విడిచె నన్న. 68

## సీత తనదురవస్థ లక్ష్మణునితోఁ జెప్పి శోకించుట.

చ. మఱఁదులలోన నెన్నఁగల మాన్యుఁడ పావనదండకోర్విఁ బ
ద్దెఱఁగులఁ బర్ణశాలలను దియ్యనిపండుల నేర్చి పెట్టుటల్
మఱచినదాన నె యకట లక్ష్మణ యీయెడ నప్రసిద్ధికిన్
బిఱికులు గాని భానుజవిభీషణు లుండఁగ నీవు నర్హమే. 69

క. పోరానికర్మబంధము, కోరికయై చుట్టు ముట్టుకొనెఁ గాకిపుడుం
గారణము లేక రాఘవుఁ, డారణ్యక్షోణిఁ బాఱనడుచునె నన్నున్. 70

సీ. విపులబాహాశక్తి విఱిచెఁ బురారికోదండంబు నానిమిత్తంబ కాదె
చలపట్టి దైతేయశాంబరీమృగము నస్త్రముఁ ద్రుంచె నానిమిత్తంబ కాదె
పాథోధి గిరులచే బంధించి కపిసేన దాఁటించె నానిమిత్తంబ కాదె
కదనరంగమున జగద్ద్రోహిఁ బంక్తికంధరుఁ గూల్చె నానిమిత్తంబ కాదె
తే. యట్టిరాముఁడు తాన నన్నడవిలోన, డించి రమ్మని నిన్నుఁ బుత్తెంచె నట్లు
తీర్చితివి నీవు నన్న ప్రతిజ్ఞ నెఱయఁ, బొమ్ము తమ్ముఁడ సాకేతపురమునకును. 71

ఉ. దీక్షితుఁ డైనకౌశికుఁడు దేరఁగ నాఁడు వివాహవేళ నా
లక్షితకాశపక్షసమలంకృతమున్ నవరత్నకుండల
ప్రేక్షితమున్ సుధాకిరణబింబనిభంబు విశాలపుండరీ
కాక్షము నైనరామునిముఖాంబుజ మెన్నఁడుఁ బాయ దాత్మలోన్. 72

క. ననుఁ బాసి విరహతాపము, గొని తీఁగలఁ గౌఁగిలించుకొని నటఁ నేఁ డ
వ్వనవల్లులలోన సన్ను వనిచెనఁట రాముఁ డేమనుదు దైవంబున్. 73

తే. అత్తలకుఁ గేలు మోడ్చితి ననపరాధ, పూర్ణగర్భిణి యని మనంబున గణింప
కడవిఁ ద్రోయించెనని రాముఁ డనుము చనుము, వత్స నిర్విఘ్నమగుఁగాక వర్త్మమనిన.

క. కనుమలె పుణ్యాశ్రమములు, నిను రక్షింపుదురు ధారుణియు జాహ్నవియున్
వనదేవతాసమూహము, నని యూఱడఁ బల్కి డెంద మలమటఁ బొందన్. 75

చ. వలగొని భక్తితో నెరఁగి వంచినమోమున బాష్పపూరముల్
దలముగ రామునాజ్ఞకుఁ గలంగుచుఁ బోవ మహీజ లక్ష్మణుం
బలవుచుఁ జూచు చుండెఁ బశుపాలకుఁ డుద్ధతిఁ గొంచుబోవఁ బె
ద్దలుగునఁ జిక్కి హోమగవి తర్ణకముం బొరిఁ జూచు కైవడిన్. 76

ఉ. తేరు హుటాహుటిం గదలి దృష్టి కగోచరమై యయోధ్యకున్.
జేరె నరణ్యరోదనము చేయుచు నమ్మిథిలేశపుత్త్రి మూ
ర్ఛారభసంబునన్ ధరణిఁ వ్రాలె మృగావళితో నుపాంత కా
సారవిహంగముల్ తదుపచారవిధుల్ ప్రకటించుచుండఁగన్. 77

ఉ. ఆకడకున్ యదృచ్ఛ నిగమాగమశాస్త్రకథారహస్యశ
ఖాకృతకృత్యశిష్యపరివత్పరివేష్టితుఁడై మెలంగువా
ల్మీకి మఖక్రియార్థము సమిత్కుశయూపకలాపఖండన
స్వీకృతి నేగుదెంచి పృథివీసుతఁ గాంచి కృపాసమగ్రతన్. 78

తే. అబల యేడ్చినయట్లయ్యె నడవిలోన, నేకతం బిట్లు శోకింప నేకతంబొ
యనిన నమ్మౌనిసాధువాక్యము నిదాఘ, తప్తకేకిని కబ్దశబ్దమును బోలె. 79

ఉ. ఉల్లము చల్లఁ జేసినఁ గృశోదరి తెప్పిరి వీడియున్న ధ
మ్మిల్లముఁ జక్కఁ దోఁపుకొని మెల్లన యే మిథిలేశపుత్త్రికన్
వల్లభుఁ డైనరాముఁ డపవాదభయంబున కోహటించి నా
కల్లనిజంబుఁ జిత్తమునఁ గానక కానలఁ ద్రోచె నీగతిన్. 80

## వాల్మీకియాశ్రమంబున సీత కుశలవులం గనుట.

ఉ. కొంచక యీశరీరమునకుం దెగఁ జూచిన భ్రూణహత్య సి
ద్ధించు నిజంబు గావున మదిం గడుసాహసకర్మముల్ విస
ర్జించితి నాపురాకృతవిశేషమునన్ నినుఁ గంటిఁ గావవే
యంచు మహీజ మౌనిచరణాంబురుహంబులమీఁద వ్రాలినన్. 81

మ. పగలం దూలఁగ సేల సాధ్వి విను మే వాల్మీకి మీతండ్రికిన్
మిగులం బూజ్యుఁడనై చరింతు నెపుడున్ నేఁ డెల్లిటన్ శౌర్యపా
రగులం బుత్త్రుల నిద్దఱం గనెదు గర్భశ్రీభయముల్ చేయునీ
తెగువల్ సేయఁ దలంతురే యని ధరిత్రీపుత్త్రి నూరార్చుచున్. 82

క. జననీ లెమ్మని వాల్మీకి నిజాశ్రమమునకు జానకిం దోడ్కొనిపో
యి నిజోటజాంతరంబున, కనిచి తపస్వినుల నరయుఁ డని నియమింపన్. 83

క. మునిభామ లవ్వధూమణి, ననవరతప్రసవఫలసమాకీర్ణనివా
తనివేశవివృతకృష్ణా, జినముపయిన్ విశ్రమింపఁ జేసి యడలుతోన్. 84

సీ. కాఁడినవిషకంటకములు మేల్పునఁ బుచ్చి తను పెచ్చుపాదపద్మములు గాఁచి
కలదులే దనుపాటి గారనూనె యొకింత పంకించి తలచిక్కుఁ బాపి ముడిచి
తఱచుగాఁ జెక్కుటద్దములనోడిక లైన కన్నీరు దుడిచి మొగంబుఁ గడిగి
పొరలాడఁ బెంధూళి బ్రుంగినవలుఁ పూడ్చి పలుచనినూత్నవల్కలముఁ గట్టి
తే. పూఁటపూఁటకు నుపచారములు ఘటింప, మునివతంసంబు వాల్మీకి యనుదినంబుఁ
గథలఁ గారణమునఁ బ్రొద్దు గడప సతికి, నెలలు దొమ్మిది పరిపాటి నిండుటయును.

క. మిహిరునిఁ గూడక పుణ్య, గ్రహమ్ము లయి దుచ్చకేంద్రకములై వెలుఁగన్
విహితశుభలగ్నమున న, మ్మహిపుత్త్రిక గనియె వరకుమారద్వయమున్. 86

క. దెసలు ప్రసన్నము లయ్యెను, ముసురుకొనియెఁ బుష్పవృష్టి మురజధ్వని పె
ల్లెసఁగె దివి శుభానిలము లొ, లసె వహ్ని ప్రదక్షిణార్చులం గనుపట్టెన్. 87

క. పుత్త్రవతి వైతి వని భూ, పుత్త్రిక నగ్గించి సేరుపునఁ బ్రసవవిధుల్
చిత్రించి మునికి మౌనిక, శత్రము లెఱిఁగింప వటువులం బనుచుటయున్. 88

క. అప్ప కుమారులఁ గనె నని, చెప్పిన వాల్మీకి వచ్చి సీతాసుతులం
గప్పరపడి చూచి మనం, బుప్పొంగి పురస్కృతాగ్నిహోత్రుం డగుచున్. 89

క. అర్చిష్మదర్కసన్నిభ, వర్చస్కులఁ గవలఁ గుశలవప్రకరములం
గూర్చి తగ జాతకర్మముఁ, దీర్చి వరుసఁ గుశలవాభిధేయులఁ జేసెన్. 90

శా. నిష్ఠ న్వారికి నబ్దముల్ వరుసఁ బంద్రెం డేఁగ వాచంయమ
శ్రేష్ఠుల డర్మిలి జాతకర్మమును మౌంజీబంధముల్ జేసి వా
సిష్ఠాగ్నియహావిర్గవిం దలఁప వచ్చె వ్వచ్చి తద్వ్యాసనే
దిష్ఠశ్రోణిఁ జతుర్విధాన్నములు నుత్కృష్టంబుగా నించినన్. 91

మ. కలమాన్నంబును నొల్పుఁబప్పు ఘృతముల్ గజ్జంబులుం బిండివం
టలుఁ బాసెంబులు సానపాలు ఫలముల్ నానావిధవ్యంజనా

కలులున్ రాజతపాత్రలన్ మునిసతుల్ వడ్డింప వాల్మీకి బం
తులు సాగింపఁగ నారగించిరి మునీంద్రుల్ షడ్రసోపేతముల్. 92

క. పేర్పున భుజించి సుఖసం, తర్పణు లగుహానులకు ముదం బలరించెం
గర్పూరఖండతాంబూ, లార్పణములఁ బౌరిలోషికాదులవలనన్. 93

క. ఉదితారుణ సితకిరణా, భ్యుదయులఁ గుశలవుల సత్ప్రపోధనుఁ డంతన్
జనివింప నర్థితోఁ డుతఁ, జదివిరి నానాపురాణశాస్త్రాగమముల్. 94

క. ధీశక్తి నస్త్రవిద్యా, కౌశలులై మౌని నేర్పఁగా నేరిచి ర
ద్దాశరథిసుతులు బహువిధ, వ్యాసుగసంధానమోక్షణాకర్షణముల్. 95

తే. మౌనిజల్పిత మైనరామాయణంబు, స్వరలయగ్రాహమూర్ఛల సంచుఁ దెలిసి
పాడి రాలాపములఁ ద్రిసప్తకము మెఱసి, కుశుఁడు వీణయుఁ దాళంబుఁ గొనిలవుండు.

క. అడవుల మౌనికుమారుల, బడిఁ జని ఫలమూలముల సపర్యలు సేయన్
గోడుకులఁ జూచి మనంబున, నుడు కించుక దీఱి యుండె నుర్వీసుతయున్. 97

## శ్రీరాము లశ్వమేధంబు జేయ నారంభించుట.

మ. అనఘుం డంతట రాఘవుండు జను లాహ్లాదంబునం బ్రస్తుతిం
ప నయోధ్యాపుర మేలుచుండి మది నప్పౌలస్త్యసంహారజా
తనికృష్టం బగు బ్రహ్మహత్య బలవంతం బైనఁ దద్దోషపం
కనిదాఘుంబు తురంగమేధ మని కాంక్షం జేయ నూహించుచున్. 98

క. తలపోసి తపతి యనుభూ, తలపతి హయమేధ సప్తతంతువు నిష్ఠన్
జలిపి తన బ్రహ్మహత్యా, కలుష మడఁచుకొని ప్రశస్తిఁ గనఁడే యనుచున్. 99

ఆ. అనుజహితపురోహితామాత్యరాజులు, కమ్మ గొలువ నోలగమున నుండి
యావసిష్ఠవామదేవగాలవగాధి, సుతులఁ జూచి పలికె నతులఫణితి. 100

క. హయమేధ మఖిలపాప, క్షయ మని నిగమములు చెప్పఁ గావున నాకుం
బ్రియ మొదవెఁ జేయ నయ్యా జ్ఞీయవిధు లెఱిఁగింపుఁ డన వసిష్ఠుం డనియెన్.

సీ. జననాథ బహుదుఃఖసాధ్య మీయశ్వమేధంబు తత్క్రతువిధానంబు వినుము
గోక్షీరతనువుఁ గుంకుమశిరోధియుఁ బీతవాలంబు నసితశ్రవంబు నైన
వీతి నర్చన చేసి విడిచి తద్రక్షకై యతిశౌర్యధనులఁ దో డనుపవలయుఁ
వేవు రుత్తమకులద్విజులు ఋత్విజులు గావలయు వేర్వేఱ వారలకు నొక్క

తే. గజము నరదంబు భటచతుష్కమును బూజ్య, గోశతంబును నస్థియు ఘోటకములు
వేయిబారువు లర్థంబు విశదమౌక్తి, కములు నల్లును ఫలయుగ్మ దానముగ నొసఁగ,

క. మహి నసిపత్త్రిం బ్రీవ్రత, మహిమాంశుకులేంద్ర దీని కరయుఁగ భార్యా
సహితుఁడు గావలెఁ బత్నీ, రహితునకు నుపక్రమింప రా దని పలుకన్. 103
తే. జాతరూపంబుచే మహీజాతరూప, మమర గావించి చేయుదు యాగ మనుచు
మునివరేణ్యునిసమ్ముఖంబునకు సవన, హయముఁ దెప్పించె విభుఁడులాయమున వెదకి.
క. వరలక్షణశోభిత మగు, తురగముఁ గని మౌని విస్మితుం డయి మాల్యా
భరణాదులతో వేపుర, ధరామరుల కపుడు విహితదక్షిణ లొసఁగెన్. 105
ఉ. నేమముతోడ హాటకవినిర్మితభూమిసుతాసమేతుఁడై
రాముఁడు దీక్షఁ గైకొని విరాజితచామరరత్నకింకిణీ
దామవిచిత్రమాల్యపరిధానతురంగమదాక్షతాదులన్
దా మఖవాజి యాగవిధానసమర్చన మాచరించుచున్. 106
క. మిత్రకులాగ్రణి దివిజ, స్తోత్రపరాక్రముఁడు వీరసూః కౌసల్యా
పుత్త్రుఁడు రఘుపతి విడిచిన, సత్రహయముఁ బట్టుఁ డుర్వి సాహసు లున్నన్.
క. అంచు లిఖించినమణిమయ, కాంచనపట్టంబు ఘోటకంబునొసలఁ గీ
లించి బహువాద్యరవములు, మించుకొనఁ బ్రదక్షిణించి మ్రొక్కినవేళన్. 108
మ. శతమన్యుప్రతిమానవైభవముతో శత్రుఘ్నుఁ డక్షౌహిణీ
త్రితయానీకముతో రఘూద్వహుని కర్థిన్ మ్రొక్కినన్ గారవిం
చి తగం గౌఁగిటఁ జేర్చి యీహయము నీచే రక్షణీయంబు ది
క్పతిసందోహముతోడుగా హరిహరబ్రహ్మ ల్విరోధించినన్. 109
క. అని వీడ్కొలిపిన నన్నరుఁ, బునఃప్రణామంబు చేసి పోయెను వేడ్కన్
ఘనవాద్యనినాదంబులు, వినువీధిం బఱచె దిశలు వీడ్వడి మ్రోయన్. 110
మ. క్రతుఘోటంబు సమస్తభూములు నిరాఘాటంబుగం జొచ్చి మా
రుతవేగంబునఁ బోవఁ గొందఱునరేంద్రుల్ డాసి తత్ఫాలసం
స్థితజాంబూనదపత్త్రికాలిఖితసందేశంబు వీక్షించి యా
నతులై కొల్వఁగ వామలూరుజునరణ్యానిం బ్రవేశించినన్. 111
క. ఆకాలమున మఖార్థము, వాకుభవుఁడు వరుణపురమునకుఁ జన ధృతస
జ్జీకృత కార్ముకుఁడై లవుఁ, డాకానన మరయ నత్యయము లే కుండన్. 112
ఉ. ఆమహనీయపావనవనాంతిక నాకసరిత్తటీకుక
శ్యామలకోమలాగ్రయవసస్తబకాభిరతిన్ జనన్ వటు
స్తోమము చూపఁగా లవుఁడు చూచి తదీయలలాటపట్టికా
హైమనవీనపత్త్రిబిరుదాక్షరపంక్తిఁ బఠించె నర్థితోన్. 113

క. మిత్రకులాగ్రణి దివిజ, స్తోత్ర పరాక్రముఁడు వీరనూతకౌసల్యా
పుత్త్రుఁడు రఘుపతి విడిచిన, సత్రహయముఁ బట్టుఁ దుర్వి సాహసు లున్నన్. 114
క. అని చదివి లవుఁడు రాఘవ, మనుజేశుని తల్లి వీరమాతట సీతా
జనని కుశలవుల నిరువురఁ, గనియు నకట గొడ్డు వోయెఁ గడపట ననుచున్. 115
చ. కవకవ నవ్వి యజ్ఞతురగంబు మెడం దనయుత్తరీయమున్
లవుఁడు దవిల్చి మొక్కలమునం గదళీతరువందుఁ గట్టి వే
య వటుకుమారు లేటికి నిరర్థకవైరము దీని వెంబడిన్
జవగతి వచ్చు సైన్యరభసం బది చూడుము నీవు నావుడున్. 116
క. మునిసుతులు మీరు సీతా, తనయుఁడ నే నెఱుఁగ రాజధర్మము తలఁగం
దనిఁ బగఱ గెలుతు నొండెను, మొనతలఁ గైవల్యసౌఖ్యముఁ గనుదు నొండెన్.

## లవుం డధ్వరఘోటకంబు బంధించుట.

సీ. అనునంతలోన సైన్యములు భీకరభంగి నరుదెంచి కదళికాతరువుతోడఁ
గట్టినక్రతుఘోటకముఁ జూచి యెవ్వఁ డీ తురగంబుఁ గట్టినదుండగీఁడు
నావుడు జానకీనందనుం డను యజ్ఞవాహంబుఁ గట్టినవాఁడ లవుఁడ
వలవదు రిత్త నొవ్వకపొం డనిన నవ్వి సైంధవబంధమోక్షణము సేయఁ
తే. గనలి కరములు శరములఁ దునుఁగ నేయ, నలమి బలములు ముసలచక్రాసితోమ
రములు పరఁగింప నవియుఁ జూర్ణములు చేసె, గొతమీస్నాతచెలిచుపంకములకరణి.
మ. పరసేనన్ లవుఁ డక్షయాశుగములన్ భంజింప శత్రుఘ్నుఁ డ
ల్క రథం బుద్ధతిఁ దోలుకొంచుఁ గదియన్ లక్షించి నిశ్శంకుఁడై
వరమాహేశ్వరమంత్రసంస్మరణగర్వస్ఫూర్తి నేసెన్ వడిన్
శరపంక్తిం బరిపంథిచారుతరవక్షంబున్ గవాక్షంబుగన్. 119
క. తూలి వెడ దెలిసి విస్మితుఁ, డై లవణాంతకుఁడు లవుని నలుక నలికముం
గీలుకొన నేసె నురవడి, నాళీకనికాతమార్గణత్రితయమునన్. 120
క. తననొసల నాటి నమ్ములు, వనజంబులరీతి మణులవడువున మెఱయం
గనలి కుశానుజుఁ డుద్ధతిఁ, బినతండ్రిం గదిసి రోషభీషణుఁ డగుచున్. 121
చ. ప్రకటధనుర్గుణారవవిపాటితదిక్కుహరాంతరాళుఁడై
యొకవిశిఖంబునన్ సిడము నొక్కశరంబున నూతు సాల్గుసా
యకములఁ జక్రరక్షకుల నన్నియకాండములన్ రథంబు ఘో
టకములఁ ద్రుంచి భల్ల మొకటన్ హృదయం బగలించి యార్చినన్. 122

మ. సమరోర్విన్ లవణాసురుం దునిమె నేశస్త్రంబు తద్దివ్యబా
ణము వేఱొండుశిలీముఖాసనమునన్ సంధించి యోవత్స వే
గమ సంగ్రామముఁ బాసిపొ మ్మిది యమోఘం బేను నీమీఁదిప
ఱమునఁ జెప్పితి నన్న నవ్విశిఖమున్ సైతేయుఁ డీక్షించుచున్. 123

క. భ్రాత కుశుఁ డున్న నిది ని, ర్ధూతముగాఁ జేయు నైనఁ దునిమెద నేనున్
మాతల్లి యగుమహీసుత, పాతివ్రత్యంబు ధర నుపాస్యం బైనన్. 124

మ. అని సంధాపరతంత్రుఁడై నిలువ నయ్యస్త్రంబు శత్రుఘ్నుఁ డే
సిన నాతం డెడఁ ద్రుంచినన్ జెడక తచ్ఛేషంబు సీతాతనూ
జునికోదండము రెండుగా నఱకి వక్షోభాగముం దూఱఁ జెం
దినమూర్ఛన్ ధర వ్రాలె నిశ్చలునిరీతిన్ రక్తసిక్తాంగుఁడై. 125

క. భేరీశంఖపటహధ్వ, కారావము లపుడు దిఙ్ముఖాతీతములై
బోరు కలఁగ హత శేషచ, మూరథికసింహనాదములు గర్జిల్లన్. 126

మ. తురగంబు న్విడిపించి శౌర్యనిధి శత్రుఘ్నుండు చెంతం గుశా
వరజుం గాంచి యురోవిదారణగతుద్వ్యస్తాశుగక్లేశదు
స్తరసంతాపముఁ దీర్చి రాఘవునిసాక్షాత్కార మానందనుం
డరయం గేవలమూర్తిగాఁ దనుచు నధ్యాహారముం జేయుచున్. 127

క. ఒడల నసలుకొను నెత్తురు గడిగి, రఘూద్వహునిసమ్ముఖము చేయుదు ని
న్వడుగు నని తనరథముపై, నిడుకొని చనియె న్మఖాశ్వ మేగడు దెసకున్. 128

ఉ. అక్కడ భూమిపుత్త్రి లవుఁ డాఁకొనె రాఁ డని శోకవేగసం
బొక్కఁగఁ బాఱుతెంచి మునిపుత్త్రులు నీసుతుఁ డధ్వరాశ్వమున్
గ్రక్కునఁ బట్టి మార్కొను నరాతిబలంబులఁ ద్రుంచి వారిచేఁ
జిక్కె ధనుర్ధరుం డొకఁడు చేతిశరాసనముష్టిఁ ద్రుంచినన్. 129

క. అని మునితనయులు పల్కిన, ఘనమేఘధ్వనికి నళుకుకన్నియరీతిన్
విని గుండియ పగిలి మహీ, తనయ తనయుఁగూర్చి బహువిధంబుల నడలెన్. 130

తే. కాననంబునఁ గుశుఁ డంతఁ గందమూల, ఫలసమిత్కుశపత్త్రపుష్పములు గోయ
నచటఁ దనవామలోచనం బదర బెదరి, సమరజయచిహ్నములుచూచిసంభ్రమించి.

సీ. గ్రమ్మన మగిడి తస్కరులచే ధనముఁ గోల్పోయిన ట్లున్నభూపుత్త్రిఁ గాంచి
యింతశోకముఁ బొంద నేటికి నంబ నేఁడెదురుగా లవుఁడు రాఁడెందుఁబోయె
నెఱిఁగింపు మనిపల్క నెచ్చోటనుండియో వచ్చునధ్వరసైంధవంబుఁ బట్టి
కదళికాతరువుతోఁ గట్టి మార్కొనువీరయోధులఁ బెక్కండ్ర నుక్కడంప

తే. ధనువుఁ దెగ సేసి యొక్కొ పాతకుఁడు సుతునిఁ
బట్టుకొనిపోయెనఁట చేటు పాటు దెలియ
రాకఁ బొగిలెద నీవు శాత్రవు జయించి
యనుజు మరలించి నాదుఃఖ మార్పు మనిన. 132

క. శోకంబు మాను విమతా, నీకంబులఁ ద్రుంచి తమ్మునిం దెచ్చెదఁ దూ
ణీకార్ముకాసిచర్మగ, దాకవచము లిమ్ము సమ్మదంబున ననినన్. 133

## మూర్ఛితుఁ డైనలవునకు కుశుఁడు దోడ్పడుట.

క. కుశలుఁడవై గెలువు నిరం, కుశవృత్తిని రిపుల ననుచుఁ గుంతగదాచ
ర్మశరాసనకవచాదులు, కుశవీరున కొసఁగి వీడుకొలిపిన నతఁడున్. 134

క. తల్లిపదాబ్జములకుఁ బ్రణ, మిల్లి కదలె విలయకాలమేఘ మొదరి గ
ర్జిల్లె నన దిక్కు లద్రువఁగ, మల్ల చఱచుకొనుచుఁ బటుసమరదోహలియై. 135

మ. తరుశైలంబు లదభ్రభయానగతిచేతం జూర్ణముల్ గా దిగం
తరము లాక్కవిరి చిమ్మచీఁకటుల నీన న్వచ్చునుద్యద్ధను
ర్ధరు నీక్షించి పతాకినుల్ హరికిశోరంబు న్విలోకించుసిం
ధురయూథంబులభంగిఁ బాఱఁ గని శత్రుఘ్నుండు సేనానితోన్. 136

## కుశునియుద్ధము.

ఉ. పైకొని లోకముల్ చెఱపఁ బొల్పడివచ్చుయుగాంతకాలరు
ద్రాకృతి నిక్కుమారుఁ డసహాయత రా నదె చూడు మాహవో
త్సేకము దక్కు శౌర్యములు చెల్లను గట్టెదుమాడ్కి నీవరా
నీకిను లుద్ధతిం బఱచె నేల పదాహతిఁ దూలి ధూళిగన్. 137

క. ఉఱుమక పిడుగులు పడియెడి, వఱళులు వాపోవఁ జొచ్చె వాహిని కదుర్రై
యొఱలందు నాయుధంబులు, విఱికిగిపడం దొడఁగెఁ బుట్టె విపరీతంబుల్. 138

క. అదిగాక కాకఘూకస, ముదయంబులు రథికమస్తముల వ్రాలెడుఁ బో
వఁ దలఁచిన జయపతాకల, తుదల నిమిత్తంబు లేక ధూమము లెగసెన్. 139

క. నీకార్ముకవిద్యకలిమి, నేకీడును నతనిఁ బొరయనీక రణమునం
జీకాకుపఱుపు మని య, క్కాకుత్స్థుఁడు పనుపఁ జుఱుకుగలసేనలతోన్. 140

శా. సేనావాహుఁడు జానకీసుతుని నాజిం దాఁకి నాళీకబా
ణానీకంబుల ముంచినం గుశుఁడుఁ బ్రత్యస్త్రంబులం ద్రుంచి సా
జానేయధ్వజచక్రరక్షకధనుస్సవ్యేష్టపత్రంబుగా
సేనానిం బదహస్తమస్తములు విచ్ఛేదించి మోదించినన్. 141

క. నగుఁ డన్న పాటు గనుఁగొని, దిగిభనిభద్విపము నలుక దీకొలుపుచు బె
ట్టిగు శక్తి వైవఁ గుశుఁ డర, నగుచుఁ దునిమి దాని మూఁడునారాచములన్. 142
సీ. మఱియు నాగ్రహము డింపక విశంకటు కార్ముకంబున జతురంబకములు దొడిగి
దంతావళంబుపాదములు నాల్గును నుర్విఁ దెగ నేయ నది మ్రొగ్గతిలక మున్న
కరి డిగ్గనుఱికి భీకరగదాహస్తుఁడై కడియ నగ్గదతోడ కరముఁ దునుమ
సవ్యదోర్మండలిఁ జక్రంబు సంధింప నది ససాధనముగా నట్ల చేయ
తే. రాహు వర్కునిఁ బట్టు నాగ్రహము దోఁప
మలయు నగుఁ జూచి కుశుఁడు జిహ్మగముఁ దొడిగి
కర్పరమున కురుండంబుఁ గత్తరింపఁ
బాత్రముగఁ బూనె నది గాలభైరవుండు. 143
చ. నగుపని పోరిలో నడఁగినన్ లయకాలునిమాడ్కి సేనవెన్
దగిలి గజాశ్వసద్భటరథంబులఁ జిత్రవధం బొనర్ప న
ల్కగదిరి లక్ష్మణానుజుఁ డిలాసుతపట్టి నిశాతభీషణా
శుగనిహతిం దెరల్చినఁ గుశుం డతిరోషకషాయితాత్ముఁడై. 144
ఉ. అర్వసమన్వితంబుగ శతాంగముఁ జూర్ణము చేసి యానమ
త్పర్వశరాహతిన్ హృదయతాప మొనర్చుచు నాల్గుతూపులన్
గర్వ మెలర్పఁ జేరుర మగల్చినఁ గూలె నతండు దేరిపైఁ
బర్వతసానుభూస్ఖలితభద్రమదద్విరదంబుచాడ్పునన్. 145

## శత్రుఘ్నుండు కుశునిచేఁ బడుట.

శా. శత్రుఘ్నుండు పడన్ హతాశఁ బఱచెన్ సైన్యంబు దైన్యంబునన్
జైత్రోత్సాహము దక్కి తేటి లవుఁ డన్నన్ జేరి తత్ప్రేరణన్
సత్రీయాశ్వముఁ బార్శ్వభూజమున నంటం గట్టి జంఝామరు
న్మైత్రిం బొల్చుహుతాశులీలఁ గుశుఁ డుత్సాహించె సోదర్యుతోన్. 146
సీ. హతశేషు లపు డయోధ్యాపురంబున కేగి హయమేధదీక్షితు యజ్ఞవేది
కాసీను మౌనివర్యపరీతు ననుజన్మసేవ్యమానుఁ గురంగశృంగహస్తు
సారంగచర్మవాసను దండమేఖలాధరు శాతకుంభసీతాసమేతుఁ
దిలసమిదాజ్యవర్తితహోమధూమావిలారక్తలలితకర్ణాంత నేత్రు
తే. రామభద్రునిఁ గని సప్రణాము లగుచు, దేవ నీయధ్వరాశ్వ ముద్వృత్తి సకల
దిక్కులను ద్రొక్కి యడవిలో నొక్కవటువు, పట్టిబంధించెఁ గదళికాపాదపమున.
క. అట్టివడుగుపోలిక మీ, యట్టిద శిశు వయ్యుఁ గ్రతుహయానుగసేనం
గొట్టి తుది నీయనుజుచే, బట్టువడియె విల్లు విఱిగి బడలినకతనన్. 148

క. శాతాసిచాపధరుఁ డపు, డాతని శోకయాప్తబంధుఁ డరుదెంచి బల
వ్రాతములపై కుటికి తన, చేతులకసిఁ దీర్చి కూలిచెను శత్రుఘ్నున్. 149
క. అను వారిభాషణంబులు, విని రఘువరుఁ డనియె మీకు వెఱ్ఱితనము ప
ట్టెనొ భూతము సోఁకెనొ నా, యనుజుం డట్లేల చిక్కు నహితులచేతన్. 150
క. నావుఁడు దేవా నీపద, సేవకులకు నెందుఁ గీడు చెందునె నిక్కం
బీవిన్నప మన రామ, క్ష్మావల్లభుఁ డాత్మలోనఁ గళవళపడుచున్. 151
తే. ఎన్నఁడును నాకు నుత్తరం బియ్యఁ డెదుర, లవణు నెక్కటిదునిమె నాలమునఁ గినిసి
యట్టినాతమ్ముఁ డాజిలో నర్భకునకుఁ, జిక్కెనఁట దైవ మిట్లెంతచేసె ననుచు. 152

రాముఁడు సౌమిత్రిని యుద్ధమున కనుపుట.

ఉ. లక్ష్మణుఁ జూచి భాస్కరకులప్రవరుం డనియె సుహృన్మరుహృ్మః
పక్ష్మగబాష్పరోధికరపల్లవుఁడై యిపు డధ్వరక్రియా
లక్ష్మము దాల్చినాఁడఁ దెరలంజన దీపు హతానుజన్మజ
న్యక్ష్మనిరుద్ధవాహయమశార్భకజేతవు గమ్ము పొమ్మనన్. 153
సీ. నగరాజములకు నానగరాజసముఁ జూపు కటుతరాష్టమదాంధగంధకరులు
పవమానగతి నేరు పవమానపడ దాఁటు ధాటీనిరాఘాటఘోటకములు
శరదభ్రవిభవమాశరదభ్రమును జేయు రథికసారథిమనోరథరథములు
హరికిశోరములగోహరికిశోషిలనిదుర్వారగర్వాటోపవీరభటులుఁ
తే. గ్రందుకొని సేన నానాముఖముల నడువఁ, బ్రళయభైరవహుంకారభయదపటహ
నాదములతోడ సమరసన్నాహియగుచుఁ, గదలె సౌమిత్రి రఘుకులాగ్రణికి మ్రొక్కి.
క. ఆక్రందదూర్మిమాలా, తిక్రాంతావధిపయోనిధిప్రతినిధియై
విక్రమరేఖార్భటి భూ, చక్రము గ్రక్కదలఁ గదలు సైన్యముతోడన్. 155
తే. వచ్చి సౌమిత్రి వాల్మీకివనముఁ జొచ్చి, స్రస్తకచభారమేచకాస్తరణపటము
హాహవక్షోణి వీరశయ్యాగ్రసుప్తు, ధూళిధూసరగాత్రు శత్రుఘ్నుఁ జూచె. 156
ఉ. అప్పుడు వచ్చు సేనఁ గుశుఁ డారసి నిర్భయతన్ సహోదరుం
దప్పక చూచి పైకొనెఁ బతాకిను లెయ్యది కార్య మిత్తఱిన్
జెప్పుము నా లవుం డిచటఁ జెప్పెడి దేమి విరోధిసేవలం
చిప్పిరి చేసెదన్ సెలవుఁ బెట్టుము నీవుఁ గడంగు మాజికిన్. 157
క. అని లవణాంకుశుచే ము, న్ననిఁ దనకార్ముకము భగ్నమయిన కతన భ
క్తినియమపురస్సరంబుగ, నినుగుఱిచి లలాటతటసమేతాంజలియై. 158
తే. సవితమూర్తిత్రయాత్మక సప్తతురగ, చండపూషనతామరజలజమిత్త్ర
హంసఋగ్వేదరూపమేపాద్యధీశ, ఖప్రకాశ హిరణ్మయ కర్మసాక్షి. 159

లయగ్రాహి—

భాస్కర భవామయతిరస్కర నమజ్జనయశస్కర సహస్రకరమస్కర ధరశ్రే
యస్కర నభోమణియహస్కర చరచ్చరదుపస్కర సదారుణపురస్కర సదేకా
పస్కర తమఃపటలతస్కర కిరీటగశిరస్కర గృహీతసునమస్కర సహారో
జస్కర జనీపసవయస్కర విసర్వజగదాస్కర భజే యని నమస్కరణుఁడైనన్.

శా. శూరాగ్రేసరుఁ డైనయాలవునకున్ సూర్యుండు ప్రత్యక్షమై
హైరణ్యద్రవలిప్తలస్తకము రత్నాలంకృతంబుగా సమి
ద్వీరాగాతివిదారణక్రమకళావిశ్రాణనాహంకృతి
స్ఫారజ్యారవభైరవంబు నగుచాపం బిచ్చి విచ్చేసినన్. 161

క. గురుఁ డగువాల్మీకిమునీశ్వరుఁ డొసఁగినసౌరమంత్రజపమువలన భా
స్కరుఁ డిచ్చినవిలు గైకొని, యరిగి కుశున కాధనుర్మహత్త్వముఁ జెప్పెన్. 162

మ. ధరణీజాతతనూజు లత్తఱి సుమిత్రాపుత్త్రునిం దాఁకినన్
గరటిస్యందనఘోటవీరభటయుక్తం బైన సైన్యంబు మం
దరమై నాకమహీధరభ్రమణఘూర్ణం బైనపాథోధికిన్
దరమై క్రేళ్ళుడి యోజనార్ధ బల మంతం బొందె నక్కాల్తలన్. 163

తే. ఆనెగులు చూచి కదిసె సేనాని యైన, కాలజిత్తుండు తాను లక్ష్మణుఁడుఁ గుశుని
నొక్క మొగిఁ జుట్టుకొని నెలవుఁ బెక్కువేలు, భ్రములుపరిఘాదిసాధనభ్రములు మెఱయ.

క. కరులు పదిపదులు కరి కల, కరదములు సహస్ర మరద మరదంబునకున్
హరిశతము హరికి హరికిం, బరివారము నూటిసంఖ్య భ్రమి యనఁబరఁగున్. 165

క. ముంచి బలము లి ట్లువరో, ధించిన లవుఁ డంత కాకృతిం గవలుచు గ
ర్జించి పటు ప్రహరణహతి, గ్రుంచె ముహూర్తమున దశచతుష్క భ్రములన్.

మ. కరవాలద్రుఘణేళికానఖరచక్రప్రాసబాణాసన
చ్ఛురికాపట్టిసకుంతతోమరగదాశూలంబులం బోరి పో
రి రణోర్విం గుశుఁ గాన కాలవుఁడు వర్మీభూతనానాస్త్రజ
ర్జరితాసృక్స్రగాత్రుఁడై నిలిచెఁ బార్శ్వంబు ల్విలోకించుచున్. 167

చ. అతనిపరాకు చూచి రుధిరాక్షనిశాటుఁడు తొల్లి రాఘవ
క్షితిపతి లెంకయై శరణు చెందినవాఁడు భయంకరాహవా
యతబలశౌర్యశాలి లవణాసురమాతులుఁ డేమతించి తీ
వ్రతఁ గొనిపోయె నాలవకరస్థశరాసన మభ్రవీధికిన్. 168

చ. అపహృతచాపుఁ డై లవుఁ డహంకృతిఁ జక్రముఁ గేలఁ బూని చ
క్రిపటిమఁ జూపి దేశికవరేణ్యకృపార్జితమాతరిశ్వమం

త్రపతనశక్తిఁ జుప్పరము దాఁటి విహంగముఁ బట్టుజాలెడే
గపగిది దైత్యునిం దఱుమఁగా మది బెగ్గల మంది సైనికుల్. 169

సీ. గజశరీరములమార్గణరంధ్రముల వెంటఁ జొరఁ బాఱి దివిఁ దొంగిచూచువారు
భగ్నశతాంగకూబరచక్రములక్రింద నొదిఁగి చప్పుడు సేయ కుండువారు
హయకబంధములఁ బాయఁగఁ ద్రోచి మొదరైనయెడఁ బక్కెరలలోన నీఁగువారు
భటవిగ్రహములకుప్పలక్రేవఁ దలలపై హరిగలు మాటుగా నడఁగువారు

తే. నై రణస్థలి నీతఁ డెవ్వారిమీఁది, కొఱఁగునో యని మది వెఱచఱచి ప్రాణ
రక్షణోపాయపరత నస్త్రములు విడిచి, కళవళించిరి శౌర్యంబు గట్టిపెట్టి. 170

తే. అంత దశరథమంత్రిసుమంతసుతులు, సాహసులు పదుగురు సింహచంద్ర కాల
ధార్మిక నుదన శత్రుసూదన జితశ్రీ, మాయల శరన్నద సుకేతు లాగ్రహించి. 171

క. ఉదితజ్యాఘోషంబులు, చద లందుకొనంగ నార్చి సమసమయమునన్
బదిపదిశరముల నేసిరి, చిద్రుపలుగా లవునిచేతిశితచక్రంబున్. 172

క. ఆచక్రము హతమైన ని, లాచక్రముమీఁది కుఱికి లవుఁడు లవుడిం బా
హాచటులవిభ్రమభ్రమ, రీచండిమరేఖ సంతరించుచు విసరన్. 173

క. అశనిసదృక్పరిఘాతన, విశసనములఁ గూలి రొక్క క్రేమ్ముడిలోనన్
దశరథమంత్రితనూజులు, దశరథు లత్యంతశౌర్యదశరథు లాజిన్. 174

ఉ. అంత మదోద్ధతుండు రుధిరాక్షుఁడు క్రమ్మఱఁ బాఱుతెంచి దు
ర్దాంతగదాహతిన్ లవుశిరంబుఁ బగిల్చినఁ గ్రమ్మ నెత్తుటన్
గొంతవిసంజ్ఞుఁడై తెలిసి కుంతముఁ ద్రిప్పుచు నార్చి దానవుం
గొంతుకఁ ద్రుంచి కైకొనియెఁ గొంకక తమ్ముషితార్క్ష్యచాపమున్. 175

క. దైతేయు నిట్లు గెడపిన, సైతేయునిఁ జుట్టుముట్టి సైన్యము గవిసెన్
మాతృజఠరభరసద్యో, జాతార్భకుఁ బాముపుమోహజాలము లీలన్. 176

చ. అడఁగినచంద్రనిష్ఠ నిశటార్జునముం దగటార్చి పేర్చి కా
ఆడవి దహించుమాడ్కి లవుఁ డంటినసేనలఁ బెక్కుభంగులన్
బొడ వడఁగించి మండి బలుమూఁకల వెంపడలాడుచుండె న
ప్పు డెదిరె లక్ష్మణుం గుశుఁ డపూర్వమృగేంద్రపరాక్రమోన్నతిన్. 177

ఉ. శూరత నిల్చెదిర్చి వసుశం గని లక్ష్మణుఁ డైదుతూపులన్
భేరురముం బగిల్చిన సమీరశరం బరఁబోయుచుఁ సమి
ద్ధీరుఁడ వైన నిల్వు మని తెల్పుచు నేయ ముహూర్తమాత్రమ
త్తేర కులాలచక్రముగఁ దిరిగెన్ గడువిస్మయంబుగన్. 178

క. అరదము విరవిరఁ దిరిగెడు, భరమున రథ్యములు వాల్గఁ బంచత్వము నొం
ద రణకుతూహలమున నొం, డురథ మ్మపు డెక్కె లక్ష్మణుఁడు కట్టలుకన్. 179

క. క్రమమునఁ గిరీటమును గవ, చము నైదస్త్రములఁ దునుమ సంహృతనిర్మో
కమహాహిలీల విగత, క్షముఁడై కుశుఁ డనియె నగుచుఁ గాకుత్స్థునితోన్. 180

తే. మోపుచేటుగ నున్నయీమకుటకవచ, భార ముడిపినపరమోపకారి వగుట
నేఁ బ్రత్యుపకారినై యిపుడ తీర్తు, బాణపంక్తుల నీసైన్యభార మనుచు. 181

శా. ఆగ్నేయాస్త్ర మధర్వమంత్రమున నేయం దన్మహార్చిశ్ఛటా
భగ్నంబై చెఱి దూలు సైన్యముఁ బరిభ్రష్టాశ్వముం జేతనా
ముగ్నాగప్రకరంబుఁ జూర్ణితరథంబున్ దగ్ధపాదాతమున్
ద్రాగ్నిర్మూలితచామరాభరణతూర్యచ్ఛత్రశస్త్రంబుఁగన్. 182

చ. ఆరణమున నిటు శిఖిశర, దారుణశిఖ లాక్రమింప దాశరథి కన
ద్వారుణమార్గణమున నప, వారణ మొనరింపఁ గుశుఁడు వారనికినుకన్. 183

శా. వాయవ్యాస్త్రము వింటఁ గూర్చి విమతవ్యాపాదవై దగ్ధమై
క నేయం దచ్చటులాశుగప్రభవబంహిష్ఠభ్రమీధూతవా
త్యాయంత్రోత్థితసైన్య మాకసము డాయంబోయె నాయోధన
శ్రీయోషిన్మణిమండపంబునకు మాంజిష్ఠంపుమేల్కట్టనన్. 184

క. సేనదురవస్థ గని యా, సేనాధీశ్వరుఁడు కాలజిత్తు కుశు నురం
బానతపర్వశరాహతి, చే నంటఁగ నేసి పలికె సెలవుల నగుచున్. 185

క. నాలా వెఱుఁగవు బాలుఁడ, వాలము నీ కేల తొలఁగు మనఁ గుశుఁ డలుకన్
వాలిశితూపునఁ బ్రేలెడు, నాలికఁ ద్రెం చుగ్రశరమునం గలఁ ద్రుంచెన్. 186

ఆ. కాలజిత్తు కలన వ్రాలిన సౌమిత్రి, కనలి బహువిధాశుగములఁ జక్ర
శూలముసలభిండివాలఖడ్గాదిప్ర, హరణముల నిగుడ్చ వరుసఁ దునిమి. 187

## సమరంబున లక్ష్మణుఁడు నిహతుం డగుట.

చ. హితమతి వామలూరుభవుఁ డిచ్చిననిశ్వసదుగ్రపన్నగ
ప్రతిభటతేజితప్రదరపంచక మార్చుచు నేయ నుద్గతా
ప్రతిహతకీల లాకసముఁ బ్రాఁక నురస్స్థలి గాఁడినన్ రణ
క్షితిఁబడె లక్ష్మణుం డనవశిష్టయుగస్తమితార్కుఁడో యనన్. 188

చ. దురమున లక్ష్మణుండు నిహతుం డగుడున్ గుశుఁ డచ్చలంబునన్
హరిగయు వాలుఁ గైకొని కులాద్రుల నింద్రుఁడు వజ్రధారచేఁ

బోరిగొనుమాడ్కి నగ్రమునఁ బోరెడుతమ్ముని గ్రమ్ముకొన్నసిం
ధురములఁ గూల్చ నిద్దఱు నెదుర్పడి ద్రుంచిరి సైన్య మంతయున్. 189
క. పట్టినచలమున నీగతి, మట్టుముగా సేనఁ బిలుకుమార్చి కదలిరా
నెట్టిః సీలలు మదిలోఁ, బుట్టినహర్షమునఁ దమతపోవనమునకున్. 190
సీ. కాకుత్స్థుఁ డపుడు గంగాపుణ్యవాహినీతీరయజ్ఞ వితర్ది దీక్ష పూని
యతులతో నర్హాసనాసీనుఁడై భరతునిదిక్కుఁ జూచి శత్రుఘ్ను నాజిఁ
గూల్చిసహాయచోరకులఁ ద్రుంచి శా కేల తడ సెనొకో సుమిత్రాసుతుండు
కల సైన నెదిరింపఁ దలఁకు చుల్లోకంబు విరసించి యేశూరుఁ డొరయు నతని
తే. జీవితేచ్ఛల శరణుఁ జొచ్చిరో కొమాళ్ళు, లేక చలమునఁ బోరి త్రెళ్ళిరో ధరిత్రిఁ
గాక వారలతల్లి శోకమున మిగులఁ, బొగలుచును వేఁడుకొనియెనో పుత్రభిక్ష.191
ఉ. జన్న ముపక్రమింప దివసత్రయమాత్రమ ధూర్తబాలకుల్
సన్ను విభీషణాదులఁ దలంపక లక్ష్మణుబాహువీర్యమున్
సన్నముగా గణించి రవిచారతఁ దమ్ముఁడ వేగ బుద్ధిసం
పన్నులఁ బంపు మచ్చటిక్రమం బఖిలంబు నెఱింగి రాఁదగున్. 192
క. నావుడు భరతుం డేవుర, లావువెరవుగలుగుదూతలను వెస రామ
క్ష్మావరుసమ్ముఖమునకున్ రావించిన వారి కాధరావరుఁ డనియెన్. 193
మ. కొమరుల్ మిక్కిలి సాపరాధు లయినన్ క్రోధాతిరేకంబునన్
సమరక్షోణి వధింపఁజూడక దయన్ సమ్మోహనాస్త్రప్రయో
గమునన్ వారలఁ బట్టితెం డిటకు నా కారంబు లస్మత్స్వరూ
పము లంచున్ బలుమాఱు వేగరులు చెప్ప న్వింటి నిక్కంబుగన్. 194
ఆ. అదియుఁగాక సీతయాస్యలక్షణము ల, క్కవలవెంగములందుఁ గలవొ తెలిసి
యుడవి నేల తిరుగ నంబపే రెద్ది సౌ, మిత్రి నడుగుఁ డనెడుమాత్రలోన. 195

## శ్రీరాముఁడు లక్ష్మణుంగూర్చి పలవరించుట.

ఉ. క్రమ్మెడుశోణితంబు గరగట్టఁగ గంటులవెంట బెట్టుగా
జిమ్మనఁ బాఱుతెంచి హతశేషులు దీక్షితుఁ డైనరాముపా
దమ్ముల వ్రాలి యోరఘువతంస సుమిత్రసుతుండు నాజిమ
ధ్యమ్మునఁ గూలెఁ దత్కుశలరాభిహతిన్ లవణారి కైవడిన్. 196
ఉ. వీలక కాలజిత్ప్రముఖవీరులు మున్న కుశాంకుగాహతిన్
గూలిరి రక్తధారలు బుగులొత్తన లక్ష్మణుప్రోల ధాతుకన్

తీక్కలము నాల్గువంకల నతిత్వరమాణసమీరవర్తనో
న్మీలితసంప్రఫుల్లసుమనోభరకింశుకవాటికైవడిన్. 197

క. ఇచ్చటికిఁ గుశుఁ డవశ్యము, వచ్చు నతఁడు రాకమున్న వలయు నెదురుగా
విచ్చేయ నేటియోగము, చిచ్చెగసినవెనుక వశమె చేటనుగ్రమ్మన్. 198

క. అను రోదవరులమాటలు, విని రఘువీరుండు వీఁపు విఱిగిపడియెఁ గ్ర
మ్మినమూర్ఛ భరతు నంతిక,మునఁ బరశుచ్ఛిన్నసాలభూజముఁబోలెన్. 199

ఉ. అప్పుడు విన్ననై భరతుఁ డన్నఁ గనుంగొని మేని కుమ్మగాఁ
గప్పి హిమాంబుపూరములు కన్నులఁ బల్మఱు నొత్తి వీరులం
గప్పర మూఁదఁగా నెఱయఁ గప్పినమూర్ఛ యొకింత దేఱినన్
దెప్పిఱి లేచి వా విడిచి నిల్వక బెట్టెలుఁ గత్తి యేడ్చుచున్. 200

మ. అనురక్తిం బదునాలుగేం డ్లడవులం దాహారనిద్రల్ దొఱం
గి నసుం గాచితి పెక్కుభంగుల సురల్ గీర్తింప నయ్యింద్రజి
త్తు ననిం ద్రుంచితి నిన్ను మాణవకమాత్రుం డెట్లు నిర్జించెరా
యనుఁ దండ్రీ యను నీవులేనిమఖదీక్షాపేక్ష యిం కేలనున్. 201

క. తమ్ములు పడియున్నసమీ, కమ్మున కేఁ జనెదఁ గార్ముకము నస్త్రములున్
దమ్ముఁడ తోడ చేయక నా, కిమ్మనఁ గేల్మొగిచి భరతు డిట్లని పలికెన్. 202

సీ. సంగ్రామభీరులై చారులు పఱతెంచి విన్నవించిరి గాని వినఁ బొసంగ
దది మూర్ఛ గాఁబోలు నమ్మహాభుజులకు మరణ మెక్కడిది రామక్షితీశ
లక్ష్మణశత్రుఘ్నులకు సహాయుండనై చని తేర తురగతస్కరులఁ బట్టి
బంధించి నీప్రతాపము చూపి యజ్ఞవాహమ్ముఁ దెచ్చెద నన్ను నంపు మనిన
తే. నధిపుఁ డిట్లను నీకుఁ దో డర్కనుతవి,భీషణులు తక్కఁ దక్కిన పేరుగలుగు
వృక్షచరయామినీచరవీరయోధ,వరులు దోడ్కొని చను మాహవమున కనిన. 203

## భరతాదులు యుద్ధంబునకు వెడలుట.

తే. భరతుఁడు రఘూద్వహునకు సద్భక్తి మ్రొక్కి, సాసితూణీరచాపుఁడై యరద మెక్కి
వెడలి సేనలతో జాహ్నవీవిశాల, తటమునను నిల్చి పవమానతనయుఁ బిలిచి. 204

క. ముందఱఁ జని సౌమిత్రుల, చంద మరసి ర మ్మనిన వెసం బాఱి మరు
న్నందనుఁడు వారిఁ గని తన, సందిటఁ గొని వచ్చి భరతుసన్నిధిఁ బెట్టెన్. 205

తే. పెట్టి సౌమిత్రి కుశబాణఘట్టనముల, నెంత కడునొచ్చెఁ జూచితే యితఁడు నాఁడు
నింద్రజిత్సాయకములచే నింత నొవ్వఁ, డనుచు భరతేశునకుఁ జూప నతఁడు పొగిలి

క. శూరాగ్రగణ్యు లగుని, వీరుల శరనిహతిఁ బరిభవించినవారిం
దారకు లనరా దే బృం,దారకులో కాని యని రథముపై నిగుడన్. 207

శా. ఆఘోషించుతదుగ్రశంఖపటహోద్యద్ధ్వానముల్ దిక్తటి
వ్యాఘూర్ణంబులుగా నహంకృతిఁ గుశుం డాలించి కోదండమౌ
ర్వీఘంటారవముల్ చెలంగ రభసోద్రేకంబునన్ వచ్చుచో
నాఘోరాజి దురీక్ష మన్నటు లినుం డస్త్రాద్రికిన్ వే చనెన్. 208

క. ప్రాంతవననీడములను శ, కుంతములు శయించె నిరవుకొనె మృగములు వే
శంతతటకుంజముల భా, స్వంతుఁడు చరమాద్రిఁ గ్రుంకుసమయమునందున్. 209

ఉ. క్రమ్మెడుచిమ్మచీఁకటులు కార్కొన మార్కొనుచోఁ బరస్పరా
స్యమ్ములు గానరాక విరసమ్ముగఁ గైకొనునట్టిసాంపరా
యమ్మునఁ జెంగలించి లవుఁ డన్నకుఁ దోడయి దీప్తబాణజా
లమ్ముల నంధకారపటల మ్మఖిలమ్ము ఖిలమ్ము చేయుచున్. 210

క. నెఱిగొడ్డటఁ గాష్ఠంబులు, నఱకినగతి లవుఁడు వారణవిషాణములం
గఱకు టసి ద్రెవ్వఁ గ్రొమ్మిడుఁ, గుఱులెగసి బలంబుఁ జుట్టుకొని దహియించెన్.

మ. కుశుఁడుం గార్ముకటంకృతుల్ మొరయ నక్షుద్రక్షుధాహవ్యభు
క్పిశునభ్రూకుటినర్తనుం డగుచు నాభీలప్రచండార్కక
ర్కశబాణంబుల సేనలం బిలుకుమార్పన్ సైనికు ల్వొందుదు
ర్దశ వారింప నశక్తుఁడై భరతుఁ డాత్మం బెద్ద చింతింపఁగన్. 212

క. మారుతి యను వీరలయా, కారంబులు రామునట్లు కాదేని హరి
ద్వారణకమఠాహికుభృ,ద్భారము గాఁ దునుము టె ట్లపారబలంబున్. 213

తే. అనఁగ లవుఁ జూచి కుశుఁ డను ననఘ వీర, సంభ్రమించెదుగతి యుద్ధసరణిగాదు
హాయము నేమఱకుండు సైన్యముల నేన, ఖేచరులు మెచ్చ నుక్కడఁగింతు ననుచు.

క. భరతునిఁ గనుఁగొని నిజసో,దరులు పడినచోటి కిపుడు దైవము నిన్నన్
జెరరేఁచి తెచ్చె నిపు డెం, దరిగెదు కుశ నెదుర ననుచు నాటోపమునన్. 215

సీ. కైకేయిసుతు నేడుకాండంబుల నొగిల్చి యన్నింట నె సుషేణు నవశుఁ జేసి
వాలిపుత్త్రుని వేయికోలల నొప్పించి నూట సమీరసూనునిఁ దెరల్చి
నీలుని నేనూఱువాలుఁదూపుల గ్రుచ్చి యిన్నూట గవయుని నేపు మాపి
పనసుని మేనఁ దొంబదిబాణములు నించి కుముదుని మున్నూటఁ గుంటుపఱిచి
తే. జాంబవంతునిఁ ద్రిసహస్రసాయకముల, బీర మెడలించి యనిఁ బ్రతాపించి నిలువ
నచ్చెరువు నొంది కురియించి రపుడు సురలు, కుశునిమీఁదను మందారకుసుమవృష్టి.

క. ఘోరతర మైనసమరపుఁ గేళి, వీరునిసమరంబుఁ జూచువేడుక వచ్చెన్
నారి యాఁ బొడఁపగుబ్బలిపై రవి పొడచూపుటయుఁ బ్రభాతం బైనన్. 217

మ. కోట్లక్రేంకశ మైనసైన్య మెదిరింపన్ రాముతమ్మున్ లవుం
డిటుమూఁడుమ్ములఁ జాపముం దునుమ భగ్నీవ్యసనుం డైనభా
స్కరకంపుం గుశుఁ డుగ్రమార్గణములం గారింపఁగాఁ దేరిపై
పొంకం బాఱెడువానిఁ గన్గొని మరుత్సూనుండు కట్టల్కతోన్. 218

క. వెకలించి యొక్కగిరి దా, నకులపయి వ్రైవ నంతరమునన దానిన్
శకలములుగఁ జేసి జలప్రకరంబుల నెల్లఁ గుశుఁడు పరిమార్చుటయున్. 219

## భరతుఁడు బడుట దెలిసి శ్రీరాముఁడు యుద్ధభూమికి వెడలుట.

క. హతశేషులు చని రామ, క్షితిపతి కవ్విధము దెలియఁ జెప్ప వగచి యు
ద్ధతి వెడలె విభీషణసూ, ర్యతనూజులతోడ సమ్మహారథుఁ డనికిన్. 220

క. చతురంగవాహినీపరివృతుఁ డై యరుదెంచి కనియె వీతభయుల న
ద్భుతచాపధరుల నాత్మప్రతిబింబము లై వెలుంగుబాలురఁ బ్రీతిన్. 221

ఉ. వారలఁ జూచి పల్కె రఘువర్యుఁడు మీ కిట జాతకర్మసం
స్కారము లెవ్వ రుక్తవిధిఁ జల్పిరొ గిన్ ధనురాదిశాస్త్రవి
ద్యారతు లైతి రెవ్వరికతంబున నేగతి యుద్ధచాతురి
న్నెరుచుకొంటి రెవ్వ రవనిం దలిదండ్రుల పేరు నావుడున్. 222

తే. పోరి కెదిరించి మాపుట్టుపూర్వములను, దెలియఁ బని యేమి మాకు నీ తేటలకును
హాయము విడుతువె యైన మీయంతవార, లడుగఁ జెప్పము తగవుగా దనికుశుండు.

మ. సరవిం జేకొని జాతకర్మముఖసంస్కారంబులున్ వేదశా
స్త్రరహస్యంబులుఁ గార్ముకాదివివిధాస్త్రప్రౌఢియుం బాపని
ర్హరణంబై నుతి కెక్కు రామకథయున్ రాజేంద్ర వాల్మీకి స
త్కరుణన్ మా కెఱిఁగించెఁ గాంచె మము సీతాదేవి యిక్కాననలోన్. 224

క. అనునప్పుడు జానకిఁ బే, ర్కొనుటయు రాఘవుఁడు మూర్ఛఁ గుంది రథము మీఁ
దనొఱగి యొక్క ముహూర్తంబునకుఁ దెలిసి పలికెఁ దరణిపుత్త్రునితోడన్.

మ. తెలియం జూడుము వీర లెవ్వరన నాదిత్యోద్భవుం డిమ్మహా
త్ములు భావింపఁ బురాణపూరుషునిమూర్తుల్ పోలికన్ మీకుమా
రులు సందేహము లేదు సంగరసమర్థుల్ నాఁగ సీతాతనూ
జులకై యత్తఱి నీలుఁ డొక్క విపులక్షోణీధ్రమున్ వైచినన్. 226

ఉ. తూలక వార లన్నగము తూపులఁ జూర్ణము చేసి యొక్క బ
ల్లోల నురంబు నొంపఁ గుటిలుం డగునీలుఁడు గూలెఁ గూలుడు

న్నిలునిరక్తబిందువులు వీలునిరూపులు దాల్పఁగాఁ గుశుం
డాలములోన నందఱను నన్నిశరంబుల రూపు మాపుమన్. 227

మ. నరపై తేయకపీంద్రసైన్యముల నానాశస్త్రజాలంబులన్
బరిమార్పన్ రఘురాముఁ డగ్రనిహతభ్రాతృవ్యథాక్రోధని
ర్భరుఁడై యక్కుశుమీఁద హాలహలకల్పక్రూరనారాచముల్
పరఁగింపన్ విఫలంబులై యతని నొంపన్ లేక ఖేదించినన్. 228

తే. అలిగి మఱియును నేయ దివ్యాశుగములు,కవలు నాలుగు నాల్గుదిక్కులుగఁ జేయఁ
దనతనూజులసమబలత్వంబుఁ దెలిసి, రాముఁ డవ్వేళ యుద్ధవిరక్తుఁ డగుచు. 229

శ్రీరాముఁడు మూర్ఛితుఁ డగుట.

చ. అదయత నేయునక్కుశునదగ్రశరాహతిఁ బ్రాణమర్మముల్
వదలి శతాంగయష్టి నొఱవం బడఁ గన్గొని మైథిలేయు లే
కొదయును లేక కన్గొని రఘుప్రవరుం బొరలించి కుండలాం
కదమణిహారవల్లికలు గైకొని యుల్లము పల్లవింపఁగన్. 230

క. పడినభరతాధియోధుల, తొడవులుఁ గొని లవుఁడు ముదముతోఁ గని నొకచోఁ
గడునొచ్చి గుక్కమిక్కన, కడఁగినభల్లూకనాథు ననిలతనూజున్. 231

క. కని కుశునితోడ దశరథ,తనయులయీదివ్యమణిరథము లెక్కి ముదం
బున మనయాశ్రమమున కివ్వనచరులం గొంచుఁ బోవవలయునఁగన్. 232

తే. అనిలజుఁడు జాంబవంతుఁ గన్గొనుచు నల్ల, పలికెఁ గంటివె రాఘవాదులయవస్థ
మన మనఁగ నెంత వనజగర్భునకు నైన, ననుభవింపక చనవు శుభాశుభములు. 233

చ. కిఱుకులఁ బెట్టి వీరి నడకించి తొలంగుద మన్న వట్టిక
క్కుఱితియ కాని దైవమనుకూలము గాదు లవుండు మొక్కలీఁ
డుఱికినఁ బ్రాణహానియును నొప్పమి వచ్చు నటంచుఁ బ్రాణముల్
దొఱఁగినభావ ముల్లమునఁ దూకొని చేష్టలు దక్కి యుండఁగన్. 234

ఉ. చిందముల న్నభంబుగరిసించుశతాంగము లెక్కి జానకీ
నందను లేగి యాశ్రమమునన్ రథముల్ దిగి పర్ణశాలికా
లిందము చేరి తెచ్చినవలీముఖపుంగవజాంబవంతులన్
ముందటఁ బెట్టి తల్లికిని మ్రొక్కి సమస్తము విన్నవించినన్. 235

సీ. విని యమ్మహీకాంత విస్మయాక్రాంతయై కదనరంగమున రాఘవుని మీఱ
గెలుచుట జింకపిల్లలు సింహము జయించు తెఱఁగు దైవిక మెట్లు తెలియవచ్చు
వనమున నజ్ఞాతవాసనై పడియుండు పాటు మీఁచే బయల్ పడియె ననుచు
లవుఁ జూచి వరుణసంభవుఁ డిచ్చటికిరాక మునుప యీజాంబవంతుని సమీర

యోజనబాహు నత్యుగ్రత వధియించి యనిమిషాధీశునందను హరించి
లవణపయోరాశి నవలీల బంధించి దశకంఠు నాహవస్థలి నడంచి
తే. నట్టిభవదీయచటులబాహాప్రతీప, విక్రమాటోపమున కంగవించి నిలువఁ
బద్మగర్భాదులకు నీఁతరంటి యనినఁ, జెక్కుమీటిన వసవల్చి శిశువు లెదుర. 245

క. పాతాళమునకు వరుణా, హూతుఁడనై యేను బోవ నుద్వృత్తి నప
ఖ్యాతి యిటు సంభవించెను, నీతనయులు నిన్నెఱుంగ నేరనికతనన్. 246

తే. అనినఁ బరితోషమానసుఁ డగుచు రాముఁ, డనఘ మీదర్శనం బైనయపుడె మాకు
నన్నిపనులును సఫలంబు లయ్యె వారిఁ, జూడవలెఁ బిల్వఁ బంపుఁ డిచ్చోటి కనిన.

తే. సంతసము నొంది మునిశిష్యసమితి నను, నతులకోదండవల్లకీహస్తు లగుచు
జానకీసుతు లరుదెంచి సమయ మెఱిఁగి, కౌతుకంబున గురుసమక్షమున నిలిచి.

క. ఘోరదురితాపహం బగు, శ్రీరామాయణము చదివిరి వివిధ మగునా
నారాగరచనఁ దుంబురు, నారదు లన నఖిలజనమనఃప్రమదముగన్. 249

మ. మనువంశాగ్రణి యక్కుమారవరులన్ మన్నించి ప్రేమన్ బునః
పునరాలింగన మాచరించుచుఁ బరిస్ఫోటించుసీతావియో
గనిమిత్తజ్వరదాహముం దొఱఁగి గాద్గద్యంబునన్ హర్షబా
ష్పనిరోధాలసపక్ష్మనేత్రుఁ డగుచున్ సౌమిత్రితో నిట్లనున్. 250

ఉ. ఆననవిభ్రమంబు రుచిరావయవాదికసౌకుమార్యమున్
జానకియట్ల దృప్తభుజశౌర్యజితశ్రమదివ్యబాణసం
ధానసమగ్రశక్తియును దంటతనంబును మద్విధంబ యీ
సూనులయందుఁ దేరకొనఁ జూచితివే యనఁ బల్కె నన్నతోన్. 251

ఉ. దేవరయానతిన్ వసుమతీసుత నుత్కటగర్భవేదనా
గ్లావభరాలసాంగి నకృపామతి నొంటియుఁ గొంచువచ్చి నా
డీవిపినాటవి న్విడిచి యే మగుడన్ జనుదెంచునప్పు డా
ర్భావివశాత్మ యయ్యె నన సంయమి రామునితోడ నిట్లనున్. 152

చ. అట మఖయూపదారుహరణార్థము శిష్యులు నేము జాహ్నవీ
తటమున కేగుదెంచి యెడదవ్వుల నొంటివిలాప మాత్మసం
కట మొనరింపఁగా వెదకి కంటిమి శోకపరీతయున్ రజః
పటలవివర్ణకీర్ణకచభారయునై నవధూలలామమున్. 253

తే. కాంచి నీ వెవ్వ రేల శోకమునఁ బొందె, దనిన నెఱిఁగించె నాకు నయ్యబల జనక
తనయను రఘూద్వహుండు మద్భర్త నింద్యు, నైతి ననినన్నుఁ ద్రోయించె నడవి ననుచు.

క. విని యూఱడించి యాశ్రమ, మునకుం గొనిపోయి యుటజమున నుంచి తప
స్వినుల నియమించుటయు వా, రనువునఁ బోషింపఁ గతిపయదినంబులకున్. 255
తే. కనియె వైదేహి వంశవర్ధనుల వీరి, నాగమోక్తిన జాతకర్మాదివిధులు
సలిపితిమి పుత్త్రులెడ మేముజనకవిభుఁడు, దశరథుఁడునీవునొక్కచందంబకాన.
చ. చదివిరి వేదముల్ సకలశాస్త్రములున్ బఠియించి రాహవో
న్మదరిపువాహినీవిదళనక్రమధూర్ధరదివ్యబాణసం
పదలఁ బ్రసిద్ధులైరి నరపాలక నీతనయుల్ ప్రసన్నతా
హృదయులు నీదుభాగ్యమున కెయ్యది మేర తలంచి చూడఁగన్. 257
చ. అనవుడు రాఘవుం డనుమహాత్మ భవత్కృత యెవ్వరందుఁ గ
ల్గిన గణుతింప వారు కృతకృత్యులు నిత్యము నీయనుగ్రహం
బున నభివృద్ధిఁ బొందుమముబోంట్లను బేర్కొన నేల నాఁగ న
మ్మునికనుసన్న నర్భకులు మ్రొక్కి కరంబులు మోడ్చి తండ్రితోన్. 258
క. మోహపరవశుల నూహా, పోహపరిజ్ఞానమూఢబుద్ధుల నాత్మ
ద్రోహుల మముఁ బ్రోవుము మై, దేహీనందనుల నన ముదితహృదయుండై. 259

## శ్రీరాములుసోదరపుత్త్రసైన్యసమేతముగా నయోధ్యాపురంబు చేరుట.

క. కమలాప్తకులీనుఁడు దన, కుమారకులఁ గౌఁగిలించుకొని మూర్ధఘ్రా
ణము చేసి యధికవాత్స, ల్యమునను మన్నించి యధ్వరాశ్వముతోడన్. 260
ఉ. దానవమర్త్యవానరపతాకిను లిమ్ములఁ గొల్చిరా నయో
ధ్యానగరంబుఁ జొచ్చి రచితాధ్వరమండపవేది నిష్టభృ
త్యానుజపుత్త్రబాంధవసమన్వితుఁడై కొలువుండి యాత్మవి
ద్యానయశీలు నమ్మునివతంసముఁ గన్గొని రాముఁ డిట్లనున్. 261
తే. వరుణసంభవ నీపుత్త్రి పరమసాధ్వి, లంకలో నాఁడు లోకపాలకు లెఱుంగ
హవ్యవాహనముఖమునం దైనవిధము, ప్రజలెఱుంగరు మిగులదూరంబుగాన. 262
క. ఇందలిజనముల కెల్లను, సందేహనివృత్తి యొదవుచందముఁ జేయిం
పందగు మీరు ధరిత్రీ, నందన, గొనిరండు పొం డనక్ హితబుద్ధిన్. 263
ఉ. ఆరఘురామ వీడ్కొని మహర్షివరుం డరుదెంచి కాంచెఁ బె
ల్లారటఁ బెట్టుశోకవిరహంబులు రూపగుమాడ్కి నాశ్రమ
ద్వారనివిష్టదృష్టియు వివర్ణయునుం జిరబద్ధవేణికా
భారయుఁ బ్రోచ్చలద్గళితబాష్పవినేత్రయు నైనజానకిన్. 264
సీ. కని పర్ణశాల డగ్గఱఁ జూచి యమ్మహీతనయ వాల్మీకిపాదముల కెరఁగి
తనయులు రా కేలతఁడుసిరి పతివియోగమకాక పుత్త్రశోకంబు నకట

సిద్ధించె నను సృజించి విరోధులకు బారి గోరియలఁ జేసెనో కో విధాత
యని విలాపింప నూరార్చి యేటికిఁ గ్రేపుఁబాసి గోడ్డౌఁబలెడుపగిది నడలె
తే. దబల నీవలె దుఃఖార్త లైనవార, లెంత మను దూఱినాడిన నెగ్గుగాదు
నీతనూభవు లున్నారు నెయ్య మలరఁ, దండ్రి మన్నింపఁగా నయోధ్యాపురమున.
క. కాకుత్స్థకులుఁడు నినుఁ బు, త్త్రికొనిరమ్మనియె నరుగుదెమ్మని కడఁకన్
సాకేతనగరమున క, న్నాకుభవుఁడు జనకనందనం దెచ్చుటయున్. 266
మ. సుతభార్యాయుతుఁడై రఘూద్వహుఁడు చతుఃప్రీతి సంధిల్లఁ ద
త్క్రతుశేషంబు సమగ్రదక్షిణలఁ బర్యాప్తంబు గావించి యం
చితరత్నాంబరభూషణావళులఁ బూజించె న్నృపశ్రేణి నా
శ్రితమౌనీంద్రవిశిష్టబాంధవధరిత్రీదేవతాకోటులన్. 267
క. ఏసరవిఁ గుశలవులతో, రాసి దుర మొనర్చె దాశరథి చేసె రణం
బాసరవిన జనమేజయ, వాసవనందనుఁడు బభ్రువాహనుతోడన్. 268
మ. అని సూతుం డను శౌనకాదులకు ని ల్లైతిహ్యముం దొల్లి జై
మిని చెప్పెన్ జనమేజయుం డడుగ నిమ్మే నేతదాఖ్యానమున్
వినినన్ వ్రాసి పఠించినన్ జనులకున్ సిద్ధించు నశ్రాంతముల్
ధనధాన్యాదికపుత్త్రపౌత్త్రసుఖనానాభోగభాగ్యోన్నతుల్. 269
క. వెలయఁగ నీకథ వినుధన్యులు తక్కినకథలు వినఁగ నొల్లరు మదిఁ గా
కులరొదలు విన రుచించునె, కలకంఠధ్వనులు విన్నకర్ణంబులకున్. 270
మ. కనకాద్రిప్రతిమానధైర్యజగదేకస్తుత్యసౌభాగ్యమో
హనలీలానవపంచబాణనిజబాహాశౌర్యవీరావిరా
జినయోపాయవిహార బోనగిరిచెంచీకొమ్మధారాపురీ
పెనుగొండాద్యఖిలైకదుర్గహరణప్రేంఖత్ప్రతాపోదయా. 271
క. అహితనృపాలమదాంబుధి, బహులహరీవిహారదంఘ్రిభాగ్యాంకసరో
రుహమీనశంఖచక్రని, వహవిశదీభూతచక్రవర్తివిలాసా. 272
తోటకము. బలభిద్విభవామణిభాలలితాం, చలసంకులకీలితశత్రుకుభృ
త్కులహాధ్వనితర్కవిధాయిఝుళిం, ఝుళినాదపదాంగదసవ్యపదా. 273

గద్యము.

ఇది భారతీతీర్థశ్రీచరణకరుణాపాత్ర గాదయామాత్యపుత్త్ర వినయవిద్యాసముద్ర
పినవీరభద్రప్రణీతం బైనజైమినిభారతంబునం దశ్వమేధపర్వంబున
షష్ఠాశ్వాసము.



శ్రీ

# జైమినిభారతము.

## అశ్వమేధపర్వము, సప్తమాశ్వాసము



శ్రీచికురబంధగంధఫ
లీచంచద్గంధభరమలిమ్లుచనుత వా
చాఘణకవికర్ణసుధా
సేచనసల్లాప నారసింహమహీపా. 1

వ. అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రున కిట్లనియె నివ్విధంబున బభ్రువాహనుండు పాండవమధ్యముం దొడరు సమయంబున. 2

తే. హంసకేతుండు సుతులు గయ్యమునఁ బడినఁ యపుడు తనుశౌరియన్నించినట్టితగవు హృదయమున మాటిమాటికి నెచ్చరింప, నచ్చలంబున బభ్రువాహనునిఁ దాఁకి. 3

మ. బలిమిన్ వేవురుపార్శ్వరక్షకు లెదుర్పన్ దున్మి తూఁటాడి బి
ట్టలుకన్ వానిఁ దెరల్చి తీవ్రతరబాణౌఘంబులన్ దేరు చె
క్కలుగా జేసి తదస్త్రముల్ విఫలముల్గావించి సంగ్రామదో
హలియై గీటణఁగించె మాఱ్కొనినపంచాక్షౌహిణీసైన్యమున్. 4

వ. అప్పుడు.

చ. చలమున నొండుతేరు రభసంబున నెక్కి కిరీటినందనుం
డలమి మరాళకేతను శతాంగము రూపఱ జేయుచున్ శరం
బులు నిగిడించి వానిఁ దెనుమూర్ఛితుఁ జేసి సహస్రమేదినీ
శులఁ గలనన్ సదధ్వరథిసూతముగాఁ దెగటార్చి యార్చినన్. 5

చ. కినుక సువేగుఁ డడ్డపడి క్రీడికుమారునురంబు గాఁడ బా
ణనవక మేసి మూఁడుబలునారసముల్ దొడి గాత్రపత్రమున్

ధనువుఁ బతాకయుఁ గెడపి తద్రథయోధసహస్రమున్ బృష
త్కనిహతిఁ గూల్చెన్ దళశతప్రదరంబుల ముంచె నాతనిన్. 7

వ. ఇవ్విధంబున సువేగుండు శరవేగంబు చూపిన. 8

మ. సురరాట్పౌత్రుఁడు దావపావకపరిస్ఫూర్తిన్ విజృంభించి ని
ర్భరశౌర్యోన్నతి వానిబాహుబలగర్వప్రౌఢి వారించుచున్
శరజాలంబుల శుభ్రవారణఘటాసంఘంబులం ద్రుంచి త
త్కరిమూర్ధాశ్వకళేబరోత్కరములన్ గప్పెన్ సమిద్భాగమున్. 9

ఉ. వెండియు నాగ్రహంబున సువేగునిమధ్యము ద్రెవ్వ నొక్క బ
ల్కాండ మడర్చె వానికరలాఘవ మేమనిచెప్పఁ దూఁచిన
ట్లుండ సమంబుగాఁ దెగి రణోర్విపయిం బడ కంతలోఁ జతుః
ఖండములై సురల్ బెదరఁ గవ్వడిపట్టి యురంబు దాఁకినన్. 10

క. నిలుపోప కతఁడు మూర్ఛా, కలితుఁ డగుచుఁ దోన తెలిసి ఘనభుజశక్తిం
బొలియించెఁ బార్థుయోధవ, రులఁ బలువురఁ బ్రళయకాలరుద్రుఁడుఁ బోలెన్. 11

తే. బభ్రువాహనుచే నాజిఁ బడినదొరలఁ, దత్పురంబునఁ జిత్రాంగదాసపత్ని
యగునులూచి క్రమంబున నరయుచుండెఁ, దగువిశల్యాదివివిధౌషధములచేత. 12

## అర్జునుఁడు దనకు దోఁచుదుర్నిమిత్తంబులు వృషకేతనుతోఁ జెప్పుట.

సీ. అపుడు ధనంజయుం డను వృషకేతుతో సైన్యనాశము కాక సకలవస్తు
వులు నష్ట మయ్యె నీవును నేను శేషింపఁబడిరి హంసధ్వజప్రముఖు లాజిఁ
బ్రద్యుమ్నుఁడును బట్టుపడియె నయ్యనుసాల్వక్రమ మేమియును గానరాకపోయెఁ
దనతనుచ్ఛాయ మస్తకహీనయై తోఁచెఁ గనుఁగవ విస్ఫులింగములు దొరఁగె

తే. దుర్నిమిత్తంబు లివిగాక తోఁచెఁ బెక్కు, చావునకు నింక లంకెగాఁ జనదు మొంపల
నస్త్రజర్జరితాంగుఁడ నన్వయాభి, వృద్ధికై నిల్వు నీవైన విద్రుప నీరు. 13

వ. అసిపత్త్రవ్రతదీక్షాపరుండై పాండవాగ్రజుండు మద్భుజావిక్రమంబు నిర్వక్రం
బగు నని యొనర్చినక్రతూపక్రమం బపక్రమం బయ్యె చషాలకలితం బగుఖదిర
బదరీపలాశబిల్వయూపకలాపంబు లోపం బయ్యె వసుమతీనిలింపజంపతీజనంబు
సంపాదించు చతుష్షష్టిసలిలపాత్రాభిషేచనవిధానంబు తిరోధానం బయ్యె నధ్వ
రారంభసముత్తంభితం బగువిహితశతశలాకారచిత శార్దూలాజినోపయోజితాత
పత్త్రవిలాసంబు నిరాసం బయ్యె సవనమండపాభ్యంతరంబున వర్షమాణంబు లయిన
ప్రసూనలాజప్రవర్షి మహర్షిపుంగవుల మంగళాశీర్వాదంబు లర్థవాదంబు లయ్యె

నవభృథస్నానసమయంబున సముచితమాల్యానులేపనమణిమయవిభూషణాంబర విరాజమానం బైన గౌరీసహస్రంబు కరకమలంబుల ధరియించు కాంచనదండ మండితచమరవాలచాలనప్రచారంబు దూరం బయ్యె రుక్మిణీసహాయుం డగు పుండరీకాక్షునగ్రపూజాప్రసంగంబును భంగం బయ్యెఁ గావున మదీయజీవనం బప్ర యోజనంబు తనకు సంగరమరణంబ శరణంబు నీవు కృష్ణధర్మజులపాలికిం జను మనిన వృషకేతనుండు కపికేతనున కిట్లనియె. 14

మ. పలుకుల్ వేయును నేల తూలి రవిబింబం బుర్విపై వ్రాసినన్
కలఁకన్ వైరికి వెన్ను నూపుదునె మూఁకల్ గట్టి బృందారకుల్
దలపడ్డన్ బలిమిన్ జయింపఁగల నేతన్మాత్రు లీశాత్రవుల్
నిలువన్ శక్తులె న న్నెదిర్చి కలనన్ నీప్రాపు నా కుండఁగన్. 15

తే. స్వామి సఖి గోమహీసుపర్వప్రయోజ, నార్థమై మేను దొఱఁగుధన్యాత్ముఁ డెవ్వఁ
డతఁడు కైవల్యసౌఖ్యంబు ననుభవించు, ననుచుఁ జెప్పుదు రఖిలధర్మార్థవిదులు.

క. ననుఁ జిత్తగింపు మని చ, య్యన మ్రొక్కి రథాధిరూఢుఁ డై భుజగర్వం
బున బభ్రువాహు నెదిరిం, చెను వృషకేతుండు రెండుసేనలుఁ బొగడన్. 17

తే. అట్లెదిర్చిన వృషకేతు నపుడు గ్రీడి, సుతుఁడు మార్కొని సాయకత్రితయ మేయ
నవి యురముఁ గ్రుచ్చి ధరఁ దూఱె నధికతృష్ణ, భోగవత్యంబువులు గ్రోలఁబోవునట్లు.

క. నరసూను నపుడు కర్ణజుఁ, డురమూఁడుశిలీముఖంబు లెద నించిన నొ
చ్చి రయంబునఁ గోల్కొని వా, నరదముఁ దునిమెన్ సకేతుహయసూతముగన్.

ఉ. ఆరవిపౌత్రుఁ డొండొకశతాంగముఁ గైకొని హేమపుంఖవి
స్ఫారశిలీముఖౌఘములఁ బార్థసుతుం దెరలించి క్రమ్మఱన్
దేఁలఁ గూల్ప వెండియును దీవ్రత నొండురథంబులోడ న
వ్వీరుఁ డెదుర్పఁగాఁ దునిమె వేయిరథంబులదాఁక నాతఁడున్. 20

మ. నరరాధేయతనూభవుల్ మఱియు నానాదివ్యబాణంబులన్
సరిపోరన్ వృషకేతనుం డనలపర్జన్యాంతకార్కాదిని
ష్ఠురనారాచపరంపరం బొదువ నాటోపంబు మీఱన్ బురం
దరపౌత్రుం డవి త్రుంచె నన్నియును దా నారాయణాస్త్రంబునన్. 21

తే. కర్ణజునిఁ జూచి యిట్లనుఁ గార్ష్ణి యపుడు, పొలిసె నీసేన మద్భుజావిలసనమున
వృత్రుఁ డమరేంద్రు నెదిరించువిధము గాక, యెందుఁ బోవచ్చు నీకు నాయెదుర ననుచు.

మ. దరహాసంబున బభ్రువాహనుఁడు రాధాపౌత్రు మాద్యద్భుజాం
తరమున్ దూఱ మరుచ్ఛిలీముఖము సొప్పన్ దూలి బ్రహ్మండక

ర్వరముం దాఁకి ధరిత్రిపైఁ బడక సర్వక్ష్మాభృదాశావధిన్
శరధుల్ చుట్టుక ముమ్ముహూర్తమున కాజన్యస్థలిం ద్రాలుచున్. 23

తే. కుదురుకొని కర్ణజుఁడు క్రీడికొడుకు నుద్ధ
రాస్త్రహతి నొంప నతఁడుఁ జోద్యముగఁ దరణి
బింబ మొరయంగ నెగసి రథంబు దిరిగి
పడియె ధరమీఁద సంపాతిపక్షిఁబోలె. 24

వ. ఇత్తెఱంగునం బడినబభ్రువాహను నవలోకించి. 25

చ. తొడరి మరాళకేతనునిఁ ద్రుంచినదుష్కృతి దీర్తు నంచు బ
ల్విడి వృషకేతనుం డురుశిలీముఖము న్నిగిడింపఁ ద్రుంచి క
వ్వడితనయుండు బిట్టెగసి వానిపయిం దరికొండకైవడిన్
బడి వడి గెంటి మింట శరపంచకముం దొడి నేసి యార్చినన్. 26

తే. క్రీడితొడుత నను వృషకేతనుండు, అరద మిలఁ గ్రుంగ రాధేయునంతవాఁడు
నిలువు మనె నిన్ను నివ్వీరునలవుగంటె, యొక్కమొగి నప్రతాపించుచున్నవాఁడుఁ.

క. అనునెడఁ బార్థుఁడొకశరమునఁ బగిలిచెఁ గర్ణసుతునిమూర్ధ మతఁడు నా
తని ముంచెఁ బెక్కుశరముల, జనమేజయ యిట్లు భయదసమరం బయ్యెన్. 28

చ. అరుదుగ ధాత్రిఁ గొంతదడ వంబరమార్గమునందుఁ గొంతప్రొ
ద్దరదము లెక్కియున్ విరథు లయ్యును బోరిరి పంచరాత్రముల్
శరములు తచ్ఛరీరపలలంబులఁ ద్రెంచుక పాఱ నల్గడన్
గొరలి యహర్నిశంబుఁ దమకించుచుఁ బైకొనఁ గాకఘూకముల్. 29

క. ఇప్పరుసున నయ్యిరువురు, డెప్పరముగఁ బోరునెడఁ గడిఁది బాణములన్
నొప్పించి బభ్రువాహనుఁ, డప్పుడు వృషకేతుఁ బలికె నాగ్రహ మెసఁగన్. 30

క. ఇన్నిదినంబులు మార్కొని, న న్నెదిరితి నిలిచి మే లనందగుఁ గలనన్
నిన్నుఁ బొరిగొనక విడువ మ్మది న్నిలుపుము నేఁడు వాసుదేవుని ననుచున్. 31

చ. కినుఁగొని యర్ధచంద్రవిశిఖం బడరించినఁ గర్ణసూతి ము
త్తునియలు సేయుచుం జెలఁగ దొడనె హేమవిచిత్రసాయకం
బున మెడ ద్రుంపఁ దచ్ఛిరము మొండెముపై నటియించి చెండుభం
గి నెగసి కృష్ణుఁ బేర్కొనుచుఁ గ్రీడిపదంబులమీఁద ద్రాలినన్. 32

తే. అక్కబంధంబు వడుచుఁ బ్రత్యర్థిసేన, నద్భుతంబుగ మడియించె నపుడు పార్థుఁ
డతనిమణికుండలాన్విత మగుశిరంబు, కరమున ధరించి మిగుల శోకము వహించి.

## అర్జునుఁడు వృషకేతునిమరణంబునకు శోకించుట.

సీ. రక్తాక్తమౌక్తికారాతిమూర్ధాబ్జాంఘ్రిశాలి నాఁడె రిత్తచంపుకొంటిఁ
బుత్త్రిపౌత్రాలంభమునకు మైకొని యబ్జహితునితోడ విరోధ మియ్యకొంటి
నభిమన్యుపిమ్మట నన్వయస్థితికి నెన్నఁగ నీవు గలవని నమ్మికొంటి
గుణనిధానము నిన్నుఁ గోల్పోయి హరియుధిష్ఠిరులచిత్తము దప్పఁజేసికొంటి
తే. నకట మఖవాజి సాధించినపుడు భీము, నెదురఁ బ్రతిపక్షులను సమయించి నేఁడు
నాకుఁ దోడయి వచ్చి జన్యమున సమసి, యిచటఁ బక్షులపాలైతివే కుమార. 34

తే. అంబుజాప్తుండు లేనినభంబు దివియ, లేనిగేహంబు లింగంబు లేనిపీఠ
మప్రయోజన మైనయ ట్లనఘ నాకు, నీవు లేనిజయం బది నిష్ఫలంబు. 35

వ. అని ధనంజయుండు తచ్ఛిరంబు శరీరంబునం జేర్చి మూర్ఛితుండై తెలిసి బహు
ప్రకారంబులం బలవింప నతనిం గనుంగొని బభ్రువాహనుం డిట్లనియె. 36

తే. వైశ్యజుఁడఁగాన సంగ్రామవనధిలోని, వీరకోటీరమణులకు విలువ గంటిఁ
గర్ణసూనునిశిర మనర్ఘంబు దీని, భవున కర్పించి పడయుము పాశుపతము. 37

క. అన విని కిరీటి కర్ణసుతునిమస్తము రథముపైఁ గుదుర్పఱిచి మదిం
గనలుచును బభ్రువాహనుఁ, గని యిట్లనుఁ జటులసజ్యగాండివధరుఁడై. 38

చ. బిరుసుగ నేటికిట్ల దఱచు ప్రేలెదు శూరుఁడ వైన నిల్చి నీ
పరుసఁదనంబు చూపుమని పాండుతనూజుఁడు చిత్త జల్లుగాఁ
గురియుపయోధరంబుక్రియ ఘోరశిలీముఖవృష్టి ముంచినన్
దురమున బభ్రువాహనుఁడు దూలె బలంబులు గూలె నగ్గడన్. 39

శా. మూఁకల్ గట్టినయోధయూధపహరుల్ మొండెంబులై రాలఁగాఁ
దూకంబుల్ సెడి తేరు లాకసమునన్ దూలంబులై తూలఁగా
నాకాంతేయుశరాగ్ని మించి జటిలంబై గోపురాట్టాలక
ప్రాకారంబులుమున్నుగా మణిపురిన్ భస్మంబు గావించినన్. 40

శా. ఆసంరంభము బభ్రువాహనుఁడు బాహాశక్తి మాయించి తో
డ్తో సూతాశ్వకపీంద్రులన్ వరుస మూఁడున్నాల్గు నేనమ్ములన్
వే సోలించుచు నుగ్రభల్లముల నవ్వీరుండు గారింపఁగాఁ
గాసిం బొందెఁ గిరీటి సన్నిహితగంగాశాపసంవిష్టుఁడై. 41

క. అవ్వేళ దివ్యబాణము, లెవ్వియుఁ బని సేయకున్న నెదవడి మదిలోఁ
గవ్వడి దూలఁగఁ గని యెల, నవ్వుచుఁ జిత్రాంగదాతనయుఁ డిట్లనియెన్. 42

శా. మాతల్లిన్ వనితామతల్లిని సభామధ్యంబునం దొల్లి య
ప్రీతుల్ పల్కిన పాతకంబునకుఁ జేరం గాల మిప్వేళ ని
న్నాతంకంబునఁ బెట్టుమన్న పితృపుత్రాశల్ విసర్జించి నీ
సూతుం గృష్ణుఁ దలంచుకొమ్మనఁగ నచ్చోఁ బుట్టె నుత్పాతముల్. 43

సీ. నెత్తురు వర్షించె నీరదంబులు వీచె శర్కరాభీలఝంఝామరుత్తు
విరివిగాఁ గప్పెఁ గావిరి గంతముల సంగ్రామభూస్థలి మూఁడు ప్రయ్యలయ్యె
రాలె నులుకాసహస్రము లెల్లెడల నిల్చి దట్టించె భూతబేతాళగణము
షాగ లేక యాయుధంబులు మండె నుజ్జ్వలప్రతిసూర్యమండలప్రభలు వెలిఁగ

ఆ. బభ్రువాహనుండు పాండవమధ్యము, ప్రాణహరణనిష్ఠురప్రచార
జాగ్రదుగ్రశరధిసంచితజ్వాలాభి, ధానశరము వింటఁ బూనుటయును. 41

శా. ఆవిఖ్యాతశరంబు హాలహలసప్తార్చిశ్ఛటల్ గ్రాయుచున్
రా వీక్షించి సురేంద్రసూతి వివిధాస్త్రప్రౌఢి వారింప ది
ద్యావాపృథ్వ్యవరోధమై నిగిడి క్రౌర్యస్ఫూర్తిమై బంధుర
గ్రీవంబున్ వడిఁ ద్రుంచెఁ దచ్ఛిరము లక్ష్మీనాథుఁ గీర్తింపఁగన్. 45

## బభ్రువాహనుం డర్జునుఁ దెగనేయుట.

తే. అహిమకరుఁ డుత్తరాగతుం డైనశుక్ల, పక్షకార్తికైకాదశీభానువాస
రమున నిను సప్తమయవేళ వ్రాలె నతని, తలయు వట్టియు వృషభకేతనునిమ్రోల.

క. అప్పుడు కర్ణజపూర్వక, కుప్పసుతాస్యములు రత్నకుండలరోచుల్
గప్పుకొని మెఱసె ధరఁ బడి, యొప్పారెడుసూర్యబింబయుగళముఁ బోలెన్. 47

వ. ఇవ్విధంబునం బభ్రువాహనుం డాహవముఖంబున వృషకేతనకపికేతనుల వధించి
జయోత్సాహంబునం బొదలి మగడునప్పు డప్పురంబున. 48

సీ. కొలఁదిగాఁ బన్నీరు చిలికించి కప్పురంబున గృహాంగణముల ముగ్గు దీర్చి
సమకట్టుచీనాంబరములతో బెరయఁ జిత్రములుగా మకరతోరణము లెత్తి
యెడనెడ వారస్త్రగేక్షణానృత్యయోగ్యము లైనవివిధయంత్రము లమర్చి
సాంబ్రాణిధూపవాసనఁ గదంబించువీధుల మంగళద్రవ్యములు ఘటించి

తే. భూరిజయవాద్యఘోషముల్ బోరుకలఁగఁ, బౌరజను లెదుర్కొనెడుసంభ్రమము బభ్రు
వాహుచే నింద్రసుతుఁ డాహవమునఁ దెగుట, గాంచి విచారించి చిత్రాంగదావధూటి.

## అర్జునునిమరణంబు విని చిత్రాంగదాదులగు వంతగిపురస్త్రీలు దుఃఖించుట.

ఉ. ఉల్లము వ్రక్కలై కలఁగ నొత్తినమూర్ఛ వహించి ధారణిం
ద్రెళ్ళినఁ జేటి యత్తరుణిఁ దేర్చి యులూచి యురంబు మోము జో

త్రెళ్లఁగ మోఁదుకొంచుఁ బరిదేవన మొందఁ బురీవధూజనం
బల్లుక చేయురోదనము లంతిపురంబున నిండఁ బర్వెనన్. 50

వ. తత్కోలాహలం బాలకించి బభ్రువాహనుఁ డంతఃపురంబుం బ్రవేశించునప్పుడు

శా. నేలన్ రాలినహారవల్లికలు ఖండీభూత పాటీరదూ
ర్వాలాజాక్షత హేమపాత్రికలుఁ బభ్రుస్ఫూర్తినీరాజన
జ్వాలాకోరకితాంగణంబులు ననిశ్వాసంబునన్ భూవిభుం
డాలోకించుచు వచ్చి కన్గొనియె శోకాక్రాంతలం దల్లులన్. 52

తే. కాంచి యిట్లను నర్వాశృంగారరచన, లెడల నేటిని నింత వావిడిచి యేద్వ
నసదృశానందకారణం బైనమద్వి, జయమునం దిట్లు శోకింపఁ జనునె యనిన. 53

క. తరువున జనించి వైశ్వా, నరుఁడు తరువుఁ గాల్చువిధమునను బుత్త్రుఁడవై
నరున కుదయించి తండ్రిన, పొరిగొంటివి విధవ కేల భూషణ మింకన్. 54

క. కాంత ధనంజయముఖమునఁ, గాంతు ధనంజయముఖంబు గావునఁ గొనిపో
మ్మంతముఁ బొందినవిజయా, భ్యంతికమున కన్నఁ బన్నగాత్మజ పలికెన్. 55

ఉ. నారొలదోఁటలో మొదల నాటినదాడిమపంచకంబు నీ
పోయినరేయి దగ్ధ మయిపోయె నిమిత్తము లేక యల్లకాం
తేయుని కీడు గంటిఁ దరుణీ యనఁ దల్లి కుమారుఁ జూచి పు
త్త్రా యెటుఁ గిట్లు చేయునిత్యహత్య జయం బని కోరె దేమనన్. 56

క. అన : వాహనుఁడు ప, ర్వినభయమునఁ గలఁగి మోము వెలవెల వాఱన్
గొనిపోయె నపుడ తల్లుల, జనకుఁడు పడియున్నఘోరసమరస్థలికిన్. 57

ఆ. చేర నరుగుదెంచి చిత్రాంగదయు భోగి, రాజసుతయు దివిజరాజసుతుని
పాదపంకజములపైఁ బడి యందంద, పొదలు శోకవహ్నిఁ బొగిలి పొగిలి. 58

సీ. దివిజులఁ దతిమి ఖాండవము సప్తార్చికి ధారవోసినయశోధనుఁడు వీఁడె
నిటలాక్షుతోడ నెక్కటి పోరి పాశుపతము గొన్నవిక్రమోద్ధతుఁడు వీఁడె
కాలకేయాదిరాక్షసుల నుక్కడఁగించి జయము గైకొనినదుర్జయుఁడు వీఁడె
కలని భీష్మాదియోధులగర్వ మెడలించి పసి మరల్చినబాహుబలుఁడు వీఁడె

తే. యగ్రజునకును రాజసూయాధ్వరప్ర, శస్తి నెరపినభ్రాతృవత్సలుఁడు వీఁడె
యదుకుమారుల సరకుసేయక సుభద్రఁ, గడిమిఁ జేకొన్న హరిచెలికాఁడు వీఁడె.

తే. అని విలాపించి వృషకేతనునిశిరంబుఁ, గాంచి తల్లులు దిగిచి వక్షమునఁ జేర్చి
తండ్రిఘనిఁదీర్ప కిట్లు నాతండ్రి నిలువ, నగునె నీ కంచు బభ్రువాహనునిఁ జూచి.

మ. తనయా చంపితి కర్ణసూను బుధమందారంబు నిం దేమికీ
ర్తి నినుం జెందె హయంబువెంట నిఁకఁ గూర్మిన్ హస్తినాపట్టణం
బునకుం బోవఁగఁగల్గె బంధువితతిం బూజింపఁగాఁగల్గె నం
దు నిజేశుం గలయంగఁగల్గె ననఁ దోడ్తోఁ ద్రుంచి తయ్యాసలన్. 61

క. కనకునిఁ జంపినమాడ్కిని, జనయిత్రుల మమ్ము నిపుడ చంపుము జననీ
జనకవధం బొనరించినఁ, గనియెదు భార్గవునికన్న ఘనతరకీర్తుల్. 62

తే. ప్రియుఁడు పరలోకగతుఁ డైనపిదప సతుల, కనుగమన మెందు నర్హాకృత్యంబు దగిన
తెఱఁగు గావింపఁబనుపుము తీర్చికొనెద, నగ్ని ముఖమునఁబతివియోగాగ్ని యనిన. 63

శా. అంబా తండ్రికి మున్ హయంబుఁ గొనుచున్ సాష్టాంగదండ ప్రణా
మం బేఁ జేసిన నాదరింపక సభామధ్యంబునన్ దుచ్ఛవా
క్యంబుల్ పల్కఁగ సంభవించెఁ బితృహత్యాలబ్ధి యిక్కీడు నా
శం బైపోదు తపోవ్రతానశనయజ్ఞధ్యానదానాదులన్. 64

క. మును దా నుదయించినవే, ళనె పితృఘాతుకుఁడు గాఁ గలఁడు వీఁ డని నె
మ్మనమున నెఱిఁగిన ఫణిసుత, ననుఁ జంపక పెనుప నఘమునకు లోనైతిన్. 65

క. కావున నిత్తను ననలము, లో వేల్చెద ననిన విని యులూచి వలికె నే
లా వగపడెదు మృతసం, జీవనమణి గలదు తండ్రి శేషునినగరన్. 66

తే. కులికవాసుకిశంఖకర్కోటకాది, ఫణులు మణిదీప్తఫణపరంపరలు మెఱయఁ
గాతు రది మృతభోగిరక్షణము గాన, గరుడభయపన్నగుల కిచ్చెఁ గాళగళుఁడు.

## ఉలూచి చిత్రాంగద నూరార్చి మృతసంజీవనీరత్నంబు దెచ్చుటకు పుండరీకుని పాతాళంబున కనుచుట.

మ. బలిమిం జేకొనరాదు సామమునఁ దప్పక బుండరీకుండు దేఁ
గలఁ డారత్నము మత్ప్రధానుఁ డని యక్కల్యాణి తాటంకమం
గళసూత్రంబులు చేతి కిచ్చి ఫణిలోకస్వామి కీదుర్దశల్
తెలియంగా వినిపించి యమ్మణి వెసం దెమ్మంచు వీడ్కొల్పినన్. 68

తే. వికృతిఁ బొందకయుండ సవ్యజయకర్ణ, సుతుల మేనులు మూర్కొని యతఁడు వీరి
నేమఱక యుండుఁ డని వారి నెచ్చరించి, కదలి వెసఁజొచ్చె వసుమతీగహ్వరంబు.

సీ. అయుతయోజనసువర్ణాశ్వత్థగహనఖేలత్పన్నగము వితలంబు సొచ్చి
ఫలితకాంచనశమీపాదపచ్ఛాయావిలాసవాసము సుతలంబు గడచి
శాతకుంభరసాలసాలచిత్రానేకతరుసంకులము మహాతలము దాఁటి
మరకతమాణిక్యమయచందనద్రుకాంతాంతరము రసాతలము వెడలి

తే. కనియె భోగవతీతీరవనవిహార, హాటకేశ్వర భవనసౌధాధిరూఢ
గూఢపాత్రకన్యకాగానగుంభమాన, తాళకోలాహలమ్ముఁ బాతాళతలము. 70

వ. కనుంగొని. 71

తే. అచట భోగవతీస్నాన మాచరించి, నియతకృత్యంబు లెన్ని యన్నియును దీర్చి
పుండరీకుఁడు హాటకపుండరీక, మండలుల హాటకేశు నర్చన మొనర్చి. 72

మ. ముకుళన్యస్తకరారవిందుఁ డగుచున్ మూర్ధేందుచూడావతం
సకునిన్ వీడ్కొని నూత్నరత్నఖచితాస్థానిన్ విలోకించి వా
సుకికర్కోటకతక్షకాదిభుజగేశుల్ గొల్వ దీపించునం
దకపాణిస్మరణవ్యపోదయతవిద్యాశేషు నాశేషునిన్. 73

చ. కని వినయంబు గ్రందుకొనఁగాఁ బ్రణమిల్లి యులూచి దాల్పుటం
దనపు మెఱుంగుఁగమ్మలును దాలియుఁ జూపి కిరీటి ధర్మసం
దనమఖవాహరక్షణచణస్థితి నేగుచు బభ్రువాహు మా
ర్కొని హతుఁ డయ్యె నీతనయుఁడుం బలిదానము సేయఁగాఁదగున్. 74

చ. ధరణితలంబు మస్తమునఁ దాల్చి యొనర్చితి జీవకోటికిన్
బరమసుఖానుకూలముగ మధ్యమలోకము శైలధ్వనికిం
బురజయ మిచ్చి వేలుపులఁ బ్రోచితి వేగతి నెన్ని చూచినన్
బరపురుషోపకారములు పన్నగనాయక నీవిహారముల్. 75

క. కావున నీనిలయమున సు, ధా విషధరముఖ్యరక్షితం బగుమృతసం
జీవని యొసఁగినఁ బునరు, జ్జీవితుఁ డగుఁ బార్థుఁ డనిన శేషుఁడు పల్కెన్. 76

క. హరిభక్తిపరాయణుఁ డ, న్నరుని జయింపంగ నాదినారాయణుఁ డొ
క్కరుఁడును దక్కఁగ నెవ్వరి, తర మతని నెదుర్ప నద్భుతం బిది యనినన్. 77

క. ఆపుండరీకుఁ డనుఁ బ్ర, ద్వీపతు లెనగారు విజయు దీకొన గంగా
శాపహతిఁ బుత్త్రిచేతన, రూపఱెఁగా కనిన విని కరుణ దళుకొత్తన్. 78

క. మృతసంజీవకమణియు న, మృతకుంభము నొసఁగరాదను సమీకహతు శత
క్రతుసుతు బ్రతికించి జగ, త్త్రితయంబునఁ గీర్తి విస్తరించెద ననుచున్. 79

క. కృతనిశ్చయుఁ డగుశేషుని, ధృతరాష్ట్రిం డనెడుఫణి గదిసి యిట్లను సం
చితవస్తుజాతములలో, వితరణములకు నొసఁగరానివియు లే వెచటన్. 80

తే. అయిన నొకవిన్నపము మర్త్యు లమృతవాద్యు, లిచ్చినను హరియెడఁ ఫలియింప నేర
దమృతమును రత్నమును బోయినపుడ ఫణుల, బైసిచెడిపోవుఁ దుణ నీరుపాములగును.

క. గరుడుఁడు తోలుక తిరుగును, పురముల నాడింతు రుపరపోషణములకున్
బరిజోగులు చెట్టైల నిడి, తరుణులు బోలుచుకొంద్రు మణులు తలతలవారిన్. 82

ఆ. మును మతంగశాపమున వైనతేయుఁ డిక్కడికిరాక తక్కెఁగాక యివ్వి
ధం బెఱింగనే సుధారసరత్నంబు, లేల మనకు మగుడ నిచ్చునతఁడు. 83

క. మత్తకరివిభుఁ డమాత్యుఁడు, మెత్తనియంకుశము మేరమీఱి నడచెనే
నొత్తి మరలింపఁదగు నీ, చిత్తం బిఁక ననిన నగుచు శేషుఁడు పలికెన్. 84

తే. గోపసూనులఁ గ్రేపుల గోధనములఁ, గమలజుఁడు దాఁచి సత్యలోకమున నున్న
నపుడె ప్రతిసృష్టి యొనరించె నాప్తుఁ డైన, క్రీడి బ్రతికించు టేదొడ్డు కేశవునకు.

క. పూరిపుడక కులిశం బగు, నారాయణుకరుణ గలిగినను లేకున్నన్
మేరువు తృణ మగు నవ్విభు, కారుణ్యము గాదె వజ్రకవచము మనకున్. 86

వ. అనిన ధృతరాష్ట్రుండు శేషున కిట్లనియె. 87

క. వనజోదరుండు వాసవ, తనయుని బ్రతికించునఁట సుధారసమణులన్
బని లేనిప్రయోజన మిచ్చి నిరర్థక మేల ఫణులఁ జెఱిచెద వనినన్. 88

## పుండరీకుఁడు శేషునిచే తిరస్కృతుండై మరల నులూచికడకు వచ్చుట.

తే. పుండరీకునిఁ జూచి శేషుండు పలికె, మాకులమువారు సంజీవమణియు సుధయు
నీరు హరి క్రీడిఁ బ్రోచు నీ వేఁగు మనిన, తిరిగి యాతండు వచ్చిన తెరువుఁ బట్టె.

ఉ. సంగరభూమిఁ జేరి ఘనసారసముజ్జ్వలదీపమాలికా
సంగత బభ్రువాహనిజసైన్యసురక్షితుఁ డైనపార్థుమౌ
లం గడుఁదూలి దీనదశలం బరవించెడునయ్యులూచిచి
త్రాంగదలం గనుఁగొని దురంతవిషాదముతోడ నిట్లనున్. 90

శా. తల్లీ నీజనకుండు శేషఫణిరత్నం బీక లోభంబు సం
ధిల్లం బల్కిన రోసి వచ్చితి విరక్తిం బుత్త్రిదత్తాగ్నిలోఁ
జెల్లుం డిందఱు నన్నుఁ గార్ష్ణి చెవికిం జేఁదై కఠోరప్రథా
వేల్లద్భ్రూకుటిమండలుం డగుచుఁ జేవి ల్లంది పె ల్లీనువన్. 91

శా. ఏట్రా శేషుఁడు పోతరించి సభ నన్నెగ్గాడె నారత్న మీఁ
దట్రా వాసుకితక్షకాదిధృతరాష్ట్రామాత్యకర్కోటకుల్
చుట్రా నిల్తురుగాక నన్ను సమరక్షోణిన్ విజృంభించి యా
గట్రాచూలివిభుం డెదిర్చిన నహంకారంబు వారించెదన్. 92

క. అని జనయిత్రులదెసఁ గ, న్గొని యిట్లను బభ్రువాహనుఁడు చిత్రముగాఁ
గొనివచ్చెద మృతసంజీవనమణియు సుధారసంబు వగవకుఁ డనుచున్. 93

## బభ్రువాహనుఁడు నురగులతోడి యుద్ధంబున కేఁగుట.

క. మాతంగరథభటాశ్వప్రతతుఁ డగుచుఁ ద్రోవ పుండరీకుఁడు చూపన్
బాతాళంబున నిలువక, పాతాళంబునకుఁ బోయి పౌఁజులు సేయన్. 94

తే. శంఖభేరీమృదంగనిస్సాణభయద, రావములు దిక్తటంబుల వ్రక్కలింప
శేషుఁ డిట్లనుఁ దక్షకమూషకాద, కులికవాసుకికర్కోటకులఁ గనుఁగొని. 95

ఉ. తెంపున బభ్రువాహుఁ డరుదెంచె రణంబునఁ బన్నగంబులన్
ద్రుంపక పోఁడు కట్టలుకతో ధృతరాష్ట్రనిదుర్వినీతు లా
లింపఁగఁబట్టి పుట్టెఁ బనిలేనివిరోధము మీర లెల్ల నా
పంపునఁ బోరికిం జనుఁ డపారబలంబులతోడ నావుడున్. 96

ఉ. కుండలిరాజునాజ్ఞ భుజగుల్ వరరత్నకిరీటముద్రికా
కుండలమాల్యచందనదుకూలములన్ ధరియించి వాహవే
దండరథాధిరూఢు లయి తార్క్ష్యుని మార్కొన నొప్పె సేన లా
కెండు లయాంతకభ్రుకుటిరేఖల పెంపుఁ దృణీకరించుచున్. 97

మ. అనికిం దూకొని దందశూకచతురంగానీకముల్ పంచయో
జనజన్యస్థలి నిండి భీషణవిషజ్వాలావలిన్ బభ్రువా
హనుసేనం బరిమార్పఁ దోన ధృతరాష్ట్రామోఘదివ్యాస్త్రశ
స్త్రనిపాతంబు లనేకవింశతిసహస్రవ్యూహముల్ గ్రగ్గెసన్. 98

తే. విజయసుతుఁ డల్గి మయూరవిశిఖ మేయ, ద్విత్రిశతసంఖ్య ఫణములవిషధరముల
శిఖులు మర్దింపఁ జెదరుతచ్ఛీర్షమణులు, విలయమున రాలునుల్కలవిధము మెఱసె.

వ. ఇత్తెఱంగునం గేకిలోకంబు కదిసి చీకాకుపడం గాకోదరంబులయుదరంబులు చంచూపుటంబులం జించినఁ బ్రేవులు ప్రోవులువడం గడసి నాలికలు పేలికలవిధంబునం దూలందూలుట గనుంగొని యక్కుమారుండు మధువర్షబాణంబు ప్రయోగించి.

క. నిలువక పిపీలకాస్త్రం, బలుకమెయిం దొడిగి యేయ నందువలనఁ జె
క్కులుచీమలు వెలువడి వడిఁ, దొలిచె శరీరాస్థు లెల్లఁ దొఱటలువాఱన్. 101

క. చిలువదళీవాయు లప్పుడు, తలబీకనకాయలై యథాయథలై కూ
కులువత్తులునై మొనతల, నిలువక శేషాహికడకు నెఱిచెడి పాఱన్. 102

వ. వారలం గనుంగొని భుజంగపుంగవుం డిట్లనియె. 103

క. మృతసంజీవని సురరా, ట్సుతులకు నిం డన్న నప్పుడు కుయుక్తులు చె
ప్పితిరి నరసూనుమగఁటిమి, ధృతరాష్ట్రప్రముఖు లెఱిఁగితిరె నేఁడాఁకన్. 104

## బభ్రువాహనుఁడు నురగుల నోడించి జీవమణిఁ గొనివచ్చుట.

సీ. అంచు వారల నిరసించి యాక్షణమ సుత్రామపౌత్రునకు నీఁదగినదివ్య
కవచంబు శతశలాకాఛత్రము సమూల్య కుండలాభరణదుకూలమాల్య
పరిలేపనములు నుపాయనంబుగ నిచ్చి గారవించి మనంబుకందు వాపి
గాండీవికిని మేలుకట్టునంబు లమర్చి స్వర్ణ పేటికలందు సంతరించి
తే. తక్షకాదులు గొల్వఁ బాతాళగహ్వ, రంబు వెలువడి జీవరత్నంబుఁ గొనుచు
బభ్రువాహనుఁ గూడి ప్రాభవము మెఱసి, మణిపురంబున కేతెంచె ఫణివరుండు.
తే. అపుడు ధృతరాష్ట్రుఁ డాత్మగేహమున కరిగెఁ,దుఃఖితుండయి దుర్బుద్ధి దుస్స్వభావు
లను సుతులఁ గాంచి బభ్రువాహనునిచేత, బవరమున నైనతనపరాభవము దెలిపి
క. పాండవులకు మనకు మొదల, నుండియును నెడతెగనివైర మురగవిభుం డా
ఖండలసుతు బ్రతికించును, రం డిందుకుఁ దలఁపు డంతరాయం బనినన్. 107
వ. వారలు తండ్రికి, బ్రణమిల్లి యిట్లనిరి. 108
ఉ. రుండము దాఁచినన్ ఫణివరుం డొకఁ డేల కిరీటిఁ బ్రోవఁ గృ
ష్ణుండును జాలఁ డింద్రసుతుచోఁ ప్వణఁగన్ మఖసైంధవంబు నె
వ్వాం డయినన్ హరింప నిలువంబడు జన్నము యజ్ఞకర్మహీ
నుం డయి చెల్లు నయ్యమతనూజుఁడు నీపగదీఱు నంతటన్. 109
తే. అనిపధృతరాష్ట్రుఁ డలరి శేషాహిఁ గొల్వఁ, జనియె నెఱుఁగనియట్లు తక్షణమశక్ర
తనయుతలఁ గొంచుఁదత్సుతుల్ చనిరి గరుడ, వర్జితంబైనబకదాల్భ్యవనమునకును.

## నాగకుమారులచే నపహరింపఁబడిన యర్జునుతల గానక చిత్రాంగదాదులు శోకించుట.

వ. అప్పుడు. 111
క. అదరి యులూచియుఁ జిత్రాం, గదయును గాండీవిశిరముఁ గానక కలయన్
వెదకి వదనోదరము లద, వదలుగఁ దాఁటించుకొనుచు వసుధం బొరలన్. 112
వ. తత్కోలాహలంబు బభ్రువాహనుం డాలకించి. 113
క. అరుదెంచి శక్రసూనుని, శిరము వెదకి కానలేక చెందినమూర్ఛన్
ధర వ్రాలె నచటఁ గుంతియుఁ, గపురి నారాత్రి కీడుకల గని భీతిన్. 114
క. విన్ననయి ధర్మజాచ్యుతు, లున్నెడ కరుదెంచి యదుకులోత్తంసునకున్
విన్నపము చేసె మునుకుచుఁ, గన్నులఁ గ్రొవ్వేఁడిబాష్పకణములు రాలన్. 115
తే. కంసమర్దన నేఁడు నాకలఁ గిరీటి, తైలదీర్ఘిక మునిఁగి గాత్రమున గోమ
యం బలందుక రక్తమాల్యములు దాల్చి,యరిగె ఖరవాహనము నెక్కి యామ్యదిశకు.

ఉ. జీవదరత్నవైభవముచే వృషకేతుఁడు లేచి శ్రీహరిం
దా వినుతించుచుణ్ రిపు నదల్ప ముకుందుఁడు గౌఁగిలించె గాం
డీవియు నట్లు చేసె సుతు నెమ్మిఁ గనుంగొనెఁ దల్లి వాఁడు స
ప్యాళలి వానఁ దెప్పెలుక్రియన్ గనెఁ బాండవసైన్య మత్తఱిన్. 127

చ. మొరసె నసంఖ్యశంఖరవముల్ దివిఁ బువ్వులవాన సోనగాఁ
గురిసెఁ బునఃప్రజాతసుతఁ గుంతిఁ గనుంగొను వేడ్క వాహినుల్
బెరసె మురారి పట్టి కదలింపఁ జమూపసమూహ ముబ్బుగా
వెరసెఁ బురోపకంఠసరణిం దరుణీపరిణీతలాస్యముల్. 128

ఉ. అన్నగరీజనంబు నెరయం గని వాళిగఁ జల్లురత్నసం
పన్నతయుం దదంతికమహీమక్షితిభృత్తటసీమ నోలగం
బున్నకుమారుఁ జూచి తల లూఁచి నృపుల్ గొనియాడఁ గ్రీడియున్
వెన్నుఁడు బభ్రువాహరమణీయసభాస్థలిఁ జొచ్చి యచ్చటన్. 129

క. ఘనరత్నభద్రపీఠం, బున నిరువురు నుండి రితరభూపతు లర్హా
సనులై రప్పుడు సమిత్రా, తనుఁ డగు నరుఁ జూచి భోగినాయకుఁ డనియెన్.

క. ధాత్రీశుల కర్జున స, ర్వత్ర జయముఁ బుత్త్రిచేఁ బరాభవముఁ గనం
బాత్రము భవదీయసుత, క్షాత్ర మెఱిఁగి మెచ్చ కిటు దగదు లజ్జింపన్. 131

వ. అదియునుం గాక నీకు గంగాశాపనిమిత్తంబున నిట్టివిపత్తు సంభవించె చిత్తంబున
నుత్తలంబు నొందక ముకుందునికరుణావిశేషంబునం జెందినభవన్నందను సకల
రాజ్యభోగంబులు ననుభవింపుము నీకళత్రంబు లైనచిత్రాంగదాభుజంగరాజ
పుత్త్రికల హృజ్జనితశోకంబు లుజ్జగింప బుజ్జగింపుము లజ్జితుం డైనబభ్రువాహను
నుపగూహనంబున నాదరింపు మని వారిజోదరుం గనుంగొని. 132

సీ. దేవ కవ్వడినొప్పి దీఱ బోధింపు మిత్తఱి దేవకీయశోదలును గుంతి
యును దండ్రిబిడ్డల నొద్దిక సేయంగ వలయు వీరుఁడు బభ్రువాహనుండు
విష్ణుభక్తుని దయాన్వితుని భాతృవత్సలును నూర్జితయశోధనుని నాత్మ
జనకుని మార్కొన్న పెనుపాతకము వాయఁ బ్రాచితంబుగఁ దుషాగాచలంబు
తే. దండఁ దనమేను విడువంగఁ దమకపడెను, ననినఁ జిత్రాంగదాతనూజునిమనంబు
తెంపుఁ గనుఁగొని యది నివారింపఁ దలఁచి, పవనజుఁడు పల్కె గంభీరభాషణముల.

తే. గురుఁ బితామహుఁ దోఁబుట్టుగులవధించి, దురితములఁ జెందమి యచ్యుతుని భజించి
కలుషమతి వైననిన్ను డగ్గఱనె శౌరి, జీవపితవీవు వెఱయంగఁ బావనుఁడవు. 134

క. విను నాలవయుగమున నీ, తని నామస్మరణమునఁ గదా మర్త్యులు పా
వను లైరి కృష్ణుఁ గొలిచిన, మనుజులకు భయశోకదైన్యమున్నత గలదే. 135

క. అని పెక్కుచందములఁ బా, వని దెలిపిన నపుడు బభ్రువాహనుఁడు మనం
బున సెగులు విడువ నందఱుఁ, గొనియాడిరి విజయపుత్త్రగుణకథనంబుల్. 136

క. నానావిధభోగంబుల, నేనుదినము లుండి లేక హేలమణిపురిఁ
దానములచేత బహువిధ, గానంబులచేతఁ గౌతుకము రెట్టింపన్. 137

క. ఆసమయంబునఁ గృష్ణుఁడు, వాసవితో ననియె నిట భవత్సూనుని యా
వాసమున సుఖింప సునా, యాసంబుగ నేఁగ వరుస నైదుదినంబుల్. 138

క. మత్తల్లుల నీదేవుల, ననిలతనూభవునిఁ గూర్చి యగ్రము లగు నీ
ధనకనకవస్తురాసులఁ, బనుపఁదగు నజాతశత్రుపట్టణమునకున్. 139

క. వీరలు ధర్మజుయజ్ఞ, ప్రారంభము జరపెదరు తురగరక్షకు నీ
భూరమణులు భవదీయసు,మారులు రావలయుఁ గదలి మనబడి ననుచున్. 140

ఉ. దేవకి మున్నుగాఁగలసతీనివహంబు ధనంబుఁ గూర్చి య
ప్పావనివెంట నంపుటయుఁ బన్నగరాజును బభ్రువాహన
క్ష్మావరుచేతిపూజ బహుమానముగాఁ గొని సంతసిల్లి ల
క్ష్మీవరుఁ దంప భోగవతికిం జనియెన్ బరమానురక్తుఁడై. 141

క. అనవరతము నీకృష్ణా, ర్జునయుతసంజీవకథ వరుస నాకర్ణిం
చిన వ్రాసినఁ బాతము చే, సిన ధర నపమృత్యుభయముఁ జెందరు మర్త్యుల్. 142

క. జనమేజయ విను గోవిం, దునియనుమతి విడువఁబడినతురగము నానా
జనపదములు గడచి క్రమం, బున బర్హిధ్వజునిరత్నపురమున కరుగన్. 143

క. త్రోవ మయూరధ్వజవసు, ధావరు క్రతుహయముఁ బుత్త్రి తామ్రధ్వజునిం
గావలిగా నిడి విడిచిన, ద్వైవికముగ రెండు నెదురుతాఁకై నిలువన్. 144

ఉ. అమ్మఖవాజిఁ బాండుతనయాధ్వరవాహ మెదిర్చి మోముమో
వ మ్మొసి వెట్టి హేషితరవమ్మున వక్షముఁ బూర్వపత్త్రరా
గమ్మున ద్రేయ ఁటసి యది కందము వట్టి విదల్పఁ దోన మి
త్రమ్మయి కేలికిం గడఁగి దంతములన్ గళ మప్పళింపఁగన్. 145

క. తామ్రధ్వజభూవరుఁ డా, తామ్రనయనుఁ డగుచుఁ గనలి తంత్రాధిపు నీ
సామ్రాణి యెవరి దన విని, నమ్రుఁ డగుచు లీలఁ గదలి నకులధ్వజుఁడున్. 146

## నకులధ్వజుఁడు పాండవహయంబుఁ బట్టుట.

ఆ. చాళింపమందఁ జతురంగబలముల, సొరిది వేడె వెట్టి చుంచు బిగియఁ
బట్టి చదివె నొసలిపట్టికమ్మీఁదఁ గ, న్పట్టి మెఱయు బిరుదపద్య మపుడు, 147

ఉ. దుర్జయరాజమండలవిధుంతుదమూర్తి యుధిష్ఠిరక్రతూ
త్సర్జిత మైనయీహయవతంసము ద్రిమ్మర సంగరక్షగా
నర్జునుఁ డేగుదెంచె నిటలాక్షుని గెల్చినజోదువిక్రమో
పార్జితలీలఁ బట్టుఁడు రయంబున శూరులు ధాత్రిఁ గల్గినన్. 148

క. అది విని నృపసూనుం డను, నదనఁ గ్రతువు లేదు జరపె నధిపతి మును నేఁ
డిది దొరకుటచే నెనిమిద, నదియును సిద్ధించె ననుచు హరిఁ బట్టింతున్. 149

క. రేయి సురవహ్ని చెప్పెన్, బ్రాయఃపౌరుషులు లేరు పాండవసేనన్
బ్రాయి గలమగలు నరరా, ధేయసుతులుదక్క ననుచుఁ దెలియఁగ నాకున్.

మ. నరనారాయణు లర్జునాచ్యుతులు జన్యం బబ్బెడిం గావుఁ డీ
హరి నన్నుం దళవాయి నీబలములో నాసేన గానంగరా
దరయన్ శూరుఁడు బభ్రువాహనుఁడు గాఁడా పెట్టుముక్తామణుల్
పురినంతఃపురిఁ జూపుకేళికలశుం బుష్పాంజలుల్ సేయఁగన్. 152

## కృష్ణార్జునులు తామ్రధ్వజునితోఁ బోరుట.

క. ఆహవ మొనరింపఁగ నిఁక, సాహసు లం దెవ్వ రనుచు సైన్యాధీశుం
డాహయము నర్ధచంద్ర, వ్యూహంబునఁ బదిలపఱచె నొడయనియాజ్ఞన్. 152

ఆ. తామ్రకేతుఁ డనిఁ బ్రతాపించి మార్కొన్న, శౌరి పలికె సవ్యసాచిఁ జూచి
వీరయోధకు లని కారణంబున కెల్ల, కారణంబు దప్ప దీరణంబు. 153

క. వారు లయాంతకనిభులు మ, హారథు లని కార్ష్ణిఁ బిలిచి యుస్మద్బలమున్
బోరికి గృధ్రవ్యూహము, గా రచియింపు మన నట్లు కాఁ జేయుటయున్. 154

వ. వారిజోదరుండును దారకప్రేరితం బైనతేరెక్కి మిక్కుటం బగురవంబుల దిక్కు డుంగంబులు ప్రక్కలింప నొక్కమొగిఁ బాంచజన్యంబు పూరించె నమ్మహావ్యూహంబునకు ననుసాల్వుండు కంధరంబును హంసధ్వజుం డీక్షణంబులును ప్రద్యుమ్నానిరుద్ధులు పక్షంబులును భోజవర్ధనుం డైనకైనేయుండు చరణమధ్యంబును చంచువు చిత్రాంగదాపుత్రచిత్రభానుపౌత్రులును నపరిమితసేనాసమేతుం డైన కపికేతనుం డుదరంబును తదీయరక్ష యౌవనాశ్వమేఘవర్ణునుగా నెదిర్చినంగనుం గొని తామ్రధ్వజుండు గరుడధ్వజున కిట్లనియె. 155

క. శూరత నను నెదిరించితి, పోరికి దివ్యాయుధములు పూని నిజముగాఁ
బౌరుషము గలిగె నేసియు, నారాయణ పట్టవలదె నాహరి ననుచున్. 156

మ. అలుకం గన్నులు విస్ఫులింగములఁ గ్రాయం దామ్ర కేతుక్షమా
తలనాథుండు శతాంగముం దతిమి పార్థవ్యూహరక్షంబులన్

బలి చల్లెన్ నెలవంకబాణముల దృప్యద్దాక్షిణీహస్తాలిక్ష్వ
ద్దళితజ్యారవఘూర్ణితాఖిలదిశాకాశావకాశంబుగన్. 158

సీ. కంసారి నేడంబకంబుల స్రుక్కించి యేనింట సూతుని నేపడంచి
తేరివాజుల నాల్గునారాచములఁ ద్రుంచి త్రిదశేంద్రజుని డెబ్బదిటఁ గలంచి
శైనేయు తొమ్మిదిశరముల సొరిగించి కృతవర్మ నిరునాలుగింట నొంచి
ప్రద్యుమ్ను వేయిమార్గణములఁ దూలించి శతసహస్రములఁ దత్సుతుని ముంచి

తే. యంతఁ దనియక మదిఁ జాల నాగ్రహించి, మఱియుఁదక్కినయోధులమదమడంచి
పగటిసూర్యునిగతి ప్రతాపమునమించి, సింహనాదంబు గావించెఁ జెంగలించి. 158

వ. అప్పుడు. 159

క. తనతనువున నంతట గిఱి, కొనినశరవ్రజము దుల్చుకొని యుద్ధతుఁడై
యనిరుద్ధుఁ డెదిరివీరుల, ననిరుద్ధులఁ జేసి భీషణాశుగనిహతిన్. 160

క. గ్రమ్మన నెత్తురు లేఱులు, గ్రమ్మ నఖండప్రచండకాలానలకీ
లమ్ములఁ దెగడు మెఱుఁగువా, లమ్ముల నక్షౌహిణీత్రయము మడియించెన్. 161

క. ఆయదువీరుఁడు మఱి విలు, ద్రోయిం చరిఁ జూచి తురగమును విడు లేదా
నాయెదుర బంటవై నిలు, మాయోధనమునకు నన్న నతఁ డరనగుచున్. 162

క. అలరువిలుకానికొడుకవు, బలివారఁడె నాఁడె పట్టి బాణుఁ డుమామం
గళసూత్రవైభవము నీ, తల గాచెం గాక నాకు దయలే దనినన్. 163

చ. కటువుగ నల్గి బాడబసఖం బగుక్రొవ్విశిఖం బడర్చి హృ
త్పుటముఁ బగిల్చి తొమ్మిదిటఁ దొట్టినక్రొవ్వుఁ గదల్చి సూతు నొ
క్కటఁ దల డుల్చి తేరితురగంబుల నాల్గిటఁ గూల్చి యార్చినన్
దటుకున వాలుఁ గేడెమును దాల్చి సుచిత్రుఁ డదల్చి నిల్చినన్. 164

క. అరిగయుఁ గృపాణియును నతఁ, డురవడిఁగొని రథము డిగ్గనుఱికి నపు డ
య్యురువురు సింగపుఁగొదమల, కరణి విజృంభించి తాఁకి ఖడ్గాఖడ్గిన్. 165

క. లాసియుఁ బొడిచియుఁ దట్టియు, వేసియు నొడ్డించుకొనియు విసరియు మిగులం
డాసియు నొక్కటఁ గయ్యము, చేసిరి నిజసాధనములు చిద్రుపలు గాఁగన్. 166

క. జేగురుఁ గోరాడినమద, నాగంబులరీతి మార్గణవ్రణజాస్ర
గ్రాగములఁ దొప్ప దోఁగియు, లాగమునకుఁ బొచ్చియచ్చలంబునఁ బెనఁగన్.

క. దగదొట్టి శౌరిమనుమఁడు, జగతిం బడి మిగులఁ బరవశత నొంద దిరల్
వగులఁగ నార్చి సుచిత్రుం, డగలిచెఁ బ్రద్యుమ్ను వక్షమైద స్త్రములన్. 168

ఆ. అప్పుడు కర్ణసూనుఁ డాసుచిత్రుని మేన, శరము లాఱు గ్రుచ్చి విరథుఁ జేయఁ
దెమల కాతఁ డొండుతే రెక్కి పిలుగుణ,ధ్వని యొనర్పఁ దునిమెఁ దద్రథంబు.
క. త్రిశతశతాంగము లీరీ,తి శకలములు సేయ వేఱుతే రెక్కి నిగు
డ్చుశరాలిఁ గర్ణజుని దు, ర్దశఁ బెట్టెను వ్యాధిగణముతనువును బోలెన్. 170
వ. మఱియును. 171
క. అనుసాల్వ నైదిటను యా, వనాశ్వ నొక్కటను బోజపరు రెంట నొగి
ల్చిన సాత్యకి మార్కొని య, జ్జనపతిరథ్యములఁ దునిమి శంఖం బొత్తెన్. 172
శా. ఆనారాచము మున్న సాత్యకియురం బాడన్ సుచిత్రుండు నా
నానారాచపరంపరన్ వెగడు నందం జేయ మూర్ఛావశుం
డై నిల్వంబడి లోచనంబు లరమూయుం దోన చిత్రాంగదా
సూనుం డేసుశరంబు లేయ నవియుం జూర్ణంబుగాఁ జేయుచున్. 173
చ. చిఱునగ నొప్ప నిట్లను సుచిత్రుఁడు నీవిపు డింతలోపలన్
మఱచితె బభ్రువాహనుఁడ మాకు నుపాయన మిచ్చుముత్యము
ల్పతికలఁ దెచ్చు టంచు నదలించి శిలీముఖవృష్టి ముంచి క్రే
ళ్లుఱికి సురాళికేతను మహోగ్రశరంబులఁ దూల నేసినన్. 174

## సుచిత్రార్జునుల ద్వంద్వయుద్ధము.

వ. అప్పు డప్పాండవసైనికులకాండతాండవోద్దండఖండపరశుండును బోలె విహరించుతామ్రధ్వజుం గనుంగొని గతప్రాణులై పదలుకృపాణబాణాసనాదిసాధనంబులు వీరయోధయూథపతురంగమాతంగంబులం దొరఁగురుధిరప్రవాహంబులకు జలగ్రాహంబుల యొఱవు గఱప నాలంబునకు నూలుకొనక వరునిపాలికిం జని గోత్రవధపాతకనివారణార్థం బశ్వమేధంబు సేయ సమకట్టి మమ్మెల్ల వీని గోతియలం జేసి యిందు నేఫలంబు గట్టుకొంటి వని ముట్టనాడినం గ్రీడి యోడకుండుఁ డని వారి నూఱడించి తేరు వైరిసమ్ముఖంబు చేయించి సాయకనికాయంబుల నతని కాయంబు గాయంబుగా జేసి విరథునిం జేసిన రోసి యతండు వేఱొండురథం బెక్కి యింక నెక్కడవోయెదు దీసవనసైంధవంబుతోడన బంధించుగొని నిన్నుఁగొని పోయెదనని వసుంధరాధరంబుపైఁ గంధరంబులు వర్షించుచందంబున సంక్రందననందనునిమీఁద నందంద విశిఖబృందంబుఁ గ్రందుకొల్పిన శరవేగంబున నతం డాజిరంగంబునకు యోజనంబు దక్షిణంబున కరిగి యాక్షణంబ తిరిగి నిజబలంబుల సమయించువ్వీరునిం దెరితోన తారాపథంబున కెగయు ఘోరనారాచంబులు వఱపి దేవదత్తం బొత్తె నిత్తెఱంగున నెత్తినచలంబున నేదహోరాత్రంబులు చిత్రవిధంబునం బోరినం బోరు ఘోరం బయ్యె నయ్యవసరంబున. 175

క. నరుచే సుచిత్రుఁ డెక్కుఁడు,నరదము లిరువేయిజమిలియక్షౌహిణియున్
ధరఁ బడియె నల్ల పోరం, దరజలములు నట్లు మడసెఁ దామ్రధ్వజుచేన్. 176
చ. పలలము సాళువంబు గొనుభంగి సుచిత్రుడు క్రీడిఁ దేరితో
నలమి వియత్తలంబు గదియన్ రభసంబున వాఁటి సంగర
స్థలిఁ జదియంగ వైవ నిజసైన్యము కవ్వడి చచ్చెఁ జచ్చె సం
చలఁగ మురారి గ్రక్కునఁ గరాబ్జమునన్ బడకుండఁ బట్టినన్. 177
క. కలుషించి తామ్రకేతుఁడు, పలికె గదాధరునిఁ జూచి పాండవులతో న
చ్ఛలమునఁ బోరఁగ దొమ్మికిఁ, దలపడితివి నీకు వీరధర్మమె యనుచున్. 178
క. అదిరిపడి వింట భాస్వ, త్ప్రదరము సంధింప శౌరి తామ్రధ్వజునిన్
గదిసి వడి నురముఁ దన్నుచు, గదఁ గొని మస్తకముగాతు కలఁగఁగ నడిచెన్. 179
క. అందుఁ జలింపక చటుల, స్యందనముం దఱిమి పాండుసైన్యవరుల నిం
దంద పరిమార్ప నపుడు ముకుందుఁడు గాండీవిఁ జేరుకొని యిట్లనియెన్. 180

## తామ్రకేతునితో నర్జునుఁడు పోరుట.

చ. దళములు వీనిఁ గన్గొని యథాయథ లయ్యె మరాళకేతనా
దులు సమరస్థలిం బడి రెదుర్కొని నీవును నేను వీనితో
దలపడి పోరనున్న బని తప్పు నిజం బని శార్ఙ్గి శింజినీ
కలకలముల్ గిరీటికరగాండివరావము నెచ్చరింపఁగన్. 181
క. బరవసముగ శరవసరము, గురియఁగ నవి దునిమి సరకు గొనక సుచిత్రుం
డిరువురవిలునారులు ని, ష్ఠురగతిఁ దెగ నేయ నింద్రజుఁ డుపేంద్రునితోన్. 182
క. ఇన్నిచునక్తై దేవర, పన్ని పెనఁగ నేల దీన పరిమార్తు ననున్
మన్నించి సారథివి గ, మ్మన్న హరియు నియ్యకొని శతాంగము దఱిమెన్. 183
క. అలిగి సుచిత్రుఁడు పదితూ, పులఁ గృష్ణుని నొంచి పాండుపుత్త్రవరద మ
మ్ముల ముంచి గొడుగుఁ ద్రుంచిన, బలభిత్సుతుఁ డతని తేరు భగ్నము చేసెన్. 184
క. అరదము రూపఱిన మద, ద్విరదము వెస నెక్కి విశిఖవితతి వఱపఁ ద
ద్గురుదనిలాహత జిఱజిఱ, హరిహయసుతురథము దిరిగె నాసమయమునన్. 185
క. తమమూర్ఛ లుడిగి కార్ష్ణి, ప్రముఖు లతని నిశితశరపరంపర నొంపన్
దెమలక సుచిత్రుఁ డతివి, క్రమమున, దద్వీరవరుల గలనం గూల్చెన్. 186
క. అందులకుఁ జాల నలిగి ము, కుందుఁడు చక్రంబు కేలఁ గొని పాండుసుత
స్యందనము డిగ్గ నుఱుక ర, వీందుగ్రహతారకములు నిలయుఁ జలించెన్. 187
శా. మాయూరధ్వజి శౌరిఁ జూ నగిచి రమ్మా కృష్ణ మున్నాజిఁ గాం
తేయుం గావఁగఁబూని నీసుకృతము న్వెచ్చించి తిచ్చోట నీ

కాయంబున్ దెగనిమ్ము నాయెదురఁ జక్రం బెత్తితే చూడు వా
లాయంబు న్నిన్నుఁ గ్రీడి నిప్పు డవలీలం గట్టి కొంపోయెదన్. 188

క. అని కరి డిగ్గ నురికి కృ, ష్ణుని చక్రము కేలువట్టి నులి వెట్టఁగ
ర్జునుఁ డచ్యుతుపనుపున నా, తని నూఱస్త్రముల నొంపఁ దామ్రధ్వజుఁడున్. 189

## తామ్రధ్వజుఁడు కృష్ణార్జునుల జయించి హయంబుఁ గొని పురంబునకుఁ బోవుట.

క. లెక్కఁగొనక నరుఁ గృష్ణుని, నుక్కణఁగ విరిగించి మూర్ఛ నొందించి ధరన్
ద్రొక్కఁదల వైచి హయము, న్నెక్కఁ గొనిపోయి జనకునిం గని మ్రొక్కన్.

క. మ్రొక్కినఁ గని నకులధ్వజు, డిక్కగ నుంగొనిన వాసుదేవార్జునులన్
ద్రుక్కించి హయము దెచ్చిన, యక్కథ వినిపించె నృపతి కాతఁడు తెలియన్.

క. విని కన్నులఁ గెంపొదవఁగఁ, దనయుని వీక్షించి సమరతలమునఁ గృష్ణా
ర్జునుల నటు డించి తురగముఁ, గొనివత్తురె యింతపడుచు గొడుకవు గలవే. 192

చ. క్రతుఫలదాత లైనవారిఁ గయ్యములోనఁ బరిత్యజించి శూ
రతఁ గొనివచ్చి తీమఖతురంగము నెవ్వరిఁగూర్చి చేయు నీ
క్రతు వికఁ సంచుఁ దానుఁ గులకాంతయుఁ గూడి మయూరకేతుఁ డీ
గతి వెతఁ బొందఁ బ్రొద్దు మసకంబడె సంతటఁ బాండుసైనికుల్. 193

ఉ. బన్నపుమావుఁ గానని విచారపుమోములఁ బంకజంబుల
న్వన్నియ దాఱిమార్గణగణవ్రణజాస్రము సంధ్య వెంపు సం
పన్నతమీఱ నిద్రయుఁ దమంబుఁ గ్రమంబునఁ జేర మోదుపుం
గన్నులఁ గైరవంబులవికాసము దేఱఁగ మూర్ఛ దేలుచున్. 194

క. వారిఁ జూచి నరుఁడు మనలో, దురము సలిపినతఁడు సవనతురగముఁ గొని యే
తెరువునఁ జనె నా కెఱిఁగిం, పు రణంబున గెల్చి వాహముం దెత్తు ననన్. 195

ఆ. వీరి నిపుడు బర్హికేతుఁ డేలెడురత్న, పురికిఁ గొనుచు నతనిపుత్త్రుఁ డరిగె
వాని తెగువఁ జూచె దేని నా వెంట ర, మ్మనుచుఁ బురము చెంత మొసల నునిచి.

## కృష్ణార్జునులు మాయావిప్రరూపంబుల మణిపురంబు ప్రవేశించుట.

సీ. కటిఁ బ్రాతముతుక నీర్కావిదోవతిపంచె భ్రూమధ్యమున నూర్ధ్వపుండ్రకంబు
వక్షస్స్థలమునఁ బద్మాక్షమాలిక కర్ణబిలమున నులివాడుతొలసి యెన్ను
నంసభాగంబున నాయవారపుసంచి దోర్మూలమున నిత్తితోలు పజ్జ
పుడిశరంబున నలుగుడు వేణుదండంబు, గూనివీఁపునఁ జింపిగొడుగుఁ దడక

తే. తనకునలవడవృద్ధవిప్రునివిధంబు, దాల్చుటయుఁగూర్మిసఖుఁడు సుత్రామసుతుఁడు
బ్రహ్మగారియై తనవెంట రా మురారి, రత్ననగరంబు సొచ్చి పూర్వత్రియామ.

క. పరిమళధూపము జాలక, సరణిఁ బిసాళింప సంతసముతోడుత న
వ్వరనాయకు లిరువురుఁ, జరియింపఁగఁ జంద్రకాంతసౌధము లందున్. 198

చ. సురతసుఖంబులన్ మిగులఁ జొక్కుచు నొక్కవిటుండు కాంత నీ
కురులకుఁ గృష్ణవర్ణమును గుంకుమగుబ్బల కచ్యుతత్వమున్
దొరకె నన న్నిజేశుకరతో యురుహంబుఁ దెమల్చి నిన్ను నీ
కరముల శంఖచక్రములుగా పురుషోత్తముఁ జేసె నావుడున్. 199

క. సరసిజలోచనుఁ డిట్లను, హరిహయసుతుతోడఁ జూడు మాశ్చర్యం బీ
పురజనముభక్తి సురతపు, సరసతలను మానుకప్రశంసలె యెపుడున్. 200

క. తలఁపులు హరిచింతనములు, పలుకులు హరికీర్తనానుభవములు పనిపా
టులు హరికృత్యంబులు భూ, తలవైకుంఠంబు పొగడఁదగు నిది యనుచున్. 201

ఉ. కౌతుకతోడ నన్నగరవీథుల నీగతి సంచరించుచున్
గ్రీడియుఁ దాను వేకువతటిన్ జని నర్మదలోన మజ్జనం
బాడి గమించి చొచ్చెను దదంతికరాజమరాళకూజితా
మ్రేడితకింకిణీరవపరివృతఘోషము యజ్ఞవాటమున్. 202

క. చొచ్చి తదాస్థానమహిమ, కచ్చెరు వందుచు వియచ్చరాహ్వానోద్గా
త్రుచ్చరితసామమంత్రము, ఖోచ్చధ్వను లంతరిక్షమూటాడింపన్. 203

మ. క్రతుదీక్షాపరు విశ్వభూవలయసమ్రాణ్మౌళి మాణిక్య భూ
షితపాదాంబుజు ఋత్విగావృతుఁ గుశాసీనున్ వధూసంయుతున్
గితవబ్రాహ్మణు లిద్దఱుం గదిసి కెంగే లెత్తి బర్హిధ్వజ
క్షితి నాథోత్తమ భద్రమ స్తనుచు నాశీర్వాదముం జేసినన్. 204

క. ఆనరనాథుఁడు ప్రత్యు, త్థానం బొనరించి మ్రొక్కి ధరణీసుర ము
న్నే నతి గావింపక మును,పే నను దీవించుటిది శపించుట గాదే. 205

క. ఎందుండి యరుగుదెంచితి, రిందుల కేఁ జేయుసేవ యెద్ది యన మహీ
బృందారకుండు పరమా, నందహృదయుఁ డగుచు ధరణినాథునితోడన్. 206

క. భూవల్లభ కార్యార్థుల, మై వచ్చుటఁ జేసి మాకు నాశీర్వాదం
బీవలసె నమస్కారము, గావింపకమున్న యొగ్గుగా దిది యనినన్. 207

క. జనవరుఁడు పురాణములం, దనఘా 'యభ్యాగతస్స్వయంవిష్ణు' వనా
వినఁబడు నినుఁ జూచిన నా, జనార్దన నిఁ జూచినట్లు సంతస మయ్యెన్. 208

క. కొంచక వేఁడుము తగ న, ర్పించెద నిపు డెద్ది నీయభీష్టము నాకున్
గించిత్తయిన మనోధన, వంచన మిచ్చోటు లే దవశ్యం బనినన్. 209

సీ. భూపాల విను ధర్మపురినుండి కృష్ణశర్మాభిధానుఁడ మదీయాత్మజుని వి
వాహంబునకు నీపురోహితుండు సుశీలు నింటఁ గన్నియ గల్గుటెఱిఁగి యడుగఁ
బయనమై వచ్చుచో భయదాటవీమధ్యసీమ నాఁకలి గొన్న సింహ మొకటి
కలిసి పుత్త్రుని ఘోటకముఁగూడఁ బట్టిన విడిపింప నా కొండు వెరవు లేక
తే. చింతతో 'నటవాం నారసింహ' యనుచు, నూటయొనిమిదిమాఱు లెన్నుకొని వరుస
వలఁతఁగుత్తుక యొండఁగా నవ్విభుండు, కరుణఁ బ్రత్యక్షమై నన్నుఁ గానఁ డయ్యె.

వ. ఇవ్విధంబున మహావ్యధం బరితాపించుచున్న నన్ను రూక్షేక్షణంబుల నిరీక్షించుచు హర్యక్షంబు వాలవిక్షేపణంబులం దధిక్షేపించి పుత్త్రిగాత్రింబు నఖరదంష్ట్రాంకురంబుల నప్పళించుచు మనుష్యభాషణంబుల గద్దించుచు నన్ను నుద్దేశించి నాచేఁ బడిన జంతువుం గృతాంతునంతవానికైన బలవంతంబున విడిపింప నీఁతబంటి శిష్యుండును నీవు నింటికిం జనుం డని నిరాశంబుగాఁ బలికినఁ గ్లేశంబున నా శిశువుం బాసి పోవంజాలక బాలకవిహీనులకు మానవులకు నార్ధ్వదైహికంబులు లేవు గావున నీవు మచ్ఛరీరంబు కబళంబు గొని సుతశరీరంబు విడువు మనిన విని యక్కంఠీరవం బంకుశాకారవంబున మావంటిదుష్టజంతువు లాసన్నమృత్యువు నకు మూలభృత్యు లగుటం జేసి యిట్టిగతాయుఃప్రాణులం గాని మీవంటి దీర్ఘాయుఃప్రాణులం బట్టము పట్టికొంటికింత పట్టి పెనంగి వట్టిదురవస్థలం బొరలక మరలు మనిన మత్కృతంబు లగుసుకృతంబు లర్పించెద నెప్పాట నిప్పాపని నొప్పింపక నాకు నొప్పింపవే యనిన నీయాకొనక నీయెడ నాకు నయ్యెడు ప్రయోజనంబు లెయ్యవియు లేవు మయూరధ్వజునివలనం గాని యనియె నది నీ నంగీకరించెద నని నెఱింగించెద ననిన భూసురోత్తమునకు రాజసత్తముం డిట్లనియె. 211

క. ఆకేసరి నరకేసరి, గాకున్న మదీయదేశకాననగిరులన్
భీకరహరిదర్వీకర, సూకరనికరముల కెట్లు సుడియఁగ వచ్చున్. 212

క. అడిగినపదార్థ మెల్లను, దడయక నీ కిత్తు నని మొదల నాడితి నా
వొడువు వృథ గాదు తలసిన, నడుగుము నీ వన్న భూసురాగ్రణి విభుతోన్. 213

క. నీయెడ మముబోంట్లకు నే, లా యేసంశయము 'దుర్బలస్య బలం రా
జా' యని పలుకువిశిష్ట, న్యాయము గలుగుట మదార్తి హరియింపఁదగున్. 214

క. ఆసింహము నీదేహము, దా సగ మిచ్చినఁ గుమారు దండింప ననన్
గాఁపలి రాజులతనువులు, గో పిమ్మనఁదగునె పూనుకొని విప్రులకున్. 215

ఉ. నాపుడు సింహ మిట్లను మనంబున సన్నరనాథచంద్రమున్
గేవలుఁగాఁ దలంపకు మకించనరక్షణశీలుఁ డాత్మవి
ద్యావిదుఁ డుత్తమోత్తముఁ డుదారుఁడు సూనృతవాది గావునన్
నీ విటు సంశయింప కతనిం గని వేఁడు ఫలించుఁ గోరికల్. 216

క. నీతనువు ముదిసి తపముల, చేతఁ బలలశూన్యమై కృశించిన దాధా
త్రీతలపతిగాత్రము నవ, నీతసమము బహుసుఖప్రణీతం బగుటన్. 217

క. ఇది సింహభాషితము మ, న్న దశరథాత్మజుఁడు బ్రాహ్మణుని మృతశిశువుం
బ్రతికింపఁడె రామున కే, కొద నీ వెట్లయినఁ బుత్త్రకునిఁ గావు మనన్. 218

సీ. కువలయేశ్వరుఁ డియ్యకొని మంత్రిహిత పురోహితబంధుజనమహీపతులఁ జూచి
రాజున కగ్గంబు రణమునం దైన బ్రాహ్మణు నెడ నైన దేహంబు విడువ
మను శిబికర్ణజీమూతవాహనులు పరార్థము కాదె నిజశరీరములు విడిచి
రే నీమహాత్మునకై నాతనువులోన నర్ధ మిచ్చితి దీని కడ్డపడకుఁ
తే. డని సుచిత్రుని సకలరాజ్యాభిషిక్తుఁ, గాఁ బ్రతిష్ఠించి మేకలకన్యకాంబు
వులఁ గృతస్నానుఁడై దానమేలు బహుప్ర, కారములఁ జేసి విప్రపుంగవునిఁ బిలిచి.

## రాజు విప్రకార్యార్థంబు దనశరీరంబు నిచ్చుట.

క. పూతజలాక్షతములు గొని, దాత 'మదీయార్ధదేహదానేనహరిః
ప్రీతో భవ' తని భూసురు, చేత నృపతి ధారవోసి చిత్త మెల్లరన్. 220

ఉ. సత్రవితర్దికాస్థలి విశంక దృఢాసనుఁడై ముకుందు లో
కత్రియవందితున్ హృదయకంజమునం బదిలించి కేతకీ
పత్త్రములీల మాళిఁ గరపత్త్రము పూనెడునంతఁ బుణ్యచా
రిత్రి కుముద్వతీసతి యెఱింగి వడిన్ జనుదెంచి భర్తతోన్. 221

క. నీయర్ధశరీరము కా, నా యేను మదీయదేహ మర్పించి నిజం
బీయెడ నిలుపు మనిన విని,యా యవనీసురుఁడు పలికె నధిపునితోడన్. 222

క. సింగము నాతో నృపవా, మాంగము స్త్రీభాగ మది యనర్హము భుజియింప
పం గొఱగా దని నీవు, ణ్యాంగదతను విచ్ఛగింప దమ్మ్యాగ మనినన్. 223

సీ. సుతుఁ డైనతామ్రధ్వజుఁడు శాంబరీ విప్రునకు నిట్టు లనియె వందన మొనర్చి
భూసుర 'యోవైపితాసపుత్త్ర' యటంచు ననియెడుశ్రుతిరహస్యంబు వినవె
జనకునిదేహంబు సగ మేల నాశరీరము సింహమునకు సర్వంబు నిత్తుఁ
దడయ కేనును ఋణత్రయవిముక్తుండనై తండ్రి గైకొన్న సత్యంబు నెఱపి
తే. శాంతనవరాఘవులకీర్తిఁ గాంతు ననిన బ్రాహ్మణుఁడు పలుక్కమృగరాజు పలుకువినుము
రాజదేహంబుఁ దత్కళత్రింబు సుతుఁడుఁ, గోయవలె నని వది గల్ల సేయఁదగునె.

తే. అనిన దరహసితాస్యుఁడై యవ్విభుండు, సుతునిఁ దనరాణివాసంబు జూచి యట్లు
చేయుఁడని చేతి యంపమిచ్చిన సుచిత్రుఁ, డందనో డేఁ గుముద్వతి యందుకొనియె.

వ. అట్లందుకొని. 226

లయగ్రాహి.

ఆరమణియుం దనకుమారకు నదల్చి యతిదారుణతరక్రకచధార పతివాళిం
జేరిచిమడిజ్ హరిహరీరఘుపతీ యనుచు వారిరువురున్ దలుగఁగారుధిరముల్ ధా
త్రీరమణుగాత్రమున మేరుశిఖరిం దొరఁగుగైరికఝరంబులప్రకారముగ హాహా
కారములుచేసె హితనూరిజనబంధుపరివారనికరంబులు మహారవముతోడన్. 227

ఉ. ఇమ్మెయి వ్రక్కలింప ధరణీశ్వరుడా పలికంట బాష్పతో
యమ్ములు గ్రమ్మఁ గన్గొని ధరామరుఁ డిట్లను నార్తి నిచ్చుదా
నమ్మ పరిగ్రహింపఁ దగునా యనపత్యతవంక నూర్ధ్వలో
కమ్ములు లేకపోయినఁ బో కాలఁగనిమ్మని యల్గి పోవఁగన్. 228

తే. కాంత ప్రాణేశుమస్తంబుఁ గదియఁబట్టి, యకట నీదేహ మూర కిట్లయ్యెఁగాని
బ్రాహ్మణుఁడు నిన్ను లేనినెపంబు వెట్టి, యలిగిపోవుచు నున్నవాఁ డన విభుండు.

మ. అపు డావిప్రునిఁ జూచి యిట్లను మహాత్మా మచ్ఛరీరంబులో
నపసవ్యాంగము దానయోగ్య మయి సవ్యాంగంబు గాకున్న దుః
ఖపడెన్ అంపమునొప్పి నైన నిరువంకం బాష్పముల్ రావె స
త్కృప నీభాగముఁ గొమ్మనన్ విజయుఁతోఁ గృష్ణుండు ప్రత్యక్షమై. 230

## కృష్ణార్జునులు స్వస్వరూపంబులతో ప్రత్యక్షం బగుట.

శా. ఆరాజన్యునిఁ గౌఁగిలించి ధరణీశా నీవు ధన్యుండ వీ
ధీరత్వంబునకున్ వదాన్యతకుఁ బ్రీతిం బొందితిన్ బుత్త్రిసా
ధ్వీరత్నంబులతోడ నధ్వరము వీతిద్వంద్వయుక్తంబుగాఁ
బ్రారంభింపుము కర్మకర్త నయి నిర్వర్తింతు నే సర్వమున్. 231

క. పోర నెదిరి భవదీయకు, మారుం డొక్కరుఁడ గెల్చె మమునిద్దఱ నీ
వీరీతి దేహ మొసఁగితి, వేరీ మీసాటివీరవితరణగరిమన్. 232

చ. అనిన నృపాలవర్యుఁ డను యజ్ఞఫల ప్రదుఁ డైనదేవరం
గనుఁగొనఁ గల్గె నేటికి మఖం బొనరింపఁగ దప్పిగొన్న మ
ర్త్యునకు మనోహరాంబువులు గ్రోలక మంచున దాహ మాఱునే
నను బ్రహసింపవే బుధజనప్రవరోదిత వేదమంత్రముల్. 233

తే. నేర్పు దప్పి నిధానంబు నేలఁ గ్రుమ్మ, రించి కొప్పెర దెచ్చు వీఁడీవిధమున
నాకుమారుఁడు మిమ్ము జన్యమున నెఱుఁగ, లేక వాహంబుఁ దెచ్చె వివేక ముడిగి.

క. ఊహింప మర్త్యకోటికి, దేహము లస్థిరము లగుట దెలియఁగ నిక్కం
బీహరిఁ జేపట్టితి దా, శ్రీహరి నినుఁ గంటి హరిహరీ కృతి నైతిన్. 235

క. శరధిచరకమఠకిటినర, హరివామనభృగుజరామహలభృజ్జినక
ల్క్యురుచిరరూపాయ జగ, ద్భరణాయ న మోనమోస్తు భవతే యనుచున్. 236

వ. బహుప్రకారంబులం బ్రస్తుతించి సమస్తవస్తుజాతంబుల నమ్ముకుందు నానందితుం జేసి
పురందరనందనుం గౌఁగిలించి బంధుజనసమన్వితుండై నిజపురంబునకుం దోడ్కొని
పోయె నందు నగ్గోవిందుండు గాండీవికి మయూరధ్వజునిభక్తిఁ దెలుపవలసి బల
సమన్వితంబుగా దివసత్రయం బధివసించె ననిన విని జనమేజయుండు జైమినిం
గనుంగొని తరువాతివృత్తాంతం బానతీఁ జిత్తగింపు మని యడిగిన. 237

శా. పాంచాలద్రవిళాంగమాళవళకప్రాగ్జ్యోతిషక్షోణిభృ
త్పంచాస్యప్రతివర్షదత్తవివిధోపగ్రాహ్యరత్నాంశుమ
త్కాంచీవేంకటకాళహస్తినగరీకల్యాణసౌధాంచల
ప్రాంచచ్చాపసనాథశంకితశశప్రాలేయరుఙ్మండలా. 238

క. రాధాతనూజశిబిధా, రాధరకల్పద్రుఖేచరప్రకటయశో
గాధాధికరణకృతసం, ధాధికరణదానశౌండ యైవరగండా. 239

భుజంగప్రయాతము.

స్థిరశ్రీమనోహారిశృంగారగేహా, గిరీశప్రభాహాసికీర్తిప్రవాహా
నిరూఢారిబాహాసినిర్వాపణేహా, శిరంసోగ్రవాహాధరిత్రీవరాహా. 240

గద్యము.

ఇది భారతీతీర్థ శ్రీచరణకరుణాపాత్ర గాదయామాత్యపుత్త్ర వినయవిద్యా సముద్ర
పినవీరభద్రప్రణీతం బైన జైమినిభారతంబునం దశ్వమేధపర్వంబున
సప్తమాశ్వాసము.



శ్రీ

# జైమినిభారతము.

## అశ్వమేధపర్వము, అష్టమాశ్వాసము.



లలితశ్రివణకళా

నాళీకప్రభవపావనఖచంద్రరుచి

క్షాళితపరసర పాలక

ఫాలఫలక నారసింహ పార్థివతిలకా

వ. అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రున కిట్లనియె నిత్తెఱంగున రత్ననగరంబున వాసుదేవపాండవతనూజులు వాసరత్రయంబు గడపి మఱునాఁడు సముద్ధతధ్వజినీపరంపరలతో మయూరధ్వజుండుఁ గొలిచి రా నధ్వరాశ్వంబులఁ గదలింప నవియు నానాజనపదంబు లతిక్రమించి క్రమక్రమంబున. 2

సీ. ఏరాజు పాలించు ధారణీమండలి ధర్మంబు నాల్గుపాదముల నడచుఁ
గలవరించియు బొంకుపలుక నేరనిసత్యసంధుఁ డేరాజు రాష్ట్రంబు ప్రజలు
యముఁ డిల్లఁటపుటల్లుఁడై యుండి సాక్షాత్కరించి యేరాజపుత్రిక వరించె
నేరాజు దానాంబుధారాధునీకోటి, చేత మేదిని నదీమాతృకయ్యెఁ

తే. దత్పరత "బ్రాహ్మణోమమదైవ" మనెడు, బుద్ధి నేరాజు పూజించు బుధుల నట్టి
రాజరత్నంబు వీరవర్మకుఁ బ్రధాన, పురము సారస్వతముఁ జేరఁ బోవుటయును.

క. ఈరీతి ధర్మతనయమ, యూరధ్వజముఖ్యవాహయుగళవిహారం
బారాఁ జెతెంగి తనపరి, వారము సెల విచ్చి వారువంబులఁ బట్టన్. 4

### వీరవర్మ పాండవహయంబుఁ బట్టుట.

తే. అపుడు దివ్యరథారూఢులై సులోల, కువలసులలాఖ్యు లారాజుకూర్మిసుతులు
సైన్యములతోడ నరుసేన సరకు గొనక, హరులఁ బట్టింప బభ్రువాహనుఁడు దాఁకి.

క. వాహినుల నిష్ఠురాస్త్రస,మూహములఁ దెరల్చి నపుడు ముష్టాముష్టిన్
బాహాబాహిఁ గచాకచి, నాహవ మొనరింపఁ జొచ్చె నయ్యిరువాఁగున్. 6

శా. శక్రప్రోద్భవసూతిపై దశసహస్రస్యందనాన్వీతులై
విక్రాంతిన్ నృపనందనుల్ గవిసి రవ్వేళన్ సమీకంబు ర
ద్రక్రీడన్ దఱిపింపఁ గార్ష్ణి విశిఖవ్రాతంబుచే వీతిహో
త్రక్రోడంబుఁ బడ్డచర్మముఁగతిన్ వ్రగ్గెన్ బలం బత్తఱిన్. 7

క. అంతకుఁడు గదిసి సేనల, నంతముఁ బొందింపఁ గ్రీడి యచ్చెరువడి కం
సాంతక చూడుము వీఁడు దు,రంతపరాక్రముఁడు మర్త్యుఁ డనరా దనినన్. 8

ఆ. జముఁడు వీరవర్మజామాత నృపతికూఁ,తురు సుమాలినీవధూటిమగఁడు
రాజుచేత నితఁడు ప్రార్థితుండై పాసి, చనఁడు తద్విధంబు వినుము తెలియ. 9

ఆ. వీరవర్మవరకుమారి సుమాలిని, పెండ్లి కెదుగఁ దండ్రి బిడ్డఁ జూచి
తల్లియేనృపాలతనయుఁడు నీకోర్కి, యనిన వరులమీఁద మనసు లేక 10

## కృష్ణుఁడు విజయునకు యమునివృత్తాంతంబు చెప్పుట.

చ. జనులకు నెల్లఁ జావు సహజంబు నరుల్ వరియించి వానితో
ననుగమనం బొనర్చి తుది నంతకుచేఁ బడి పాపకర్మసం
జనితఫలంబు లంది బహుజన్మములం బడుకంటె కాలునిం
బెనిమిటిఁగా వరింతు నది మిక్కిలిధర్మము నాకు నావుడున్. 11

చ. అలరి సుమాలినీతనయ కంతకుపైఁ దలఁ పంత కంతకున్
బలియు డెఱింగి నిచ్చలు నుపాసనకై యమసూక్తముల్ విని
శ్చలతఁ బఠింపఁ దత్సుతయు సంతతమున్ జముఁ గూర్చి నేమముల్
సలుపఁగ నారదుం డెఱిఁగి సంయమనీపతిఁ గాంచి యిట్లనున్. 12

క. చిత్రపురి వీరవర్మని, పుత్త్రి సుమాలిని విలాసభూమి కమలినీ
మిత్రతనూభవ నీకుఁ గ,ళత్రము గావలదె యాలలన యని మఱియున్. 13

ఉ. ఆసతి పుణ్యశీల హరిణాయతలోచన నిన్నుఁ బొంద నా
సాసలఁ జేయుదానము లనంతము లింతిఁ బరిగ్రహించినన్
నీసవ తెవ్వ రన్నను మునీ భవదాజ్ఞ యలంఘనీయమం
చాసమవర్తి నవ్వి చతురాస్యతనూభవుతోడ నిట్లనున్. 14

తే. నీవు ముందఱ నెఱిఁగింపు నృపతి కేను, గదలి వైశాఖశుక్లపక్షమున వత్తు
ననినఁ జని నారదుఁడు చెప్ప నచట వీరవర్మ సంభ్రమపడియె వైవస్వతుఁడును.

క. దళవాయి రాజయక్ష్మం, బిలిచి మనము చిత్రపురికిఁ బెండ్లికిఁ బోవన్
వలె నీబలఁగము నీవుఁ గదలి రమ్మని పలుక నులికి తత్సభలోనన్. 16

సీ. ఆమయాగ్రణిరాజయక్ష్మధాతువులు వీ డ్వడి తాఱఁ బెదవులు దడుపుకొనియె
నష్టోత్తరశతవ్రణాద్యుతుఁ డగురాజ పిటకునకును వీఁపు నెటుకు రనియెఁ
దల్లడంబునఁ బ్రదమోదరేవిధజ్వరునకు విన్నమాత్రన వెఱవేఁకి దాఁకె
నుల్ల మెల్లను బెల్లగిల్లి వింశతిరూప ధారిమేహునకు విదాహ మొదవె
తే. నచట విప్రార్చకులె కాని హంత లేమి, గుణనిధులె కాని గురుదూషకుండు లేమి
సదయులే కాని బాలహింసకుఁడు లేమిఁ, బూజకులె కాని దేవస్వభోక్త లేమి.
వ. మఱియు విశ్వాసవిపద్దానకన్యకాగమవస్వరక్ష్యభక్షణలక్షితత్రిశతభేదవిశాలుం
డగుశూలుండు చోరకానిరుద్ధపంజరస్థపక్షిమోచకులుగలుగుటం బొలయరా దని
యు వాపీకూపతటాకభేదనంబులవణిగల గ్రహణిజీర్ణజలాశయోద్ధారకులు మీఱుం
టను రా సమకూడ దనియు సాధుజనబాధాసముద్భూతం బగువాతంబు మాష
మేరుతైలవాపీదానతత్పరులు దఱచు గలుగుటం దఱియఁ గూడ దనియు భ్రూణ
హత్యాకృతాదరుఁ డగుమహోదరుం డుదకదానావధానులు చెంగలించుటం
దొంగిమాడరా దనియు దాత్మనిందాకందళితశరీరుం డగునపస్మారుండు కృష్ణధేను
దానపరులు హెచ్చుటం జొచ్చి మెలఁగరా దనియు నివ్విధంబున సకలరోగవిస
రంబులు గుసగుసలం బోవ సమవర్తి వారలం గనుంగొని. 18
క. పాపులకు నుగ్రవిగ్రహు, లై పుణ్యుల కమలమూర్తులై మీరు మహిన్
జూపట్టెద రేటికిఁ బరి, తాప మిపుడు కామరూపధరు లగుఁ డనుచున్. 19
ఉ. మోహనమూర్తి గైకొని యముండు నరాకృతి సంగతామయ
వ్యూహము గొల్వ చిత్రపురి కుత్సుకతం జని మాలినీవరా
రోహ వివాహమై నరవరుం గని నీకు నభీష్ట మెద్ది సం
దేహము లేక వేఁడు కరుణింతు ననన్ ధరణీశుఁ డిట్లనున్. 20
చ. ఇతరవరంబు లెవ్వియును నేటికి నత్యయశేళి దేవకీ
సుతుని పదారవిందములు చూపు మనన్ దయచేసి మామ చిం
తితము ఫలించు నంతకును నిల్చిన యంతకుఁ డీతఁ డాజిదీ
క్షితుఁ డయి వీరవర్మయును సేనలతో నిట వచ్చెఁ గావునన్. 21
వ. ఇత్తఱి సముత్తుంగమత్తమాతంగని పాతభయద యుద్ధంబు సిద్ధంబు గాఁగలదు నీవు
వేడుక చూడవలయు బలియు రైనబభ్రువాహనానుసాల్వకర్ణజప్రద్యుమ్న మయూ
రధ్వజానిరుద్ధాదియోధవీరుల సన్నద్ధులం జేసి పోరికిం బనుపవలయు నని పలికి
కృష్ణుండు జిష్ణురథం బారోహంబు సేయ నవ్వీరవర్మయుం గదిసి వారిజోదరుం
బేరుకొని పురందరనందనుండును నీవును మదీయశౌర్యంబును ధైర్యంబునుం గనుం
గొనుం డని పుండరీకలోచను ఖాఱునారాచంబులం గ్రీడి నేడు వాలమ్ములను

మయూరధ్వజాదుల నైదైమబాణంబులఁ గంఠగతప్రాణులం జేసిన యోసి వాసవసుతుండు నవ్వీరవర్మసుధర్మంబులు దూఱిపాఱఁ గఱకుటమ్ములు మఱపినఁ డిఱుతిసి యుకతండు తెలిపికొని మాధవధనంజయుల విశిఖపుంజంబులం జిక్కుపఱచి సజలజలధరంబుపిధంబు గర్జింప నజ్జనుండు దోర్జవంబునఁ దచ్ఛరవ్రాతంబు జర్జరీభూతంబు గావించి సారస్వతపురాధీశ్వరువక్షంబు నిశితక్షురప్రపంచకంబునం జించిన నతం డింమకేనియుం జంచలింపక విచ్చ్యు నలుపదింటు నచ్యుతాంజనేయుల సాయకశతంబుల నొంచి తేరివాజువంబులం దక్కినవీరవరులం దెరలిచి మొనతలఁ దరలం జోరల సేసినఁ బాండవసమూహంబు సమ్మోహం బయ్యె నప్పు డప్పాండుపౌత్రుండు గాండీవిం గనుంగొని. 22

ఉ. వంచన చేసి సైంధవునివాహములో శిశుపాలునట్లు న
మ్మించి రణంబునం గమలమిత్రజుతేరు ధరిత్రిఁ గ్రుంగఁ ద్రొ
క్కించి జయించిన ట్లిపుడు కృత్రిమముల్ గొనువంచు మారుతిం
బంచినఁ జేరి లో నతని బద్ధునిఁ జేసి విశాలవాలధిన్. 23

క. ద్రోణాద్రిఁ బెల్లగించిన, ప్రాణ సతనియరద మంబరంబునకు జగ
త్ప్రాణజుఁ డెత్తుక చనఁ గా, క్షోణీశ్వరుఁ డతని మొఱఁగి చూపఱు పెదరన్.

చ. రయముఁ జేరి లో నరు నురద్విషునిం దునియంగఁ బట్టి ని
ర్భయగతి సభ్రమం బతిసి పావనితో నను శౌరి పార్థులై
దయ నెడఁబాసి రా విరహతాపమునం జొరలాడులక్ష్మికిం
బ్రియముగఁ బట్టి వైచెద హరిం గలశాంబుధిశేషశయ్యపై. 25

క. విడునారథ మని హరిఁ గ, వ్వడిసిన్ వడిఁ జంక నిఱికి వాయుతనూజుం
బిడికిటఁ బొడిచిన గ్రుడ్డులఁ, బిఱుకఁ గడసి కాలుచెయ్యి మెదలుప కున్నన్.

వీరవర్మ కృష్ణుని తనపురంబునకు దోడ్కొని పోవుట.

క. అప్పుడు మధుమథనుండు వా, తప్పక నవ్వీరవర్మతల పాదమునన్
గుప్పునఁ దన్నిన ధరఁ బడి, తెప్పిఱి కృష్ణార్జునులఁ గదిసి యిట్లనియెన్. 27

సీ. బవరాన దేవదానవుల కైనను నవి జేయుండ మును విశేషించి యిపుడు
కృష్ణునిపాదపంకేరుహంబు శిరంబుఁ జెందెఁ గావునఁ జిరంజీవి నైతి
ననుటయుఁ బ్రీతుఁడై యచ్యుతుండు కిరీటి తోడ నిట్లను వీఁడు దుర్జయుండు
సత్త్వసంపన్నుఁ డక్షయదివ్యమార్గణ, కృతహస్తుఁడు మయూరకేతుముఖ్య

తే. యోధుల జయించె మద్భక్తియుక్తుఁ డనిన, నరుఁడుగొనియాడె నమ్మహీ వరుఁడువారి
కిట్టు లను ముజ్జగములు మీ కెమరుగావు, మిమ్ము గెలువంగ నేనెంత మేటినను చు.

క. విశ్లెక్కడించి యదుకుల, వల్లభునకు మ్రొక్కి వాసవసుతు మోదము సం
ధిల్లఁ గవుఁగిలింప బలము, లెల్ల నిలిచె నతనివీట నేనుదినంబుల్. 29

ఉ. ఆమఱునాఁడు సప్తతిసహస్రసితేభములున్ దురంగముల్
శ్యామలకర్ణముల్ నవసహస్రము లష్టవిధంబు లైనము
క్తామణిరాసులున్ మొదలుగాఁ గలసంపద లెల్ల నిచ్చి యు
త్తామరసాక్షుఁ గొల్చి వసుధావరుఁ డశ్వములం దరల్చినన్. 30

క. కతిపయదినములకు హయ, ద్వితయము గజకబళనప్రవీణఝషగ్రా
హతిమితిమింగిలలహరిహ, సితజలనిధి యగునదంబు జివ్వన దాఁటెన్. 31

ఆ. క్రీడి వీరవర్మతోడ హయంబులు, సరసి దాఁటె నెద్దివెర వటన్న
నతఁడు నావలను రయంబున దాఁటింప, సేన కౌంతలంబుఁ జేరి విడిసె. 32

క. అచ్చట హయులం గానక, తిచ్చవడి దొరలు నిలుచుతటిన్ వెలుఁగుచు నై
యచ్చరపథమున సురముని, వచ్చి నమస్కృతులు గాంచి వారలతోడన్. 33

చ. హయములు చంద్రహాసవసుధాధిపుకౌంతలకంబుఁ జేరె దు
ర్జయుఁ డగునానృపాలునిపరాక్రమలీలకు రాజు లెల్ల నా
రయ సరి షోడశాంశమును రారు తదీయచరిత్ర మన్న వి
స్మయ మిది వేళ గాదు విన సైంధవముల్ గడుదూర మేగెడున్. 34

చ. అనుటయుఁ బార్థుఁ డిట్లనుఁ బ్రియంబున నారద శౌరి చెప్పుమున్
వినమె కథాసుధారసము వీనుల కింపుగఁ బోరిలోన స
జ్జనులచరిత్రముల్ వినుట జన్మఫలంబులు గావె చంద్రహా
సనృపవరేణ్యపుణ్యకథ సత్కృప నా కెఱిగింపు నావుడున్. 35

## నారదుఁడు చంద్రహాసుని వృత్తాంతంబు దెల్పుట.

సీ. విను కేరళాధీశ్వరున కాత్మజుఁడు సభా గ్యుఁడు మూలతారయం దుదయమయ్యె
నొక కొన్ని దివసంబులకు వైరుల నెదిర్చి జనకుండు గండదోషమునఁ దప్ప
జనయిత్రి చిచ్చుఱికిన దాదు లాబాల కునిఁ గౌంతలమునకుఁ గొంచువచ్చి
వర్షత్రయము పెంచి వా రంతరించినఁ బౌరభామిను లాకుమారుఁ జూచి

తే. కరుణ నొకపుణ్యసతి జలకంబుఁ బట్టుఁ
గూర్మినొకలేమ కడుపారఁ గుడువఁ బెట్టు
దయ నొకవధూటి మొలవన్నెతడుపుఁ జుట్టు
గోర్కి నొకయింతి కూఁకట్లు గూడఁ గట్టు. 36

క. ఈరీతిఁ బౌరకాంతలు, గారవమునఁ బెనుచుచుండఁగా నొక్కదినం
బా రాకొమరుండు యదృ, చ్ఛారతిఁ జనె దుష్టబుద్ధిసదనంబునకున్. 37

క. ఆమంత్రికొలువులోనిమ, హామును తీక్షించి మదితుదై యెవ్వరివాఁ
డీముద్దులాఁడు నిఖిల, క్ష్మామండల మేలురేఖ గలవాఁ డనినన్. 38

క. విని వినవివానిచందం, బున గీటునఁ బుచ్చి దుష్టబుద్ధి యతుల స
ద్వినయమున ననిపి యపు డా, తనయునకును బుధులపలుకు తథ్యం బనుమన్. 39

క. దండింపఁ దలఁచి యప్పుడు, చండాలభటాళిఁ బిలిచి సచివుఁడు వీనిఁ
గొండికపాపని బలి వా, రం డని నెల వొసఁగఁ గింకరులు రక్షసముఁన్. 40

ఉ. పట్టి మదేభసింహశరభప్రముఖోగ్రతరాటవీతటిన్
బెట్టి కృపాణి జళిపింపఁ గుమారుఁడు శౌరి నెమ్మదిన్
గట్టిగ నిల్ప నప్పు గొడికాంఁడు కృపన్ వలకాలిపిల్లవ్రేల్
ముట్టఁగఁ గోసి మంత్రివరు ముందటఁ బెట్టి కృతప్రణాముడై. 41

క. దేవర చెప్పినయుడిగము, గావించితి మనిన మంత్రి కౌతుకహృదయుం
డై వలమునిభాషితము మృ, షావాదం బయ్యె నని విశంకత నుండన్. 42

చ. అచటఁ గుమారుఁ డంఘ్రివికలాంగుళిఖేదసుఖాశ్రుజాలసం
కుచితముఖాబ్జుఁడై పదకుంతమృగీవనదేవతల్ దయా
రచితహితోపచారముల రక్షణ సేయఁ గుళిందకుండు త
త్సచివునకున్ విధేయుఁ డగుశాబరదేశవిభుండు వేటమైన్. 43

ఉ. అక్కడి కేగుదెంచి చరణాంగుళివేదనఁ జాలఁ గుందియున్
ద్రుక్కన శ్రీహరిం దలఁచునూనునిఁ జూచి కృపాసమగ్రుఁడై
యెక్కడివాఁడొ వీఁడు జగదీశ్వరలక్షణలక్షితాకృతిన్
జక్కనిపిన్నవాఁ డనుచు సైంధవమున్ డిగి బుజ్జగించుచున్.  44

క. హరిభక్తుఁ డితఁడు నేనును, హరిపద సేవకుఁడ నయ్యు నాపత్నుఁడనై
హరిఁ బలుమఱు సారయ్యఁగ శ్రీ, హరి నా కిట్లు కరుణ చేసె నన్నకు ననుచున్.

క. కుండుఁడు కానీనుఁడు కృత, కుండు సహోఢజుఁడు గోళకుఁడు క్రీతుఁడు ద
త్తుండు స్వయంప్రాప్తుఁడు నూ, నుం డౌరసహీను లగుజనుల కిట్లగుటన్. 46

క. ఇతఁడు స్వయంప్రాప్తుడును, సుతుఁడని యంగీకరించి శోకము వాపిం
చి తురంగముపై నిడి నం, దిత్యుఁడై తనచందనావతీపురి కరిగెన్. 47

సీ. అరిగి సైనికుల నర్వాప్రకారంబుల ననిపి యంతఃపురంబునకు నరిగి
జ్యోస్యుల యనుమతి శుభముహూర్తంబున రాణి మేధావినీరమణి కిచ్చి
చంద్రుని నవ్వుహాసంబు గల్గుటఁ జంద్ర హాసుం డనెడునామ మర్థిఁ బెట్టి
ధాదులచే నిరంతరము సంరక్షణ చేయింపఁ గట్టడ చేసి వేడ్కఁ

తే. బెనుపఁగా దల్లిదండ్రులు ప్రేమమునను, విదియచంద్రునిగతి నభివృద్ధిఁ బొంద
నవని దున్నక పండెఁ జ న్నవిసి పిదికె, సురభులు జనంబు లానందభరితు లైరి.

మ. కర మర్థిన్ సుతునిం గృతోపనయనుం గావించి వేదాగమా
ర్థరహస్యంబులు దెల్పి కార్ముకముఖాస్త్రప్రౌఢిమల్ నేర్పి సిం
ధురగంధర్వరథాధిరోహణసమర్థుం జేసి ధాత్రీధురం
ధరుఁ గావించెఁ గులిందకుండు జను లానందంబునం బొందఁగన్. 49

క. ఆచంద్రహాసవిభుఁ డు, ర్వీచక్రము ప్రజల నెల్ల శ్రీవైష్ణవమా
ర్గాచరణతత్పరులుగాఁ, బ్రోచెన్ రుక్మాంగద ప్రభువుచందమునన్. 50

మ. పదియాఱేఁడుల నూఁగుమీసముల లేఁబ్రాయంబునం దండ్రిపం
ప దిగంతంబుల రాజులం గెలిచి కప్పంబుల్ వధూ కాంచనో
న్మదమాతంగతురంగరత్ననివహంబుం బాదిగా సర్వసం
పదలున్ బ్రాక్తనరేఖ మీఱఁ గొని దృప్యత్సైన్యముల్ గొల్వఁగన్. 51

## చంద్రహాసుఁడు రాజ్యంబు చేయుట.

చ. శతమఖవైభవుం డని ప్రజల్ జయ పెట్టుచు మ్రొక్కఁ జందనా
వతి కరుదెంచి తండ్రిపదవారిరుహంబులు గాంచి విక్రమా
ర్జితబహుసంపదల్ నగరు క్రిక్కిఱియించి కృతప్రణాముఁడై
యతివినయంబునన్ జననియంఘ్రులకున్ బ్రణమిల్లి భక్తితోన్. 52

క. జననీజనకులపాదము, లనవరతముఁ గొల్వఁ జంద్రహాసకుమారుం
గనుఁగొని కులిందభూపతి, తను వెల్లను నివురుచును ముదంబునఁ బలికెన్. 53

క. జాలెలఁ బట్టింపుము పది, వేలు నయిదువేలు రెండువేలు నరయు సా
న్నాలరి కుంతలఅనకు మన, యేలిక యమ్మంత్రి యతనియింటికిఁ బనుపన్. 54

క. అనిన విని చంద్రహాసుఁడు, జనకుని వీడుకొని ధన మసంఖ్యము బహువా
హ్యానరోష్ట్రఖర బలీవ, ర్దనివహములచేతఁ గన్న దనియఁగఁ బంపెన్. 55

ఆ. మూఁడువగలపగిదిముడుపులు దెప్పించి, కలయ నొక్క బదరికమున నుంచి
కొంతలేశ్వరునినగరిపురోహితుఁ డైన, గాలవునకుఁ గౌతుకమునఁ బనిచె. 56

ఉ. పంచినఁ దిర్పుడన్ సచివుపాలికి నేఁగి కృతప్రణాముఁడై
కాంచనరత్నభూషణసుగంధపటావలి వేఱువేఱ య
ర్పించి కులిందనందనుఁడు పెట్టినపత్రిక చూపి రాజుకుం
గొంచక దీని కేసుమణుఁగుల్ గొనివచ్చితి మంచు నిచ్చినన్. 57

చ. కొని చని కుంతలేశ్వరునకున్ వవరంబుగఁ జూపి చారుల
నట్టన ములరించి పంచి జననాయకుఁ దగ్గతి చంద్రహాసుఁ డి

చ్చినవివరంబు విన్నపము చేసి కుళిందకుఁ బట్టి రాజుచే
ననుమతుఁడై యమాత్యుఁడు రహస్యము చిత్తము నొత్తరింపఁగన్. 58

ఆ. తమక మినుమడింప దళముతోడుత నాఱు, యోజనములపయన మొక్కనాఁడె
తెరలి చందనావతీపురిముందటఁ, గాంచి యోధవరులఁ గలయఁ జూచి. 59

క. ముందు మహాటవి యిది యీ, సందున నమరావతీవిశంకటమహిమన్
గ్రందుకొనిన దారార కు, ళిందునిసౌభాగ్య మని యళీకప్రీతి. 60

క. అరుదేర దుష్టబుద్ధి కె, దురుగఁ గుళిందకుఁడు ప్రియసుతునితోఁ జని త
చ్చరణముల వ్రాలి నిజమం, దిరమున విడియించి భక్తి నివ్వటిలంగన్. 61

క. బహువిధమనోజ్ఞవస్తుని, వహములఁ బూజింప గృతకవాత్సల్యభర
ప్రహసితముఖాబ్జుఁడై చం, ద్రహాసుఁ గన్గొని కుళిందునకు నిట్లనియె. 62

క. చందురునివంటివాఁ డీ, నందనుఁ డతిభాగ్యలక్షణయుతుఁడు నీ కే
చందమునఁ గల్గె ననఁ గు, ళిందకుఁ డాద్యంతమును దెలియ వినిపించెన్. 63

ఉ. ఏ మృగయావినోదరతి నేగుచుఁ గొంతలకంబుదండ రెం
డామడఁ గల్గు నొక్కభయదాటవిలోనఁ బదాంగుళీవ్యథన్
వేమఱు శ్రీహరిం దలఁచువీనిఁ గనుంగొని విష్ణుభక్తునిం
గా మదిఁ గాంచి యౌరసునకన్న విశేషముగాఁగఁ బెంచితిన్. 64

క. నాఁటి కయిదేండ్లవాఁ డను, మాట విని కృతంబు దలఁచి మానసమున న
త్తోటులమీఁదను బండులు, గీఁటుకొనుచు దుష్టబుద్ధి కృత్రిమబుద్ధిన్. 65

క. ఇచ్చోట నేమి దలఁచిన, వచ్చు నపాయము దన కవశ్యము వీనిన్
బుచ్చెదఁ గొంతలకంబున, కచ్చట మత్సుతుఁడు విషనిహతుఁ గావించున్. 66

క. అని తలఁచి యొక్కపత్రిక, తనతనయునిపేర నేకతమ్మ స్వహస్త
మ్మున వ్రాసి ముద్ర పెట్టి స, వినయుఁ డగుచుఁ జంద్రహాసవిభునకు ననియెన్.

క. ఈపత్రిక నీ వొకఁడవ, నాపుత్త్రున కిమ్ము శోభనం బగు ననుటన్
వీపను లన్న వినతుఁడై, వే పోయె నతండు పవనవేగాశ్వముపైన్. 68

ఆ. నిమిషమాత్రఁ గొంతలముఁ జేరి తత్పురీ, సవిధవివిధపుష్పసౌరభప్ర
మత్తచంచరికమండలీముఖరితా, రామమధ్యగతసరంబు గదిసి. 69

క. యువహంసచక్రసారస, నివహగరుద్ధూపవితచవీరేజపుట
స్రవదమలమధుసురభిగం, ధవహాంకురసపదివారితపథశ్రముఁడై. 70

క. తురగమును నీరు జలజా, కరమునఁ ద్రావించి తా విచకపుష్పఫలో
త్కరభరవినమ్రచూతాం, తరమరకతవేది నలవునం బవళింపన్. 71

## కుంతలేశునికూఁతురు వనవిహారమునకు వచ్చుట.

ఆ. కుంతలాధినాథుకూఁతురు చంపక, మాలినియును సఖ్యమాత్యవరుని
తనయ విషయయును మదను నోమఁ దద్వన, స్థలికి వచ్చి రాప్తసఖులతోడ. 72

సీ. అలసతఁ జూపునొయ్యారంపునడపులు పసమయూరములగర్వముఁ గుదింప
సఖుల వేమఱుఁ బిల్చుసరసంపుఁబలుకులు మత్తకోకిలములమనసుఁ గలఁప
నిటలంబుల నటించుకుటిలాలకంబులు షట్పదంబులవిలాసముల నలుపఁ
దరలలోచనములధాళధళ్యంబులు హరిణులసౌభాగ్య మపహసింప
తే. దండడించుమనోరథోద్ధతవిహార, సరణిఁ జంపకమాలినీతరుణిఁ గూడి
మానినులు గోసి రవ్వనమంజులలను, సరసిసరసిజములఁ బెక్కుచందములను. 73

ఆ. సచివపుత్త్రి విషయ శారీరవాసన, వనము గంధసారవనముఁ జేయ
గళితహారమణులఁ గమలాకరంబు ర, త్నాకరంబుఁ జేసె నలసగతుల. 74

క. అంగన లపుడు చతుర్విధ, శృంగారము లలవరించి చెలఁకువిలుతు నో
మంగ విషయ తత్సరసీ, ప్రాంగణనిద్రితునిఁ జంద్రహాసునిఁ గాంచెన్. 75

చ. కని రశనాంఘ్రిరత్నకటకంబులు మ్రోయక యుండ నల్లన
ల్లనఁ జని యక్కుమారుని విలాసము లేఁకటువాయఁ జూచి ప్రా
ల నడవ సంచితాంతఁ బదిలం బగుపత్త్రిక వీడ్చి తండ్రి వ్రా
సినకపటంపుఁబద్ధతికిఁ జిత్తమునం బరితాప మందుచున్. 76

క. విషమాస్త్రసమానునకు, న్విష మొసఁగన్ వ్రాసెఁ దండ్రి సద్గుణుఁ డని తా
న్విషమాక్షరపంక్తి దుడిచి, విషయ నొసఁగు మనుచు వ్రాసి వేడ్కలతోడన్. 77

క. పెన్నిధిఁ గని పోవఁగ లే, కున్నకృపణుమాడ్కిఁ జిత్త మూటాడఁగ నా
కన్నె పరాధీనత నతి, ఖిన్న యగుచు నింటి కేళికలకుఁ జనియెన్. 78

క. ఆలోనఁ జంద్రహాసుఁడు, మేలు కనుచు నపుడు తత్సమీపసరఃప్ర
క్షాళితముఖుఁడై నడగని(?), బోలెమునఁ(?) గదల్చి నగరముఁ బ్రవేశించెన్. 79

క. ఎడనెడ శుభశకునంబులు, పొడ గనుచును వొచ్చి దుష్టబుద్ధి నగరివా
కిడికడవాకిటఁ దురగ,మ్ముడిగం బణిహారి గని ప్రమోదముతోడన్. 80

క. కొలువున్నమదనుఁ గని చేతులు మోడ్చి కులీనకునిసుతుఁ డమాత్యుని సా
ఖలు గొనుచు మనసగరిమో,సల నున్నాఁ డనిన విని ససంభ్రముఁ డగుచున్. 81

ఆ. కూర్మి నతని నెదుర్కొని కౌఁగిలించి యే, కాంతమందమున సంభావించి
యటఁ గుళిందుసేమ మరయుచుఁ దండ్రివ్రాయు సముఁ జూచి ఫక్కి [illegible]

సీ. స్వస్తిసమస్తప్రశస్తగుణాన్వితుం డవు దుష్టబుద్ధిని [illegible] డగు
మదను దీవించి ప్రేమముగఁ బుత్తెంచిన శుభలేఖ చంద్రహాసుఁడు కుళిందు

పట్టి కులస్థానపౌరుషాధికుఁడు సిద్ధంబుగా మనకు నీతండ హితుఁడు
కాన సందేహంబు మాని యీపత్రిక వీక్షించినప్పుడె విషయ నొసఁగు
తే. మనెడుపద్ధతిఁ జదివి భాగ్యంబు చేసె, నస్మదీయసహోదరి యనుచు దైవ
ఘటన నారాత్రిఁ గలుగులగ్నంబునన వివాహ మొనరించె దేవేంద్రవైభవమున.
ఉ. అంతట దుష్టబుద్ధి హృదయంబున నింతకుఁ జంద్రహాసుఁడుం
గొంతలకంబుఁ జేసుఁ దన కైతవముల్ ఫలియించు నంచు ని
శ్చింతమతిం గుళిందకుని శృంఖలబద్ధునిఁ జేసి దుర్గమా
ద్యంతము చూఱ గైకొని రయంబున మూఁడవనాఁటివేకువన్. 84
క. అంచల బెస్తల వడ జంకించుచు బంగారుపల్లకీ యెక్కి ప్రయా
ణించు నెడం గొంతలక, ప్రాంచలమున నొకమహోగ్రఫణి యెదు రగుచున్. 85
క. మానుషభాషల నిట్లను, నే నీసదనంబులోనినిక్షేపములం
బ్రాణమువలెఁ గాచితి నిఁకఁ, బో నగు నని చెప్పి కుతలముఁ బ్రవేశించెన్. 86
ఆ. పాముమాటఁ బాటిఁ బట్టక కౌంతల, కంబు చొచ్చి నగరి క్రందుఁ జూచి
చంద్రహాసునకు విషయఁ బెండ్లిసేయుట, వ్యర్థముగా నెఱింగి వీఁపు విఱిగె. 87
క. ఏనెమి చెప్పి పంపినఁ, దా నేపని చేసె నని మదనుఁ బిలిచి దురా
త్మా నేఁటిదాఁకఁ ద్రోయవు, గా నాయానతి నిదేమి గావించి తనన్. 88
క. దేవరయానతిఁ దప్పిన, యావివరం బేది యని స్వహస్తలిఖితలే
ఖావాచకంబుఁ జూపిన, నావక్కాణంబు జూచి యద్భుతపడఁగన్. 89
ఆ. మఱియుఁ దండ్రితోడ మదనుండు దేవర, యాజ్ఞఁ బ్రాణ మైనయనుజ నొసఁగి
హితజనంబు లెదుర నీతని కెడ రైనఁ, బ్రాణ మిత్తు ననుచుఁ బ్రతిన గొంటి. 90
క. అనుటయుఁ దనతనయునిమీఁద నవిశ్వాసంబు పొడమి తనకపటము లో
నన పదిలపఱచె నంతటఁ, దనుజయునల్లుఁడును వచ్చి దండముఁ బెట్టెన్. 91
క. బాలప్రాణములఁ జూచిన, క్రోలుపులిగతిన్ మనంబు గుబ్బతిలఁగ మి
థ్యాలాలనములు సేయుచు, నాలవదివసంబు శోభనము సాగించెన్. 92
చ. మఱుసటినాఁటివేకువ నమాత్యుఁడు మేల్కని వంశ మంతయు
తెలిచిరి కూఁతురుం గొడుకుఁ జెల్లరె మీఁదటఁ జంద్రహాసుఁ డె
చ్చరిసఁ బ్రమాద మౌ ననుచుఁ జిత్తమునం దలపోసి వీని నే
తెఱఁగున నైనఁ జంపెద యతిప్రవరోక్తులు బొంకు చేసెదన్. 93
సీ. అని నిశ్చయించి బ్రహ్మఘ్న శిశుఘ్న గోఘ్నాదులఁ బలువు రంత్యజులఁ బిలిచి
కృతపద్ధతిప్పు గాచితి నేఁడు నగరంబు వెలుపలికోటలోపలికరాళ
కాళికాభవనంబులో లీనులై యుండుఁ డచ్చోటి కపరసంధ్యాముఖమున
నొంటి వచ్చినవాని గెంటి పోవఁగనీక నఱకుండు కండతుండములు గాఁగ

తే. నట్లు చేసిన నర్ధరాజ్యంబు మీకు, నిత్తు మదనునితో దన నియ్యకొనుచు
నరిగి మూఁడవజాముగ నడఁగియుండెఁ జండికాగృహమునఁ జండాలమండలంబు.

### దుష్టబుద్ధి చంద్రహాసుని కాళికాగృహమునకుఁ బంపుట.

క. ఆవేళఁ జంద్రహాసుని, రావించి కరగ్రహాంతరంబున దుర్గా
దేవి భజించు టవశ్యము, గావున నీ వేఁగు చండికాగృహమునకున్. 95

చ. అనుటయుఁ జంద్రహాసవిభుఁ డట్టులకా కనె నంతఁ గుంతలుం
డు నిజపురోధ గాలవుఁ గనుంగొని రాజ్యముమీఁదికోర్కి గొం
టినది నిజంబుగాఁ దనువునీడకు మూర్ధము గానరాదు క
న్గొనఁగ నరిష్టలక్షణము కోరిక నా కెఱిఁగింపు నావుడున్. 96

క. దత్తాత్రేయుఁ డలన్కన, క్కిత్తెఱఁ గెఱిఁగించె వసుమతీశ్వర విను నీ
వుత్తల మందకు మది, నీ చిత్తసమాధాన మిపుడ చేయఁగఁజాలున్. 97

సీ. ధ్రువవసిష్ఠారుంధతులఁ దనుచ్ఛాయయుఁ గానివాఁ డేఁటిలోనఁ గడచుఁ
గిరణాన్వితాగ్ని నిష్కిరణార్కుఁ గనువాఁడు మఱియు నేకాదశమాసములను
బనిలేనిపని బక్కబలిసిన బొసుక చిక్కినవాఁడు దెగు నెల లెనిమిదింట
నడుగుచొప్పునఁ బార్ష్ణి యైన వ్రేళ్ళయిన ఖండిత మైనవాఁ డేడు నెలల దప్పఁ

తే. గాకి యైన గ్రద్దైన నులూక మైన, నెత్తి సోకిన వాఁ డాఱు నెలలఁ గెడయు
స్నానమగ్నవవేళల మేనిచర్మ, మదరువాఁ డైదునెలలకు నంతరించు. 98

క. తననీడ వేఱె యుశలా, గున నుండిన వాఁడు నాల్గునెలలకు నీల్గున్
ఘనరహిత మైనమెఱుపు జ, మునిదెసఁ గనువాఁడు ద్రెళ్ళు మూమ్మాసములన్. 99

క. తనబింబ మద్దమునఁ జూ,చినఁ లే కున్న వాఁడు చెల్లును రెన్నె
ల్లను దనతనువు గమరు వల, చిన పక్షములోన వాఁడు జీవము దొఱఁగున్. 100

తే. జలక మాడిన నవయవములకు మించి, హృదయమధ్యంబు జివ్వని యెండె నేని
నీరు గ్రోలిన దాహంబు నిలువ దేని, వాఁడు వెంచేయు నీరైదువాసరముల. 101

క. మనుజులలోఁ జినములలోఁ, దనరూపముఁ గానకున్నఁ దనవీనులలో
నను వ్రేళ్లు వెట్టి చూచిన, ధ్వని వినఁబడ కున్న వాఁడు తడయక పొలియున్.

సీ. ఋక్షవానరముల నెక్కి పోవుచుఁ దాన కాలుని దెస కేఁగఁ గంటి ననియుఁ
దనమూర్ధమున బొగ్గులును శిరోజంబులు నుముకయు భక్షించు చుంటి ననియు
నగ్నుఁడై జైనసన్యాసి నవ్వుచు ప్రోల గంతులు వేయంగఁ గంటి ననియుఁ
దైల మాపాదమస్తమునందు వడి యంగ నుక్విపై నిద్రించు చుంటి ననియు

తే. నతిభయంకరమూర్తులై యస్త్రనరలు, తాలఁ గొని యువ్వి రనియును నీలిచీర
కాంత బడి దక్షిణము వోవఁగంటి నవియు, స్వప్నమునఁగన్న వారికిఁజావు ధ్రువము.

జనవర యిట్లరిష్టములు సంభవమైన గురుద్విజామరా
ర్చనజపహోమదానముల శాంతి యొనర్తు రొనర్చి సర్వసం
గనిరసనంబు నింద్రియుని కారముఁ జేయుదు నీకు నీకుగా
ర్చినగతి జీవునిం బరముఁ జేర్తుప తత్త్వరహస్యకోవిదుల్. 104

అని గాలవముని చెప్పిన, జనపతి మదిఁ బాము కుప్పసం బూడ్చువిధం
బున రాజ్యము విడువఁదలఁచి, తనమంత్రివరుఁ డగు మదనుఁ బిలిపింపన్. 105

చను దెంచి మ్రొక్కి పని యే, మన నీయల్లుఁ డగు చంద్రహాసుని వెసఁ దో
కొనిరమ్మిటఁ జంపకమా, లిని నిచ్చెద ననినఁ గుట్మలితహస్తుండై. 106

చనివిని ప్రాద్ధు, గుంతలపురిపాటిఁ బురాంతరవీథిఁ గాళికా
గృహమున కొంటి నేగెడిమదనుఁ గనుంగొని మంత్రియాజ్ఞ చే
కొని గమనించు లా గుతిఁగి కుంతలనాథుఁడు నిన్నుఁ బిల్చె తె
మ్మనెఁ జనుమేను నీప్రతిగ సర్వము చేసెదఁ గాని శాంభవిన్. 107

అని యతనిచేతి గంధపుష్పాక్షతములు, వసుసంగ్రైకొని తా నెక్కువాహనంబుఁ
జామరచ్ఛత్రములు నిచ్చి సచివతనయుఁ, డనిపి పంపిన నాచంద్రహాసుఁ డరిగె.

## కుంతలుండు చంపకమాలినిఁ బెండ్లిసేయుట.

వినతి యొనర్చి నిల్వఁ బృథివీపతి గాలవసంయమీంద్రుశా
సనమునఁ జంద్రహాసునకుఁ జంపకమాలినిఁ బెండ్లిచేసి యు
ల్లసము సమస్తరాజ్యమును లీలత నిచ్చి విరక్తుఁడై తపో
వనమున కేఁగెఁ బ్రాగనుభవక్షితసౌఖ్యము లేవగించుచున్. 109

అంతట మదనుఁడు నగర, ప్రాంతవనీచండికాగృహమునకు నిబిడ
ధ్వాంతమున నొంటిఁ జనఁ బతు, హంతలు పైఁబడి వధించి రాయుధహస్తుల్.

ఇవ్విధంబునఁ జంద్రహాసుండు చంపకమాలినీవివాహంబునఁ గుంతలరాజ్యసింహాసనారోహణంబునను సముత్సాహంబు నొంది వందిబృందంబు పొగడ ముందటం గందుకొనుసందడి జడియ వారించువేత్రహస్తులయస్తోకసాహోనినాదంబు రోదసీభేదనంబు సంపాదింప శంపాపరంపరానురూపదీపకలాపంబు లుద్దీపింప శచీసమేతుం డగునాఖండలుండునుంబోలె వధూసమేతుండై పాండురమత్తవేదండంబు నెక్కి యక్కజం బగువైభవంబునం జనుదెంచి దుష్టబుద్ధి నగరియుండపట్టు, పంజరంబు డిగ్గి యంతకుమున్న వచోహారులవలనం దనరాక యెఱింగి కలంగి యున్నమామకుం బ్రణమిల్లి యతనికిం దనవృత్తాంతంబును మదనుండు కాళికాసదనంబున కరిగినవిధంబునుఁ జెప్ప నిప్పు ద్రొక్కినపోలికం బొక్కిపడియుఁ గళవళంబు దక్కి తక్కిన క్రియలంబున నల్లునియుల్లంబు పల్లవింపం జేసి యనిపి యయ్యహిత్యవసరం దత్కాళికాంతంబున. 111

లయుం గోకయు వీడఁగాఁ బఱచి సంతాపంబునం గాళికా
యం బొక్కఁడ చొచ్చి చచ్చినసుతు న్వీక్షించి శ్రీవిష్ణుభ
లకుఁ గెంఁడు దలంచుద్రోహులకు యుక్తుల్ గొల్వనే యంచుఁ ద
లిపీఠోపలపాత భగ్నశిరుఁడై ప్రాణంబులం బాసినన్. 112
లబలవేగఁ జండిక నుపాసనచేయుతపోధనుండు దే
లిఁ బడియున్నమంత్రివరు నాతనిసూనునిఁ జూచి యెట్లొకో
లిసిరి నిర్నిమిత్త మని పొక్కుచు వే చని చంద్రహాసభూ
లపతితోడఁ జెప్పిన నతండు రయంబునఁ బాదచారియై. 113

## చంద్రహాసుండు దుష్టబుద్ధిని బ్రతికించుట.

లీగృహము సొచ్చి కూలినసచివుఁ దత్తనయునిఁ గని శోకతప్తుఁ డగుచుఁ
దిసి వీరల నేఁడు బ్రదికింప కుండినఁ బ్రజలచే నాడిక పడుదు ననుచుఁ
తురస్రకలితవిస్తృతహోమకుండంబుఁ ద్రవ్వించి పావకుఁ దవులుకొలిపి
ర్కరాతిలపాయసఘృతంబులను గూర్చి తనమేనికండలఁ దఱిగి వేల్చి
కీవిఁ గనుఁగొని చిచ్ఛక్తి వీవు హరికి, నగుట మచ్చిర మిత్తుఁ బూర్ణాహుతనుచు
స్త మంకింప వైష్ణవి కరముఁ బట్టి, వాంఛితం బెద్ది వేఁడుము వరము ననిన. 114
రల మును బ్రతికింపుము, నారాయణుమీఁద భక్తి నా కిమ్మన న
వ్వారాహి యొసగెఁ నీకుఁ గుమారులు గలిగెదరు బలసమన్వితులనుచున్. 115
కలంకస్థితిఁ జంద్రహాసవిభుఁ డాయం బిల్చి తా హస్తమ
కసంయోగము సేయుచుం బరమతత్త్వజ్ఞానముం దెల్పి చం
క యంతర్హితయైన మామయు మఱంది న్నిద్ర మేల్కాంచుపో
క లేవన్ దివిఁ బుష్పవృష్టి కురిసెన్ లేఖుల్ ప్రశంసింపఁగన్. 116
నవిభుఁడు చంద్రహాసుండు నమాత్యుని మదనుఁ దోకొనుచుఁ బురమునకున్
నుదెంచి తల్లి మేధావినికిఁ గుళిందునకు మ్రొక్కె వినయముతోడన్. 117
వేడ్కఁ జంపకమాలినీనిషయులందు, సొరిది బ్రహ్మణ్యమకరధ్వజులను గాంచి
ారిపరాయణుఁ డగుచంద్రహాసనృపతి, త్రిశతవర్షంబు లేలె ధాత్రీతలంబు. 118
శమహిమలఁ జెందుట సు, త్రామజయాదుష్టమతి సఱకఁ బంపునెడం
ా మునుభజించుసాల, గ్రామ మొకటి మ్రింగె నందుశతమున ననుచున్. 119
సాల గ్రామజలంబులు, మౌళిపయిం జల్లుకొనిన మానవులకు నీ
కేలా శైలావృతనిఖి, లేలా తీర్థములఫలము లేలా సేయన్. 120
మొగిఁ జతుర్దశలోకములభరించుఫలంబు చేయు సాలగ్రామధారణమున
నారణీచక్ర మంత్రయు నిచ్చినఫలంబు దక్కు సాలగ్రామదానమునను

సకలదేవతల నర్చన చేసినఫలంబు పొందు సాలగ్రామపూజనమునఁ
బరమపావన వేదపారాయణఫలంబు వచ్చు సాలగ్రామవర్ణనమున
తే. యతి యనంగ సాలగ్రామ మనఁగ భోగి, తల్పునకును జరాచరతనువు లనుచు
సంతతము బ్రహ్మ గొనియాడు నంతకంటెఁ,దుర్యమనిచెప్పుచుండు శ్రీతులసిమహి
క. శిరమునఁ బింఛముఁ జెవుల మ్మకరకుండలములు నురమునఁ గౌస్తుభ మర్థిన్
ధరియించు నంతకంటెను, హరి శ్రీతులసీదళంబు నవలంబించున్. 1
ఉ. ఈకథ విన్నమర్త్యుల కభీష్టప్రద మంచుఁ జెప్పి నా
శీకభవాత్మనూనుఁడు నిలింపపురంబున కేఁగె విస్మయో
త్సేకితఁ జంద్రహాసనృపశేఖరుభవ్యచరిత్రముల్ నృపా
నీకముతోడఁ బార్థుఁడ గణించుచుఁ గొంతలకంబు చేరినన్. 1
క. అన్నృపతిసుతులు బలసం, పన్నులు మకరధ్వజుండుఁ బద్మాక్షుండున్
మున్నాడి పాఱుతెంచిన, జన్నపుహయులన్ వయాళిఁ జనికని రెదురన్. 1
చ. కని కొనిపోయి తండ్రి ముఖంబుఁ బెట్టినఁ జంద్రహాసుఁ డి
ట్లను నిది ధర్మనందనుమఖాశ్వము దీనికినై ప్రయాస మొం
దనిమిషరాట్సుతుండు దిరుగాడెడు సేనలతోడ నంచు మున్
వినఁబడుఁ బట్టినం గ్రతువు విఘ్న మగున్ మనధర్మనూతికిన్. 1
క. మీరలు పదైదుదివసము, లీరెంటి సురక్షసేయుఁ డింతటిలోనే
వారలు రాకున్న మఖ, ప్రారంభమువేళ కనిపిపంపుద మనుచున్. 1
క. బలుకునెడఁ బార్థుసేనా, కలకలములు నిజపురోపకంఠసరణి ది
క్కుల ప్రక్కలింపఁగా నల, బలములతో మోహరించి బలములు నెదురన్. 1
క. శ్రీహరి సంతోషింపఁగ, నాహవ మొనరింపఁ గలిగె నర్జునుతో నం
చూహించి నృపతి రణ స్సన్నాహంబునఁ దత్పురాంగణంబున నిలువన్. 1
తే. అతనిఁ గని కృష్ణుఁ డనునింద్రసుతునితోడఁ, జంద్రహాసునిఁబరమవైష్ణవునిఁ జూ
వీఁడు జ్ఞానతపోవయోవృద్ధుగాని, క్రూరసమరాంగణమునఁ దారుణ్యతనుఁడు. 1
మ. అని కృష్ణుండు కిరీటికిం దెలుపుచో నాచంద్రహాసుండు సై
న్యనికాయంబులమంగల న్వరశతాంగారూఢుఁడై వచ్చు దే
వునిఁ జక్రాసి గదాబ్జహస్తు మునిసేవ్యు స్భక్తితోఁ గాంచి గ్ర
క్కున మాణిక్యరథంబు డిగ్గి చని సాష్టాంగంబుగా మ్రొక్కినన్. 1
చ. హరియును జంద్రహాసునిఁ బ్రియంబునఁ గౌఁగిటఁ జేర్చుచుం బురం
దరసుతుఁ జూచి నా కితఁడు నమ్మినభక్తుఁ డవధ్యుఁ డీపు సం
గరకుతుకంబు దక్కి తనిఁ గౌఁగిటఁ జేర్పుమటన్న నేఁడు నా
ఘుభువుల మెల్లఁ బావనతఁ గూడె నిజం బని కౌఁగిలించినన్. 1

తే. చంద్రహాసుండు నరుతోడ శమనసూను, నధ్వరాశ్వంబు మామకరధ్వజునివ
శంబు చేసితి నవఁ దురగంబుఁగొనుచు,నతఁడు నేతెంచి మ్రొక్కెఁ గృష్ణార్జునులకు.

వ. తదవసరంబున రాజసమాజపూజితుండై చంద్రహాసుండు వాసుదేవు సుధామధురవా
గ్విలాసంబులం బ్రస్తుతించి మహోత్సవంబున నిజపురంబునకుం గొనివచ్చి దుష్టబుద్ధి
మదనపద్మాక్షసహితంబుగా సమస్తబంధునివహంబుం గనిపించి కృష్ణపూజానిమిత్తం
బునం జిదానందచిత్తుం డగు గాలవమునిసత్తముం బిలిపింప నయ్యోగివరుండు సచ్చి
దానందమూర్తి యగు నద్దేవునిం గీర్తించి ముహూర్తమాత్రంబు తన్మయుండై
యుండె కుంతలేశ్వరుం డొనర్చు నర్చనల సంతసిల్లుచుఁ గంతుజనకుం డచ్చట
దివసత్రయం బధివసించి నాలవనాఁడు కుళిందనందనుండు దనకు నర్పించినరాజ్యం
బునం దదీయకుమారకుల మకరధ్వజపద్మాక్షులం బట్టంబు గట్టె నట్టియెడ. 133

క. నందనులఁ జూచి పరమా, నందుఁ డగుచుఁ జంద్రహాసనరపతి యోగో
విందుని భజించి మోక్షముఁ, జెందెద నాయట్ల కీర్తి జెందుఁడు మీరల్. 134

మ. అని దీవించుచు బుద్ధి చెప్పి చతురంగానీకినుల్ గొల్వఁ బా
ర్థునకుం దోడయి రా మఖాశ్వములు దోడ్తోఁ జొచ్చె నేభూము ల
జ్జననాథుల్ గని కప్పముల్ గొనుచు శశ్వద్భక్తి సేవింప వా
రనివేగంబునఁ దేఱు లుత్తరసముద్రం బుద్ధతిం జొచ్చినన్. 135

ఆ. అపుడు సకలనృపులు నంబుధి సాధించు, వెరవు దెలియలేక విహ్వలింప
హరి మయూరకేతనార్జునప్రద్యుమ్న, హంసకేతుకార్ష్ణులర్హ లగుట. 136

క. ఆయేవురయరదములకు, నేయెడ నడ్డంబు లేమి యెఱిఁగి దరి మహీ
నాయకుల నిలిపి తా న, త్తోయధి వెస నమ్మహారథులతోఁ జొచ్చెన్. 137

క. మకరాలయ మటు సొచ్చి వెదకి యుండొకదీవి జీర్ణతరఘనవటప
ర్ణకృతావకుంఠనుం డగు, బకదాల్భ్యుం గనిరి వరతపఃప్రాగల్భ్యున్. 138

క. అందఱు నచ్చోట నిజ, స్యందనములు డిగ్గి మ్రొక్కి సంయమి మదిలో
నిందులకును హరి యొక్కఁడి, సందడి గొనివచ్చె నని యసహ్యపడంగన్. 139

మ. నయఁ దత్తాపసుఁ జేరి కేల్మోగిచి వింతల్ నీశరీరంబునం
దిరుగం బుట్టలువెట్టె సర్పములు వర్తింపక దరుల్ జామకూ
ర్పరదేశంబులఁ బుట్టె గూండ్ల శకునవ్రాతంబు వర్తింప నీ
కరయన్ వాసము లేక నీచివికిమట్టా కేమిప్రా పయ్యెడున్. 140

తే. అనినఁ బార్థునిఁ గని పల్కె మునివరుండు,సంగ మతిదుఃఖ మని బ్రహ్మచర్య మున్న
నాకుఁ జాలదె యింతమట్టాకునీడ, యాయు వల్పంబు గృహ మేమి సేయ ననిన.

మ. తూన్నుఁడు



ఖిలచాటి

క్క లెఱుంగన్ మృతు లైనరోమశుల మార్కండేయులం జేర్కొనన్
నలువల్ వింశతిసంఖ్య లే నెఱుఁగ నంతం బొంది రీసందునన్. 142

సీ. కంనిధు లేకోదకం బైన నిచటికి వెల్లివెంబడి వచ్చు వేల్పునగర
మాసమయమున శాఖసహస్రాజాండ పూర్ణమై యొకమఱ్ఱి పొదలుచుండు
నందు నేకదళంబునందుఁ జక్కనిపిన్న బాలకుం డొక్కఁడు పవ్వళించుఁ
గోమలతరపదాంగుష్ఠంబు చిబుకుచు నెడనెడ నవ్వుచు నేడ్చుచుండు

తే. నతనిదర్శనమున విలయార్ణవమున, సుడివడక సంచరింతు నా సుద్దులేల
నాఁటిపిన్నాతఁ డీయదునందనుండు, సరవి మిముఁ గూడి విరిగి యీచంద మయ్యె.

క. బాలకుఁడు తొల్లి యిప్పుడు, దా లక్ష్మిం బెండ్లి యాడి తనయులఁ గని యీ
త్రైలోక్యగృష్టుం డై, క్రాలెడు నని కృష్ణుఁ బిలిచి కౌఁగిటఁ జేర్చెన్. 144

తే. మదనజనకుండు మునికి నమస్కరించి, వింశతిబ్రహ్మకల్పసంవీక్షణుఁడవు
గాన విష్ణుండ వీవు నీకతన ధర్మ, పుత్త్రమఖ మింక సఫలతఁ బొందు ననిన. 145

క. ఈగతి ననుమతి యిచ్చి మహాగర్వభరంబు వెట్టి నగునే నీకున్
వాగీశ్వరుగర్వంబును, నాగర్వ ముడిగినకథ వినవె నీ వనుచున్. 146

తే. పద్మకల్పంబునం దొక్కపద్మభవుఁడు, రాజహంసంబు నెక్కి యగ్రమున నిలిచి
చింపిమఱ్ఱాకుచాటున జివికి తపము, చేసి బడలక వేఁడు వాంఛితము లనిన. 147

క. అతనిఁ గని యే నెఱుఁగ వి, ధాతలు చని రిరువదిటఁ గృతముకడపట నీ
చేతివరముఁ గొనుకొఱకునె, యీతప మని నవ్వ నప్డు డిరువురనడుమన్. 148

మ. ధరణీచక్రము వ్రక్కలించు కొకయుత్పాతోగ్రవాతంబు ని
ర్భరవృత్తిం జనియించి వే ఱొకమహాబ్రహ్మాండభాండంబులోఁ
జోరు గాఁడుల్ వలెఁ బాఱవైచుటయు నచ్చో నొక్కపద్మాసనుం
డిరునాల్మోములవాఁడు మమ్ము గని మీ రెవ్వారు పూర్వం బనన్. 149

మ. చతురాస్యుం డను సత్యలోకనిజవాస్తవ్యుండ నాశిష్యుఁ డీ
యతివర్యుం డన నవ్వి నాయెదుర నీవా బ్రహ్మ నే నంచుఁ జే
లితి నీశిష్యుఁడు నీవు నాయడుగముల్ సేయుండు నాఁ దన్మరు
ద్గతి నాతండును నేను వేఱొయొక బ్రహ్మాండంబునన్ ద్రెళ్లినన్. 150

సీ. అచ్చోట సుకృతులు నతివధాన్యులు నైన పురుషులు మమ్ము ముువ్వురను జూచి
యొక్కఁడివారు మీ రే లోకమున నుందు రనిన ని ట్లనియె నయ్యష్టముఖుఁడు
బ్రహ్మలోకంబు మద్భవనంబు వీరు నాశిష్యులు నే సరసిజభవుఁడ
నన వారు షోడశాస్యవిరించిఁ గనిపింప నతఁడు గర్వమున మమ్మట్లుపలుక

తే. నెత్తుకొని యమ్మహావాయు వేమిచెప్ప, నతని మమ్మును ద్వాత్రింశదాస్యధాత
లోకమున వైచె నిట్లు దూలుచుఁ గ్రమక్రమమునఁ బలువురు పద్మసంభవులతోడ.

క. చని కడపట సనకసనం, దనముని సేవితుని వేయితలలవిధాతం
గన నయ్యధోక్షజుం డే, పని కిట వచ్చితిరి మీకు భద్రమె యనుచున్. 152

క. మీకృపకారణముగ నీ, లోకమ్మున నిలుతు నని పలుక నందఱు నా
ళీకభవులు మద ముడిగి వి, వేకమతిన్ మ్రొక్కి పెక్కువినుతులు సేయన్. 153

తే. ఆసహస్రాననుఁడు వారి నాదరించి, కమలజుల నెల్లఁ దత్తత్పదముల నిలిపె
నాఁటనుండియు నిచట నున్నాఁడ నేను, వారిరుహనేత్రగర్వ మెవ్వరికి మేలు.

మ. అనఁ గృష్ణార్జును లాత్మఁ జొక్కుచు మునిం బ్రార్థించి యయ్యాశ్రమా
వనివర్తించుహయంబులన్ గొనుచు నవ్వాచంయమముం గొల్చి వా
రినిధిన్ వెల్వడి రాజలోకము ప్రహర్షింప న్నిరాఘాటతం
జని పైత్రోవ జయద్రథాత్మజునిరాజ్యం బేపునం జొచ్చినన్. 155

క. చారులచే గాండీవి మ, హారథికులతోడ వచ్చె నని విని గుండెల్
నీరై సైంధవతనయుఁడు, పేరోలగ ముండి బిట్టుపిఱువడి చచ్చెన్. 156

చ. తనయునిఁ జూచి దుస్సల పదంబులు తొట్రుపడంగ నేడ్చుచున్
దననగరంబు వెల్వడి పృథాతనయుం డనిలోన నున్న నా
పెనిమిటిఁ ద్రుంచి యిప్పు డిదె బిడ్డనిఁ జంపె ననాథఁ గావవే
ననుఁ గృప నంచు గృష్ణుచరణంబులపైఁ బడఁ బార్థుఁ డత్తఱిన్. 157

క. అరదము గుప్పున డిగి సో, దరికిం బ్రణమిల్లి వలదు తనయవియోగా
తురత మనపాలిటికి నీ, హరి గలఁడు కృపాసముద్రుఁ డడలకు మనుచున్. 158

క. అంబుజనాభునిఁ గొల్చి ర, యంబునఁ బురి కరుగుదెంచి యాస్థానములో
నం బొలిసినసుతు శౌరి క, రంబున నిమురంగ లేచి ప్రణమిల్లుటయున్. 159

క. సభవా రందఱు నాశ్చ, ర్యభరితులై మున్ను ద్రుపదరాజసుతకు నీ
వభిమానము గాచిన భ, క్తభయత్రాతవుగదా గదాధర యనుచున్. 160

సీ. కృష్ణార్జునులకు మ్రొక్కి నుతించి బహుగీత, వాద్యనృత్యములతో వైభవములు
సేయించి రపుడు కౌంతేయుండు సుతసమన్విత యైనసోదరి కతిముదమున
దంతావళాశ్వయానాదములు మున్నుగఁగల్గు, ధన మసంఖ్యం బిచ్చి ధర్మతనయు
యజ్ఞంబుఁ జూడ రమ్మని వేఁడుకొని వారిఁ, గదలింప నేఁడు డగ్గఱుట దెలిసి

తే. వారువంబుల స్వేచ్ఛావిహార ముడిపి, కంసమథనుఁడు రాజలోకంబుఁ జూచి
ధర్మజుం డసిపత్త్రవ్రతంబు బడలి, సలుపుచున్నాఁడు కూర్చికాసనమునందు.

క. తురగములఁ గూర్చికొని నృపు, లరుదెండు నిశాముఖంబు నప్పటికని మీ
పరిణామస్థితులు యుధి, ష్ఠిరునకు నే నరిగి తెలియఁజెప్పెద ననుచున్. 162

## కృష్ణుండు దానొక్కరుండు కరిపురంబు ప్రవేశించుట.

చ. కరిపురి చేర నేఁగి కుతుకంబునఁ దన్నికటస్థజాహ్నవీ
సరిదుపకంఠనిర్మితవిశంకటకాంచనరత్నమండపాం
తరమున సంయమీశ్వరసనాథుని ధర్మతనూజుఁ గాంచి య
మ్మురమథనుండు నెయ్యమున మ్రొక్కి ప్రమోదముతోడ నిట్లనున్.

క. జననాథ నీప్రతాపం, బునకును సవతెద్ది సకలభూపాలుర న
ల్లన గెల్చి హయముఁ గొని నీ, యనుజన్ముఁడు వచ్చె నిదె మహావిభవముతోన్.

ఆ. అని మరాళకేతుఁ డాదిగా సకలరా, జన్యవసులఘోరసమరవిధము
జలధిలోనఁ దపము సలిపెడు బకదాల్భ్యుఁ, దెచ్చుటయును వరుసఁ దెలియఁజెప్పి

వ. అచ్యుతుం బరివేష్టించినవిశిష్టజనంబులకుం గుశలప్రశ్నపూర్వకంబుగా నమస్కరి
కుంతికిం దల్లులకుం బ్రణమిల్లి తనకు మ్రొక్కిన భీమమాద్రేయసుభద్రాద్రౌప
నాదరించి వృకోదరసహితంబుగా నిజగృహంబునఁ బ్రవేశించి రుక్మిణీసత్య
మాదిభామాజనంబులయుల్లంబులు పల్లవింప నక్కపటవల్లవుం డించుకవడి
దించి మణిమకరతోరణపట్టపటధ్వజవితానధూపధూమంబులం బురంబు శృ
రింప నియమించి ధర్మజానుమతంబునఁ బౌరజనబంధుపురోహితవారవధూజన
లర్ఘ్యప్రకారంబులం గదల భీమాదియోధవరులతోడం జతురంగబలసమన్వితు
బకదాల్భ్యు నెదురుకొను వేడుకం గదలి నిరర్గళసౌరభోద్గారివిహారవనీసమీ
బున నర్ధచంద్రవ్యూహంబు వన్నించి నిలిచె నంతట భానుమంతుం డపరసర
తంబు చెంత నిలిచె.

సీ. సురభిచంపకతైలపరిషేచనోజ్జ్వల, తక్కరదీపికాపరంపరలతోడ
నభినవాంబరపుష్పహారాంగరాగశృం, గారితరాజలోకంబుతోడ
మందరమంథానమథితాంబునిధిఘుమం, ఘుమితనాసీరసంకులముతోడ
నిబిడాంబుధరగర్భనిర్భేదనారంభ, చటులమాణిక్యధ్వజములతోడ

తే. హాటకానర్ఘ్యమణిశిబికాధిరూఢుఁ, డైనబకదాల్భ్యుతోడ మాద్యత్కరాళి
సవనహయములతోడ గాండీవధరుండు, కౌతుకముతోడ హరిసేనఁ గదిసె న

తే. ఎదురుకొని పౌరభామిను లింద్రసుతుని, మౌళిపైఁ జల్లఁ బ్రోవ్విరుల్ మానిక
గ్రమ్ముకొని యమ్మహాస్థలి గంధవతియు, రత్నగర్భయు ననుట సార్థకముచే

క. బకవైరిముఖ్యులత్తఱి, బకదాల్భ్యమునీంద్రుపాదపద్మములకు వే
డుక మ్రొక్కి యపుడు సైన్య, ప్రకరంబులఁ గలసి కరిపురము సొచ్చుటయుః

క. భూపాలకు లందఱు వివి, ధోపాయనహస్తులై యనూనక్రతుదీ
క్షాపరుఁ డగుధర్మతనయు, శ్రీపాదంబులకు నెరఁగిరి ప్రమోదమునన్.

ఆ. అపుడు విదురముఖ్యు లైనబాంధవసము, త్కరముతోడ నోలగమున నున్న
యాంబికేయునకుఁ బ్రియంబున నెఱిఁగించెఁ శౌరి వరుసతోడ సకలనృపుల. 171

సీ. ఇతఁడు నీలధ్వజుం డీశౌర్యనిధి పుత్త్రి స్వాహకు మగఁడు వైశ్వానరుండు
బభ్రువాహుఁ డితండు పార్థుని బ్రదికించె రణములో జీవదరత్నమునను
జంద్రహాసుండు విస్మయచరిత్రుం డితం డలిగినఁ బంకింతు రమరు లైన
బర్హికేతనుఁ డీనృపాలుఁ డే నడిగిన సగ మిచ్చెఁ దనువు నిశ్శంకఁ గోసి

తే. యితఁడు హంసధ్వజుఁడు వీనిసుతులశిరము, లాజి రుద్రుండుధరియించెహారములుగ
వీరవర్మ జమునిమామ వీరియట్లు, యొకరికిని నొక రధికు లీయున్ననృపులు. 172

చ. అని వినిపింప నప్పు డమరాధిపసూనుఁడు వచ్చి ధర్మనం
దనునకు నమ్రుఁడై కెళవునన్ భజియింప ముదశ్రుపూరలో
చన యయి కుంతి క్రీడి బహుశస్త్రగణవ్రణితాంగముం గరం
బున నిమిరెం దనుం గదిసి మ్రొక్కినకర్ణజుఁ గౌఁగిలించుచున్. 173

ఉ. ద్రౌపది యోషధుల్ గొనుచు రా ననుయాయిమురారిముఖ్యు నా
నాపృథివీశ్వరుండు యమనందనుఁ డధ్వరభూమి శుద్ధిఁగా
బాపఁదొడంగె నాఱువృషభంబులఁ బూనినమేటినాఁగటం
దాపసకోటిమంత్ర పఠనంబులతోఁ జనుదేర నత్తఱిన్. 174

క. ఆదీక్షితు మణికుంభ, స్వాదువిమలగంధసారసలిలంబులఁ గుం
తీదేవకీయశోదలు, సాదరులై చేసి రప్పు డభిషేకంబుల్. 175

ఆ. తొలుత నెనుమనూటతొమ్మిదివైఁ డిట్టి, కల నుపర్ణరూపుగా సమర్చి
యిట్టు లొకటి కొకటి కినుమడిసంఖ్యగా, గరుడవేదిపంచకంబు దీర్చి. 176

సీ. శాస్త్రోక్తి నిష్టకాచయనంబు చేసి యష్టద్వారసవనమండపము నట్ల
కనకంపుటిటికలఁ గట్టించి వివిధరత్నవితానతోరణధ్వజము లెత్తి
బదరిబిల్వపలాశబహువారయూపంబు లాఱునైదును నైదునైదు నిలిపి
స్రుక్స్రువోలూఖలజుహువులు మొదలైన యజ్ఞసంభారంబు లలవరించి

తే. వింశతిబ్రహ్మకల్పజీవితు విశేష, పారగుం డగుబకదాల్భ్యు బ్రహ్మఁ జేసి
యాగమరహస్యనిస్సంశయక్రియాతి, చతురు సాత్యవతేయు నాచార్యుఁ జేసి.

## ధర్మజుం డశ్వమేధంబు గావించుట.

వ. వసిష్ఠ వామదేవ రోమశ సుమంత గాలవ కపిల సౌబరి భరద్వాజ భాగురి రైభ్య జమదగ్ని జతుకర్ణ కౌండిన్య గౌతముల ఋత్విజులంగా వరియించి, ఆరుణి పులహోపమన్యు విశ్వామిత్ర మధుచ్ఛంద విభాండక ధౌమ్యవాయుభక్షుల గర్గో[illegible] మంత్రంబులు పఠియించుచు బహిర్ద్వారంబుల నుండ నియమించి ధర్మనందనుం

మృగశృంగధరుండును రురుచర్మవసనుండును గుశాసనుండును నై యున్నసమ
యంబునఁ బరాశరాత్మజుండు రాజలోకంబు నవలోకించి మీరు కళత్రసమేతులై
జాహ్నవీపవిత్రోదకంబుల నజాతశత్రు నభిషేకింపవలయు నన ననసూయాత్రులును
నరుంధతీవసిష్ఠులును రుక్మిణీకృష్ణులును హిడింబాభీమసేనులును సుభద్రార్జునులును
మాయావతీప్రద్యుమ్నులు నుషానిరుద్ధులును బ్రభద్రావృషకేతులును నీలావతీ
మయూరధ్వజులును బ్రభావతీయౌవనాశ్వులును సునందానీలకేతులును ధమ్మిల్లాను
సాల్వులును మొదలుగాఁ జతుష్షష్టిదంపతులు బద్ధపల్లవకలశంబులు గొనుచు మంద
మందగమనంబునఁ గదలి ముందటఁ గ్రందుకొని గీతవాద్యనృత్యంబులు బెరయ
గజాధిరూఢలై విప్రకన్యలు చల్లుమౌక్తికంబులు నెరయ మునిపఠితవేదమంత్రం
బులు మొరయఁ గుంతీదేవకీయశోదలం బురస్కరించుకొని యరుగునవసరంబున.

క. నారదుఁడు సత్యభామా, గారంబున కరిగి పూజఁ గైకొని హరి నీ
కూరిమిప్రియుఁ డందు విప్రుఁడు, దారుక్మిణి కిచ్చెఁ బెద్దతన మెట్లనినన్. 179

శా. రాజన్యుల్ సకళత్రులై యరుగుదేరం జామరచ్ఛత్రవి
భ్రాజిష్ణుం డగుకృష్ణుఁ గూడుకొని దాంపత్యంబునన్ రుక్మిణీ
రాజీవానన యేఁగ నీ చనవు వ్యర్థం బయ్యెఁ బొమ్మన్న స
త్రాజిత్పుత్త్రి యనున్ దను న్మఱచునే ప్రాణేశ్వరుం డయ్యెడన్. 180

క. అని తన కేళీసౌధం, బున నున్నమురారిఁ జూప ముని విస్మితుఁడై
వనజోదరుఁ డెయ్యెడ లేఁ, డని కొనియాడుచు నిజేచ్ఛ నరిగెన్ బిదపన్. 181

తే. మేలముఁతోఁ జతుష్షష్టిమిథునములును, బద్ధచేలాంచలంబులై ప్రసవగంధ
పూజితస్వర్ణకుంభసంపూర్ణ జాహ్నవీపవిత్రోదకంబులు వేడ్కఁ దెచ్చి. 182

సీ. శుభతూర్యరవము భూనభములఁ బూరింప విహితమంత్రములు ఋత్విజులు చెప్ప
మఖవాహమునకు హేమకటాహమునఁ బోసి యమునూతి కభిషేక మాచరింపఁ
బూతాత్ముఁ డగుధర్మపుత్త్రుండు పరమసం యమివరేణ్యులపదాబ్జములు గడిగి
కనకాసనము లిడి కౌశేయగంధమాల్యవిభూషణముల నలంకరించి

తే. యుక్తదక్షిణ లర్పించి యూపబద్ధ, హయముఁ బాంచాలియును దాను నర్థిఁ బూజ
చేసి వలగొని వహ్నిరోచిర్ముఖమునఁ, జెంది గంధర్వలోకంబుఁ జేరు మనిన. 183

క. సాభిప్రాయత నది ప్రో, ధాభినయముఁ జూప నకులుఁ డశ్వహృదయత
త్త్వాభిజ్ఞుఁ డగుట ధర్మత, నూభవునకు విన్నవి[illegible] విచిత్రముగన్. 184

తే. క్రతువులకు నెల్ల హరి కర్మకరుఁడు గామి
స్వర్గఫలమాత్ర మిపుడు సాక్షాత్కరించి
శౌరియున్నాఁడు మా మకాస్యమున ననుచు
సభికులకుఁ జెప్పె నని కృష్ణసహితఋషులు. 185

మ. క్రతుగంధర్వము మంత్రపక్షముల సంస్కారంబు గావించి ది
వ్యతపోగణ్యుఁడు ధౌమ్యుఁ డాహవనము సర్వశ్రోత్రకోణంబు పీ
డితముం జేయఁ బయఃకణప్రకర ముడ్డీనంబుగాఁ జూచి వి
స్మితులై పాండవముఖ్యు నధ్వరసభాసీనుల్ ప్రశంసింపఁగన్. 186

క. మారుతి పురోధ యనుమతి, దోరసిచే హయముశిరముఁ దునిమిన నది య
ధారణిఁ బడక దివికిఁ దే, జోరూపముతోడ నెగసి సూర్యునిఁ గలసెన్. 187

క. మురహరుఁ డత్తురగకళే, బరము విశసనంబు సేయుఁ బటుతర మగు నా
హరితేజము హరిఁ గలసెను, గర మరుదుగఁ బలలరాశి కప్పుర మయ్యెన్. 189

క. మను లయ్యపఘనసారము, ఘనసారం బైనఁ జిత్రకర మిది కుంతీ
తనయాగ్రణి సౌభాగ్యం, బన కెయ్యది మేర యనుచుఁ బొగడుచు నుండన్.

క. ఆహయకర్పూరము ప్రథ, మాహుతిగాఁ జేసి స్రువము నాచార్యుఁడు కౌ
తూహలమున నింద్రాయ, స్వాహా యనఁ జేయి సాఁచి శతమఖుఁ డందెన్. 190

సీ. అట్లు వేదవ్యాసుఁ డాహుతు లొసఁగఁ బర్యాయంబున నిలింపు లందుకొనిరి
యాహోమమున సచరాచరత్రైలోక్యమునఁ జాల సంతృప్తి వొదలె నపుడు
సురభి పురోడాశసోమపానముల నానందించె ఋత్విగ్గణంబు వరుస
యమతనూభవుఁడు పూర్ణాహుతి వేల్చి బాంధవులతో నవభృథస్నాన మాడ

తే. సోమయాజులఁ జూచి కృష్ణుండు నగుచుఁ, గదిసి యందంద బిగియారఁ గౌఁగిలించె
నాయరుంధతి యనసూయ లాదియగువ, ధూజనం బిచ్చె వివిధనీరాజనములు. 191

తే. మాని బకధాల్భ్యవరు రత్నమయవృషంబు, దాన మిచ్చి పరాశరాత్మజు నకఖిల
వసుధ యాచార్యదక్షిణ యొసఁగ నతఁడు, తిరుగ నమ్మినధన మిచ్చె దీనులకును.

చ. అరదము సింధురంబు నసుయాయిచతుష్కము భార మర్థము
న్నరిదళకంబు గోశతము నాలుగుసూనలుముత్తియంబులున్
గురుకులమౌళి ఋత్విజులకున్ బ్రతిహారుల కర్థి నిచ్చి యం
దఱకుఁ దదర్థముల్ ధనము లన్యసదస్యుల కిచ్చె దక్షిణల్. 193

తే. కోటిసాష్టాలు దశశతఘోటకములుం, వారణశతంబు నొక్కొక్క వరుస తొడవు
లిచ్చె వేర్వేఱ నృపతుల కిందు రెట్టి, యాదవుల కెల్ల నర్పించె నాదరమున. 194

క. అనిలసుతపార్థమాద్రీ, [illegible]లు మన్నించి బహువిధము లగుమణిమం
డనముల రుక్మిణి మొదలగు, వనితలఁ బూజించి రధికవాత్సల్యమునన్. 195

చ. అతులితభక్తిఁ గృష్ణుఁ గనకాసనసంగతుఁ జేసి రత్న సం
తతుల నలంకరించి యమనందనుఁ డర్మిలి ధారవోసెఁ ద
త్క్రతుఫల మమ్మహాత్మునికరంబున నప్డు డనల్పకల్పక
క్షితిరుహపుష్పవృష్టి గురిసెన్ మొరసెన్ దగ దివ్యదుందుభుల్. 196

చ. మఖపరిపూర్తిఁ గన్గొని సమస్తజనంబులు నుబ్బి వేనవేల్
ముఖముల ధర్మనందనుఁ బ్రమోదమునం గొనియాడి రప్పు డ
య్యఖిలనృపాలకోటికి మహర్షులకుం దనపాకచాతురీ
సుఖ మెఱిఁగింప గంధవహసూనుఁడు విందని చెప్పె నేర్పునన్. 197

క. బిరుసింతగాక నడిమికి, మురియక ననుబ్రాయివడిచి ముడిఁబాఱక యే
బెరికియును లేక మిక్కిలి, గరగర నగు నేఱుబ్రాలకలమాన్నంబుల్. 198

చ. సరములరీతిఁ గ్రొన్నెలలజాతి బిసంబులభాతిఁ బద్మకే
సరములభంగిఁ దారకలసంగతిఁ దార్పులమాడ్కిఁ బుష్పచుం
జరులవిధంబునన్ మణులచాడ్పునఁ బెక్కులు గంధతైలపా
కరచితముల్ విచిత్రములు కమ్మనిసైఁ దపుఁబిండివంటలున్. 199

ఆ. పత్త్రిపుష్ప మూలఫలశలాటువులచే, బహువిధముల శాకపాకములును
భిన్నరుచులు గానిపింప నిమేషమా, త్రంబులోన నాయితంబు సేసె. 200

క. పరిపరిధూపంబుల నర, విరులతెరల రత్నదీపవితతుల నూర్ణా
స్తరణములఁ బొలుచుశాలలఁ, బరమఋషులు నృపులు వరుస బంతులు సాగన్.

తే. పసిఁడియొడ్డనలను మించుపద్మరాగ, భాజనంబుల వడ్డించుబహుపదార్థ
వితతు లమరెను మేరుసంగతసహస్ర, కరునిఁ బొదివినచిత్ర మేఘములకరణి. 202

క. అత్తఱి షడ్రసయుతము, లుత్త మలర భక్ష్యభోజ్య లేహ్యాదికముల్
పత్తచకోరాక్షు లిడం, గుత్తుకబంటిగ భుజింపఁ గొందఱు తపసుల్. 203

సీ. చింపివల్కము లేమిచేసెడి దనఁ గావు నెఱిపైనకండమండెఁగలుగాని
తెగినజందెము లేల తెచ్చెద రనఁ గావు వినుఁ డివి సన్నసేవియలుగాని
యౌదుంబరము లనర్హము లొల్ల మనఁ గావు నమలిచూడుఁడు మోదకములుగాని
ఫేనపుంజము లేల పెట్టెద రనఁ గావు నీపాదమాన ఫేనికలుగాని

తే. యంచు వాచంయములువల్కు నబ్జముఖులు, నగుచు నొడఁబడఁ జెప్పు నందఱు యథేష్ట
రుచుల భుజియించి వార్చి కర్పూరవీటి, కానుగంధప్రసూనసౌఖ్యములఁ దనిసి.

క. అనిలజునిఁ బెక్కుభంగులఁ, గొనియాడుచు సవనవాటిఁ గొలువున్నతఱిన్
జనుదెంచిరి దమలోపల, నెనయక కలహించుకొనుచు నిరువురువిప్రుల్

క. ఆవిప్రు[illegible]పుడు ధర్మజు, దీవించి వివాద మొకటి తీర్పనగు ననన్
మీవాదము దీర్చెదరు స, భాసదు లీయవనిపులును బకదాల్భ్యు లనన్. 206

తే. వినుఁడు నే యజ్ఞశర్మ నీవిష్ణుశర్మ, చేత నొకవృత్తిఁ గొంటి నా క్షేత్ర మిపుడు
దున్న నం దొకనిక్షేప మున్నఁ దన్నుఁ, బిలిచి కైకొను మన్న నొప్పించుకొనఁడు.

క. నావిష్ణుశర్మ యిట్లను, నే వృత్తి క్రయంబువరుసను నిచ్చిన పిదపన్
నావిత్తమె ధర్మ మెఱుఁగఁ, డీవెఱ్ఱి యటన్న వెన్నుఁ డిట్లనె నగుచున్. 208

క. తెగ దిప్పుడు మూన్నెల్లకుఁ, దగ వెడుగఁగ రెండు దీర్చెదను బొండు వృథా
జగడింపకుఁ డన వారలు, నగరికె నిక్షేప మొప్పనము చేసి చనన్. 209

మ. యమసూనుం డనుఁ గృష్ణుఁ జూచి బకదాల్భ్యవ్యాసకణ్వాదిసం
యములుండన్ దెగుఁదెంపు సేయ కిటు లేలా వారిఁ బొమ్మంటి న
న్న ముకుందుం డను నీసమక్షమున నానాసౌఖ్యగోష్ఠిన్ వినో
దములన్ బ్రొద్దులు పుచ్చ నెక్కుడివివాదం బంచు నట్లంపితిన్. 210

క. అంతఁ గలియుగము చొర నీ, శాంత మడిగి వారు మగుడ జగడింప ధరం
బంతయును బంచియిచ్చెద, నంతియ కాదు విను కలియుగాచరణంబుల్. 211

సీ. ఆమ్నాయపథవిహీనాచారములచేతఁ బ్రబలు సర్వోర్వ్యవైరములచేత
నన్యాయవర్తనులైన రాజులచేత సమకొన్న దుర్వ్యసనముల చేత
ధర్మపత్నీనిరాదరకృత్యములచేతఁ బ్రథసించు వేశ్యాభిరతులచేతఁ
బరధనపరదారహరణబుద్ధులచేత నలమినఘోరమోహములచేత
తే. జాలికాదులచేత దూషకులచేతఁ, బ్రల్లదులచేత వంశనాశకులచేత
డాంబికులచేతఁ జచ్చిబండగులచేతఁ, గల్లరులచేత దర్పించుఁ గలియుగంబు. 212

క. సారిది ననాచారంబులఁ మురు వడుచుం బ్రథమపాదమునఁ గలిమహిమం
బెరుగును వడ్లును గలిపిన, కరణిన్ వర్ణాశ్రమములు కర్తరి గలయున్. 213

క. ఆసమయంబున ధర్మజ, నే సోమకులంబునను జనించి కుటిలులన్
శాసించి ధరణి పాలన, చేసెదఁ దగ సాళ్వనారసింహుఁడ ననుచున్. 214

చ. అని వినిపించి శౌరి శమనాత్మజుఁ డర్మిలి నిచ్చుపూజ లై
కొని సకుటుంబుఁడై నృపతికోటి భజింపఁగ ద్వారకాపురం
బున కనురక్తితో నరిగి పూర్వపదంబుల నిల్పె రాజులన్
జననుతుఁ డాయుధిష్ఠిరుఁడు సర్వధరిత్రియు నేలె నున్నతిన్. 215

మ. అనువారంబు నజాతశత్రుహయమేధారంభమున్ యావనా
శ్వనృపాలాదిమహీశవర్తనములున్ సద్భక్తిఁ బాటించి వి
న్నను రామాయణభారతశ్రవణకన్యాగోసహస్రక్షమా
ధనదానాధికపుణ్యముల్ దొరకు మర్త్యశ్రేణి కశ్రాంతమున్. 216

క. ప్రేమమున శ్రోత వక్తకుఁ, జామీకరహయము ధవళచామరములు నా
నామణివిభూషణంబులు, గ్రామముఁ గృపసేయవలయు గ్రంథసమాప్తిన్. 217

క. అని జైమిని వినిపించిన, జనమేజయజనవిభుండు సంతసమున న
మ్మునివరుని గౌరవించుచు, వినియెం దదువాటికథలు వేడుక ననుచున్. 218

సీ. నీకును మల్లమాంబాకుమారునకు సోమకులాంబునిధిపూర్ణిమావిధునకు
భరతకీర్తిక్షిదులాపురుషాదిదానాంబు జంబాలితాస్థానసౌధునకును
బరరాజభీకరధరణీవరాహున కాత్రేయగోత్రపవిత్రునకును
గుండయనరసింహమండలేశ్వరునకు సభ్యుదయపరంపరాభివృద్ధి
తే. కరముగా భారతీతీర్థగురుకృపాస, మృద్ధసారస్వతుఁడు సత్కవీంద్రసఖుఁడు
సుకవిమల్లికషోల్లసత్కలితహస్త, పల్లవుఁడు చెప్పెఁ బినవీరభద్రసుకవి. 219

శా. గౌరీమానస రాజహంసకుమరీకందర్ప చోళీకపో
లాలంకారళకీకరార్పితవిలాసాళల్ప లాటికళా
కేళీకౌతుకమాళవీమధురసంగీతాదరస్వాంత నే
పాళీకుంకుమపంకలిప్తకుచకుంభన్యస్తహస్తాంబుజా. 220

పాదభ్రమకము.

క. వీరవరక్షైరవరవీ, సారసభరసౌధయూథసౌరభసరసా
వారణరథ్యరణరవా, తారభవనతానమావతానవభరతా. 221

మత్తకోకిల. శర్వరీశకులావతంసయశః ప్రతాపవిభూషణా
గర్వితాహితరాయమీసరగండభీకరవిక్రమా
పూర్వవిశ్వవసుంధరాభృపపూర్వదిక్తటహార కా
నిర్విశేషవిషానుబంధురనిత్యసత్యగుణోదయా. 222

గద్యము.

ఇది భారతీతీర్థ శ్రీచరణకరుణాపాత్ర గాదయామాత్యపుత్త్రి వినయవిద్యాసముద్ర
పినవీరభద్రప్రణీతం బైనజైమినిభారతంబునం దశ్వమేధపర్వంబున
సర్వంబును అష్టమాశ్వాసము.